# సంఘవిరోధి!

[నవల]



★

తాళ్ళూరు నాగేశ్వరరావు

★

ప్రజాసాహిత్యపరిషత్తు
తెనాలి-2

# అవలోకన

జగత్తంతా ఒక కథ, — జగత్కథ.

పుట్టటం ఒక కథ; పుట్టినవాళ్లు బ్రతకటం ఒక కథ; బ్రతికిన వాళ్లు చావటం ఒక కథ.

జీవితం ఒక బృహత్కథ!

ఎక్కువమంది జీవితాలలో సఫలతలకంటే విఫలతలు ఎక్కువ; సుఖాల కంటే దుఃఖాలు అధికం; ఆశావాదంకంటే నైరాశ్యవాదం ప్రధానం. ఇవి మానవునిలో గోచరించే నగ్నసత్యాలు. కొద్దిమంది జీవితాలలో మాత్రం వీటి వ్యతిరేకతలు వుంటాయి.

మానవుడు తనచుట్టూ కనుపించే యీ సుఖదుఃఖాల వెలుగునీడలను అనుభూతి చెందకుండా వుండలేడు, మానవుడు సంఘజీవి కనుక. అయితే మానవుడు వీటిలోనే మునిగి వుండలేడు, సంఘజీవితాన్ని అధిగమించటం మానవుని ఆదర్శంకనుక. అందుకే మేధావి అయిన బ్రౌన్లే అంటాడు, "Man is not man at all unless social; but he is not much above the beasts unless more than social." సాంఘికుడుకాని మానవుడు మానవుడేకాడు; అయితే, సాంఘికునికంటే ఇంకా పైకి పోక పోతే మాత్రం మానవుడు పశువుకంటే ఉత్కృష్టం ఏమీ కాడు.

ఈ రెండు దశలను నిర్వహించటంలోనే వుంది మానవుని గొప్పతనం. ఒకటి వాస్తవవాదం, రెండవది ఆదర్శవాదం. సంఘజీవిగా వుండటం వాస్తవవాదం, సంఘజీవితాన్ని అధిగమించి పైకిపోవటం ఆదర్శవాదం.

ఏ కథాశిల్పి యీ రెండు దశలనూ తన కళాకృతిలో చిత్రించగలడో ఆ కథాశిల్పి ఉత్తమశిల్పులలో ఒకరు.

శ్రీ తాళ్లూరి నాగేశ్వరరావు ఇటువంటి ఉత్తమశిల్పులలో ఒకరు. ఆయన నవల "సంఘవిరోధి" వ్యక్తిలో దాగివున్న మనోవైజ్ఞానిక రహస్యాలకూ సంఘ నియమశృంఖలాలకూ మధ్యసాగే వైరుధ్యాలను విచిత్ర వర్ణాలలో, వివిధ లయలలో చిత్రిస్తుంది.

శ్రీ నాగేశ్వరరావు ఎన్నో వందల కథానికలు వ్రాశారు; కొన్ని నవలలు వ్రాశారు. గ్రామాలలోని మధ్యతరగతి రైతుకుటుంబాల జీవితాలను వీరు ఎక్కువగా చిత్రిస్తారు తమ కథాసాహిత్యంలో. తెనాలి కళాశాలలో వాణిజ్యశాస్త్రోపన్యాసకులుగా వుంటున్నారు.

"సంఘవిరోధి"లో విపరీత మనస్తత్వాల ప్రదర్శన కనుపిస్తుంది. ఇందులో సంఘటనలకంటే సంభాషణల ప్రాచుర్యం ఎక్కువ. కుమారస్వామిలాంటి ఆదర్శజీవి, స్వప్నద్రష్ట, ఆవేశపరునిలో హేతువాదం లోపిస్తుంది. ఉత్తమ ఆదర్శాల సద్గుణాలతోపాటు తన అన్నగారి విరోధులు తనకు బోధించే మాటలను నమ్మే దుర్గుణాలనుకూడా ఆయనలో చూపించబడినాయి. ఏ వ్యక్తిలోనూ అన్ని మంచిగుణాలే వుండవు. వాటికి తోడు దుర్గుణాలుకూడా కొన్ని వుంటాయి అనే మనోవైజ్ఞానిక సత్యాన్ని వ్యక్తపరిచారు రచయిత ఇందులో.

పరమదుర్మార్గులు అనేవారిలో ఒకటి రెండు గొప్పగుణాలను చూపటం; గొప్ప సన్మార్గులు అనేవారిలో ఒకటి రెండు నీచగుణాలను చూపటంద్వారా వ్యతిరేక రసాన్ని (Sense of contrast) సృష్టించటం కథాసాహిత్యంలో ఒక ప్రక్రియ. ఈ నవల అంతటికీ గొప్ప ఉదారమైన, ఉదాత్తమైన పాత్ర శశిరేఖ. అటు భర్తనూ ఇటు మరిదినీ ఎంతగానో ఐక్యపరచింది తన చల్లని స్వభావంద్వారా, తన ప్రజ్ఞాపాటవంద్వారా. భర్త సుదర్శనం, మరిది కుమారస్వామీ ఉభయులూ మొండి పట్టుదలగల మనుషులే. ఎదటివాళ్ళ అభిప్రాయాలు మారాలంటారేగాని తమ స్వీయాభిప్రాయాలను మార్చుకోరు. అటు వాళ్ళిద్దరి స్వభావాల్లో మార్పును తేగలిగింది శశిరేఖ. ఆమెలోని సహిష్ణుతా, దూరదృష్టీ అమోఘం. అటువంటి ఉత్తమ ఇల్లాలు తుదకు, తన భర్త అవిటివాడయిన తరువాత కామ ప్రభావానికి లోబడి సంఘదృష్టిలో అవినీతి అనబడేదాన్ని ఆచరిస్తుంది. అంతవరకూ చదువుతూ వచ్చిన పాఠకుని మానసం ఒక్కసారి తల్లడిల్లిపోతుంది ఈ ఘట్టంతో. విశాలదృష్టిగల, మానవ మనోరహస్యాలను అర్థంచేసుకొన్నవారు శశిరేఖమీది విలువను పోగొట్టుకోరు. అలా కాని వారి దృష్టిలో మాత్రం శశిరేఖ కులట, పతిత అవుతుంది.

ఆధునిక మనోవిజ్ఞానంలో సిగ్మండ్ ఫ్రాయిడ్ ప్రవేశపెట్టిన మనో విశ్లేషణ (Psycho-analysis) ఒక విధమైంది, డాక్టర్ సి. జి. యూంగ్ (Jung) ప్రవేశపెట్టింది మరో విధమైంది. మానవజీవితంలో ప్రధానభాగం అంతా మానవుని అధోచేతన (Subconscious) మీదే ఆధారపడి వున్న దంటాడు ఫ్రాయిడ్. అది కాదు, అధోచేతినకంటే ఊర్ధ్వచేతన (Superconscious) జీవితంలో చాలా గొప్పది. మానవునిలో దాగివున్న గుప్తస్వభావాలను అర్థంచేసుకోటంలో అధోచేతనమీద మాత్రమే ఆధార పడితే చాలదు. ఊర్ధ్వచేతనమీద అంతకంటే ఎక్కువ ఆధారపడాలంటాడు డాక్టర్ యూంగ్.

ఫ్రాయిడ్ సిద్ధాంతం ప్రకారం స్వభావాలన్నీ అణగిపోయి గుప్తంగా అధోచేతనలో దాగివున్న కామపిపాసకు ప్రతిబింబాలే. మాతృప్రేమ, పితృప్రేమ, అన్నలప్రేమ, అక్కలప్రేమ, ఇవన్నీకూడ దాగిన కామపిపాసకు వేరువేరు రూపాలే అంటాడు ఫ్రాయిడ్. కనుక ఎంత గొప్ప వ్యక్తిలోనైనా యీ కామపిపాస ఏదో రూపంలో సుస్పష్టంగానో అస్పష్టంగానో తలెత్తితే మనం ఆశ్చర్యపోవాలసిన పనిలేదు. ఇక్కడ శశిరేఖలో కూడ అంతే.

ఆ పిపాసను లొంగటం గొప్పదనానికి చిహ్నం అనికాదు, అందుకు లొంగనివాళ్ళు ధన్యులే; అయితే లొంగినవాళ్ళంతా మాత్రం నీచులు కారు. కొందరిలో ఈర్ష్యలుండవు, ద్వేషా లుండవు, కోపాలూ తాపా లుండవు; ప్రేమా, జాలీ, ఓర్పూ, ఔదార్యం, త్యాగం వుంటాయి. ఇన్ని వుండి ఏదో సమయంలో, ఏదో మైకంలో ఇతర్లతో శారీరకసుఖాన్ని అనుభవించటంలోనికి జారతారు. ఇందువల్ల వాళ్లో సుగుణాలన్నీ మంటలో కలిసిపోయినట్లా ?

ఇటువంటి లైంగిక (Sexual) సత్యాలను నిపుణకథాశిల్పి అయిన డి. హెచ్. లారెన్సు తన రచనల్లో చాలాచోట్ల ప్రదర్శిస్తాడు. ఆయన రచించి ఇప్పుడు నిషేధంలోవున్న గొప్ప నవల "లేడీ చాటర్లీస్ లవర్" యీ లైంగిక సత్యాన్నే అద్భుతంగా చూపుతుంది. టాల్ స్టాయ్ రచించిన "అన్నా కెర్నినా" లోని అన్నా ఎంతో సుగుణవంతురాలు. భర్తనూదా,

తనయుడిమీదా కూడ ఎంతో ప్రేమగౌరవాలు. అయితే ఏమి? తాను ప్రేమించినా, తనను ప్రేమించినా రాన్స్కీని వదలి వుండజాలదు. భర్తనూ, కొడుకునూకూడ వదలి అతనిదగ్గర కెళ్లిపోయి వుంటుంది. కాని, భర్తా, కొడుకూ జ్ఞాపకాలతో తన ప్రియుని దగ్గరా సుఖంగా వుండలేదు!

ఇంతకూ లైంగికంగా ఇతర సంబంధం వున్నంతమాత్రాన సద్గుణాలు గల వ్యక్తి దుర్మార్గులలో లెక్కరాదు. అది లేకపోతే ఆ వ్యక్తి అంతకంటే గొప్పవారిలో లెక్క అనటంలో కూడ సందేహంలేదు.

కథాసాహిత్యంలో వాస్తవవాదం, ఆదర్శవాదం రెండు ప్రధాన వాదాలు. వ్యక్తిలో సంఘంలో ఏమి యదార్థంగా జరుగుతూన్నదో దాన్ని వున్నది వున్నట్లుగా చిత్రించటం వాస్తవవాదం. అంటే వాస్తవవాదం బాహ్యజగత్తుకు అద్దం అన్నమాట. లోకంలోని ప్రతి చిన్న వివరం యీ అద్దంలో ప్రతిబింబిస్తుంది వున్నదున్నట్లుగా.

ఇక ఆదర్శవాదం ఏవిధంగా జరుగుతూన్నదీ అనికాక ఏవిధంగా జరిగితే బాగుంటుంది అనే దాన్ని చూపిస్తుంది. 'ఎలా వున్నది' అనే దాని వాస్తవవాదం చూపితే 'ఎలా వుండాలి' అనేదాన్ని ఆదర్శవాదం చూపుతుంది. అంటే లోకానికి ఎలా వుండాలో దారిచూపే దీపం ఆదర్శవాదం. వాస్తవవాదం అద్దం అయితే ఆదర్శవాదం దీపం. అద్దంలో కనుపించిన దాన్ని దీపంతో సరిదిద్దుకోవాలి.

ఇంతవరకు కథాసాహిత్యంలో అంతులేని వాస్తవవాదం పెరిగిపోయింది. సంఘంలోవున్న నగ్నసత్యాలన్నీ ప్రత్యక్షం చేయబడినాయి. సంఘంలో ఎప్పుడూ మంచికంటే చెడే ఎక్కువుంటుంది. ఒక కన్యను ప్రేమించి పెళ్ళిచేసుకొంటానని నమ్మించి ఆమెకు గర్భంరాగానే తన తల్లిదండ్రుల వత్తిడికి లొంగిపోయి మరొకర్ని చేసుకొన్న యువకులను చిత్రించటం కాక తల్లిదండ్రుల వత్తిడిని లెక్కచేయక, ఇంకా ఇతర స్వార్థాలను త్యాగంచేసి ఆ ప్రేమించిన గర్భిణీకన్యనే వివాహం చేసుకొన్న యువకులను చిత్రించాలి. ఇటువంటి వివాహాలను వద్దని వత్తిడిపెట్టే తల్లిదండ్రులనుకాక చేసుకోమని బలవంతపెట్టే తల్లిదండ్రులనే చిత్రించాలి.

"సంఘవిరోధి"లో మునసబు హరినారాయణపాత్రను రచయిత ఆదర్శ వాదంలోనే చూపెట్టేరు. తనకు మునసబుగారి కూతురు శైలారాణి వ్రాసిన ప్రేమలేఖను కుమారస్వామి మునసబుగారి చేతిలో పెడతాడు కోపంతో. అయినప్పటికీ మునసబుగారు ఏమీ ఉద్రేకం చెందడు, కూతుర్ని అడగడు, ఆమెమీద కోపపడడు. పైగా కుమారస్వామిని తనకూతురు చేసుకోటానికి తన సమ్మతిని ప్రకటించటమే కాక అందుకు ప్రయత్నిస్తాడుకూడ. అంటే ఇదే అవతలవ్యక్తి కుమారస్వామి కాక అంతకంటే అన్నివిధాలా తక్కువ రకంలో వున్న యువకుడైతే మునసబుగారు ఎలావుండేవారో తెలియదు. అలాంటప్పుడుకూడ ఆయన అదేవైఖరిలోవుంటే నిజంగా ఆయనెంతో ఉదాత్తచరిత్రుడు. అటువంటి వ్యక్తుల్ని చిత్రించటం ఎంతో అవసరం.

ఈ రచనలో ధర్మోపన్యాసాల ధోరణి కొంచెం ఎక్కువయినదేమో అనిపిస్తుంది! రచయిత వాడిన భాషా, భాష వ్యక్తంచేసిన భావాలూ మృదులంగా వున్నాయి. సూక్ష్మమైన ప్రకృతివర్ణనలుకూడ కమనీయంగా వున్నాయి. కొన్ని స్వయంగా కల్పించిన సూక్తులుకూడ మనోహరంగా వున్నాయి. ఒకచోట కుమారస్వామి అనుకొంటాడు కొంగలగుంపునుచూచి:

"చేపలు నీటిలో పురుగుల్ని తింటాయి. చేపల్ని కొంగలుతింటాయి. కొంగల్ని మనుషులు తింటారు. మనుషుల్ని మనుషులే తింటారు."

రచన దేని నిమిత్తం? రచన నిమిత్తమే రచనా లేక మరొకదాని నిమిత్తం రచనా అనే చర్చ చాల పాతబడిపోయింది. రచన సంఘానికివ్వాలసింది శ్రేయాన్నా లేక ప్రియాన్నా? నీతిబోధకమైందే ఉత్తమ రచనా లేక నీతి లేకపోయినా రసానందాన్ని ప్రసాదించేదికూడ ఉత్తమ రచనేనా? విషయవస్తువు అసామాన్యంగావుంటేనా అది శ్రేష్ఠమైన రచనా, సామాన్య విషయవస్తువును చిత్రించే రచన శ్రేష్ఠమైంది కాదా? విషయవస్తువుతో సంబంధంలేకుండా నిర్మాణకౌశలం (టెక్నిక్) గొప్పగావుంటే ఆ రచన గొప్పరచన అవుతుందా? ఇటువంటి కళాసమస్యలన్నీ ఒకప్పుడు ప్రాధాన్యాన్ని వహించి నేడు కొంతవరకు పాతబడిపోయినాయి. వీటిలో ఏదీ అసమంజసం కాదు. ఇదిమాత్రమే ఉత్తమకళ అని హద్దులేర్పరచి శాసించలేరు. భిన్నభిన్నవిధాలయిన ఉత్తమ కళాకృతు

లుండవచ్చు. భిన్నభిన్న కళాకారులనూ, వాళ్ళ దేశకాల భేదాలనూ అనుసరించి, ఆ వాదానికి చెందిందే నిజమైనకళ, యీ వాదానికి చెందిందే నిజమైన కళ అనటం మానవుని సృజన శీలతకే దెబ్బ.

ప్రాచీనులది ప్రధానంగా పద్యసాహిత్యం; ఆధునికులది ప్రధానంగా గద్యసాహిత్యం. అందులో కల్పనాసాహిత్యం (కథానికా, నవలా) నేటి రచయితకు ప్రధాన ఆత్మప్రకటనగా నిలిచిపోయింది. పాఠకునికి అది ప్రధాన ఆనందంగా వుంటూన్నది. ఈసాహిత్యం ప్రపంచంలో ప్రచారంలో వున్నంతగా మరే సాహిత్య ప్రచారమూలేదు. రచయిత తన అనుభూతిని లోకానుభూతితో మిశ్రపరచి రసానుభూతిని సృష్టించటంలో కల్పనా సాహిత్యం ప్రత్యేకంగా పనికివస్తుంది.

ఇటువంటిరచనే తాళ్లూరివారి "సంఘవిరోధి". దీన్ని సుఖాంతంగా ముగించక విషాదాంతంగా ముగించటంద్వారా పాఠకుని హృదయంమీద ఎక్కువ లోతైన ముద్ర వేశారు. ఆ ముద్ర తినగానే సామాన్య పాఠకునికి సంతృప్తీ, బాధా రెండూ జనిస్తాయి. అలా భర్తకు ద్రోహంచేసిన పతితకు తగిన శాస్తి దొరికిందనే సంతృప్తీ, కుమారస్వామి హంతకుడుగా మారాడనే బాధా ఈ రెండూ సూచిస్తాయి, రచయిత కృషి ఫలించిందని!

—సంజీవదేవ్.

ఊరికి అరమైలు దూరంలో ఉంది ఆ చెరువు. గట్టు పైన పచ్చని చెట్లు. మామిడి, వేప, రావి, తుమ్మ, గానుగ మొదలైన చెట్లు — కోటను సైనికులు కాపలా కాస్తున్నట్టు చెరువును కాపలా కాస్తుంటాయి. ప్రకృతి సహజమైన కాపలా అది. ఆ చెరువువల్ల ఊరికి ఏమీ ఉపయోగం లేదు. దాని ఉనికిని గూర్చి ఊళ్లో మనుష్యులకు అభిలాష లేదు. ఆ చెరువులోని నీటిని ఎవ్వరూ త్రాగరు. అవి మురికి నీరు; ఉప్పగా వుంటాయి; చెడు వాసనకూడ వస్తుంది. కాని పక్షులు ఆ నీటిని త్రాగుతాయి. మనుష్యులు పశువులకు ఆ నీటిని త్రాగిస్తారు. ఆ చెరువు వల్లనే గట్టుపైన చెట్లు తేమ కొరత లేకుండా ఏపుగా, పచ్చగా, బలంగా పెరుగుతున్నాయి. కనుక ఆ చెరువు నిరుపయోగం అని చెప్పటానికి పూర్తిగా వీల్లేదు.

ఊళ్లోనుంచి చెరువుకట్టకు డొంక ఉన్నది. డొంక చివర, అంటే చెరువుకట్ట మొదట్లో ఓ పెద్ద రావిచెట్టున్నది. ఆ రావిచెట్టు క్రింద కొండరాళ్ళున్నవి. ఆ రాళ్ళమీద కూర్చుని రోజూ సాయంత్రం ఓ వ్యక్తి ప్రకృతి సౌందర్యాన్ని మనసారా తిలకిస్తూ వుంటాడు. అతని పేరు కుమారస్వామి. ఆ ఊళ్ళో అతని కొక్కడికే ఆ చెరువువల్ల ఆపాటి ఉపయోగం.

ఆ రోజు సాయంత్రం పసివాని చిరునవ్వులాగ ఎంతో ప్రశాంతంగా, మనోజ్ఞంగా వుంది. రెండు మామిడిచెట్ల మధ్యగా దూరాన పచ్చని పొలాల వెనుక ఎర్రగా అస్త మిస్తున్న సూర్యుడు; ప్రవాహపు ఆవేగంలేని అందంగా పడుతూన్న కడసారి కిరణాలు; చల్లదనాన్ని చేరవేస్తూన్న మెత్తని గాలులు; హాయిని కలిగించే చక్కని వాతావరణం.

కుమారస్వామి ఆ రోజుకూడా ఊళ్ళోనుంచి అరమైలు దూరం నడిచి వొచ్చి, చెరువుకట్టపైన ఆ రావిచెట్టుక్రింద కొండరాళ్ళపై కూర్చుని - సాయంకాలపు కులాసాదృశ్యాల్ని మనస్సుకు హాయిసోకేట్టు చూడసాగాడు. చెరువులోని మట్టి దిబ్బపై ఓ వంద కొంగల వరకూ సభను దీర్చాయి. అవి అంతవరకూ చేపల్ని సుష్టుగా భోంచేసి, ఆయాసం తీరక - ఆలోచనలు చేస్తూన్నట్టు కుమారస్వామికి తోచింది. చేపలు నీటిలో పురుగుల్ని తింటాయి. చేపల్ని కొంగలు తింటాయి. కొంగల్ని మనుషులు తింటారు. మనుషుల్ని - మనుషులే తింటారు! ఈ తినడం జబ్బు సృష్ట్యాదినుంచీ సకల జీవరాసు ల్లోనూ వుంది. పశుపక్ష్యాదులకు ఆ జబ్బు పుట్టుకతోనే అల వడింది. కాని మనిషి మట్టుకు నాగరికత, విజ్ఞానం, సంస్కృతి, ఆధ్యాత్మికతత్వం - అభివృద్ధి చేసికొని, అనుభవాలకోసం ఆ జబ్బుకు దాసు డవుతున్నాడు. మేలిముసుగుల్లాంటి గొప్ప మాటల వెనుక - స్వార్థాన్నీ, ద్వేషాన్నీ, కార్పణ్యాన్నీ, మోసాన్నీ పెంచుకుంటూ, సంఘంలో ముందుకు పోగలుగు తున్నాడు. అతను ఆరాధించే స్వార్థం, చేసేమోసం, పోషించే ద్వేషం, కనబర్చే కార్పణ్యం-ప్రగతికి సోపానాలుగా గుర్తించ

బడుతున్నాయి. అవినీతి పనులకు ఆమోదముద్రలు లభిస్తున్నాయి; నమ్మకద్రోహాలకు గౌరవాభిమానాలు దక్కుతున్నాయి; పచ్చి స్వార్థానికి అంతస్థులు పెరుగుతున్నాయి; నిలువు దోపిడీదార్లకు హోదాలు హెచ్చవుతున్నాయి. మంచీ, మానవత్వం, జాలీ, సానుభూతి, ఆత్మవివేకం - మొదలైన లక్షణాలు గల మనుష్యులు 'ఎక్కడున్నావే గొంగళీ' సామెతలోకి వస్తున్నారు. పైపెచ్చు వాళ్ళకే బ్రతుకు దుర్భరం. కష్టాలు నీడతో సాగిరావడం, నిరాశా, నిస్పృహా, వైరాగ్యం, అబద్ధాలు ఆడడం వృత్తిగా పెట్టుకొన్న వాని జీవనవిధానంలోవున్న హాయి, సుఖం, గొప్పదనం - నీతికీ, నిజాయితీకీ ఖరారుగా నిలబడే వాని జీవన విధానంలో గోచరించడం లేదు. వ్యాపారం చేసేవాడు లక్షలు గడిస్తున్నాడు; మేడల్లో వుంటున్నాడు; కార్లలో తిరుగుతున్నాడు; సంఘంలో ఎత్తుగా కనబడుతున్నాడు. గడ్డను నమ్ముకున్న రైతు బెత్తెడు ఎదగడంలేదు; పూరి కొంపలోనే వుంటున్నాడు; కాలినడకనే తిరుగుతున్నాడు; సంఘంలో మరిగుజ్జుగానే కనబడుతున్నాడు. ఏమిటి ఈసాంఘిక వ్యవస్థ? మనుషులమధ్య ఎందుకీ ఆర్థిక అసమానత్వం? సామాజిక విలువల్లో ఈ తారతమ్యాలేమిటి? పెట్టుబడులు, లాభాలు, సుఖజీవనతీరాలు - ఒకప్రక్క; కాయకష్టం అంగాని శ్రమ, అక్కరకురాని ఆదాయం, నిరంతర జీవితసంగ్రామం - మరో ప్రక్క. వెలుగు-చీకటులతో కూడుకున్న ఈ ప్రపంచంలో వెలుగు వున్నవారికి ఎప్పుడూ వెలుగేనా? చీకటిలో వున్న వారికి ఎప్పుడూ చీకటేనా? అనాదినుంచీ సమాజ నిర్మా

ణంలో వున్న ఈ లోపం ఎప్పటికి తొలగిపోతుంది? మానవాళికి మహోదయం ఎప్పుడు కలుగుతుంది?... తన ఊహకు అందదు. ఈ విషయాన్ని గురించి రోజూ తను ఇక్కడ ఆలోచిస్తున్నాడు. ఇంటి దగ్గర ఆలోచిస్తున్నాడు. వీధిలో నడుస్తూ ఆలోచిస్తున్నాడు. అది తనకు తెగని ఆలోచన...

సూర్యాస్తమయం జరిగాక, పడమటి దిక్కు ఎరుపును గోల్పోయి, ఊదారంగులోకి మారింది.

మునిమాపు మెల్లగా తల ఎత్తింది.

మట్టి దిబ్బపైన కొంగలు పల్చబడ్డాయి.

చల్లగాలి హుషారుగా పచార్లు చేయసాగింది.

దూరంగా రైలు పోతున్న చప్పుడు.

పగలల్లా శ్రమ జేసిన రైతులు ఇంటి ముఖం పట్టారు.

రావిచెట్టు క్రింద కొండరాళ్ళ మీద నుంచి కుమారస్వామి లేచాడు ఇంటికి వెళ్లేందుకు. గాలి తీవ్రతకు అతని వొంకుల జుత్తుతో పాటు, గ్లాస్కో లాల్చీ రెపరెపలాడింది. పైజమా జేబుల్లో చేతులు పెట్టుకొని, డొంక దారినే నడక సాగించాడు. నిత్యమూ సాయంత్ర వాహ్యాళికి ఆ చెరువు కట్టకు రావటం అతనికి అలవాటు. ఏకాంతంగా కూర్చుని, ప్రకృతి శోభను చూస్తూ, ఆలోచించుకోవడం — అతనికి సరదా; సంతృప్తి కూడాను.

డొంక కిరువైపులా ఈతచెట్లూ, తాటిచెట్లూ, చిల్ల కంప — వొత్తుగా ఉన్నాయి. డొంకలో చీకటి కొంచెం

చిక్కనైంది. గాలికి చెట్లు తలలు ఆడిస్తూ చప్పుడు చేస్తున్నాయి - ప్రత్యేకం తాటిచెట్లు. డొంకలో జన సంచారం లేదు. దూరంగా పోతున్న బండి తాలూకు ఎద్దుల గంటలు అస్పష్టంగా వినబడుతున్నాయి.

కుమారస్వామి మెల్లగా నడుస్తున్నాడు. అతని నడక తీరే అంత. వడిగా, చావు కబురు చెప్పబోయే వాళ్ళలా, కొంప లంటుకుపోతున్నట్లూ — నడిచే వాళ్ళంటే అతనికి అరికాలి మంట! నెమ్మదిగా నడవటంలోనే ఎన్నో సౌకర్యాలున్నాయి. ఆలోచించుకోవచ్చు, పరిసరాల్ని గమనించవచ్చు, దుర్ఘటనల నుంచి తప్పించుకోవచ్చు. మెల్లగా, ఆలోచించుకుంటూ, మసకచీకట్లో ఏకాంతంగా నడుస్తున్న కుమారస్వామికి హఠాత్తుగా డొంక ప్రక్కనున్న షావుకారుగా అరటితోటలోంచి ఓ స్త్రీ కంఠం వినిపించింది.

"అబ్బా! వొదలండి! ... ఏమిటీ బలాత్కారం! నేనట్టాంటి దాన్ని కాదండి బాబుగోరూ! ... వొదలండి. కేక వేస్తాను."

పాము కాళ్ళకు చుట్టవేసుకున్నట్టు ఠక్కున ఆగిపోయాడు కుమారస్వామి.

అరటితోటలో, చీకట్లో — ఓ స్త్రీ బలాత్కరించ బడుతోంది! మృగవాడి దుర్మార్గానికి ఓ అబల పవిత్రమైన మానాన్ని కోల్పోతోంది! ఎంత అన్యాయం? ఎంత అక్రమం? సహించరానిది. ఆ దుష్టుని బారి నుండి ఆ స్త్రీ శీలాన్ని కాపాడాలి! — డొంకలో నుంచి అరటితోటలోకి కోపో

భ్రష్టుడై కుమారస్వామి ఒక్క దూకు దూకాడు ఆమెను రక్షించేందుకు.

షావుకారుగారి పెద్దకొడుకు చంద్రశేఖరం యానాది లక్ష్మి కుడిరెక్కపట్టుకొని దగ్గరకు లాక్కుంటున్నాడు. ఆమె పెనుగులాడుతున్నది. ఆమె జడలోని పూలచెండు క్రింద పడింది. చేతిగాజులు రెండు పగిలి నేలపై బడ్డాయి. ఆ దృశ్యాన్ని అరటిచెట్లు స్తంభించి చూడసాగాయి.

బోదెకాలువమీద పదిగజాల దూరంలో నిలబడ్డ కుమారస్వామి కోపావేశంతో వూగిపోతున్నాడు. అతని నరనరాలూ వేడిరక్తంతో ఉబికాయి.

ఆ పిల్ల ఓ పట్టున లొంగేఘటం కాదనుకున్న చంద్రశేఖరం ప్రక్కజేబులోంచి పదిరూపాయల నోటు తీసి ఆమె కళ్లముందు కదులాడించాడు. ఆమె పెనుగులాడటం, విడిపించు కొనేందుకు ప్రయత్నించటం, గోలచేయబూనటం మాని వేసింది. ఎడంచేత్తో ఆ నోటును అందుకొని — శరీరాన్ని అతని వశంచేసింది. చంద్రశేఖరం ఆమె నడుంచుట్టూ బలంగా కుడిచేయివేసి, దగ్గరలో వున్న గుడిసెలోకి లాక్కెళ్ళాడు.

చెంపమీద ఛెళ్ళున కొట్టినట్లయింది కుమారస్వామికి. కొన్నిక్షణాలపాటు నిశ్చేష్టుడై బోదెకాలవపై సరిహద్దు రాయిలాగ నిలబడ్డాడు. అతనిలో ఉవ్వెత్తుగా లేచిన కోపో ద్రేకాలు చప్పగా జారిపోయాయి. సిగరెట్టు నుసిలాగ నిట్టూర్చాడు. గాలికి అరిటాకులు తపతప కొట్టుకున్నాయి — అపహాస్యం చేస్తూన్నట్టు.

"ఛి. ఛీ. లోకం ఎంత పాడైంది! మనుష్యుల్లో అవినీతి రోజురోజుకీ పెరిగిపోతూన్నది. సంస్కారం, ఆత్మనైశాల్యం, సత్కార్యాచరణ – క్షీణించిపోతున్నాయి. పశుకామ ప్రవృత్తిలో పెచ్చరిల్లిపోతున్నారు. ధనమదాంధతతో వావివరుస తెలీని నీచకార్యాలకు దిగుతున్నారు. చంద్రశేఖరం మెడిసిన్ చదువుతున్నాడు. ఎంతో అభివృద్ధిలోకివచ్చి, వ్యాధిపీడిత ప్రజానీకానికి సేవ చేయాల్సినవాడు; తద్వారా దేశానికి ఉపయోగ పడవల్సినవాడు; మంచి భవిష్యత్తు గలవాడు. వయస్సుపెట్టే తొలి గిలిగింతలకే బానిసై, దురలవాట్ల దుర్గంధంలోకి దిగితే, అవినీతి బురదలో పొర్లాడితే—చదువేం చదువుతాడు? వ్యాధిగ్రస్తులకు వైద్యసేవ ఏం చేస్తాడు? దేశానికెట్లా ప్రయోజనకారి కాగలడు?...అతనిలోని ఈ అవినీతి దూకుడును అరికట్టాలి. తొలి మలుపులోనే గాడి తప్పిన అతనికి హెచ్చరిక చేయాలి. కొడుకుచేసే అప్రతిష్ఠాకరములైన అవినీతి పనులు షావుకారు గారికి తెలీకపోవచ్చు. తను చెబితే – ఆయన జాగ్రత్తల్లో ఆయన వుంటాడు. కొడుకును అదుపు ఆజ్ఞల్లో పెట్టవచ్చు. చంద్రశేఖరం మంచిమార్గంలోకి రావచ్చు. ఇంతకంటె తను చేసేదేముంది?" – అనుకుంటూ కుమారస్వామి ఊళ్ళోకి వచ్చాడు.

చీకటి పదునెక్కింది.

వీధుల్లో విద్యుద్దీపాలు 'ఎందుకొచ్చిన బ్రతుకురా బాబూ!' అన్నట్టు నీరసంగా వెలుగుతున్నాయి.

రథశాలదగ్గర నలుగురు కుర్రవాళ్ళుచేరి పేకాడుతున్నారు. వాళ్ళ ఆటను చూస్తూ, మరో నలుగురు మనుష్యులు కాలక్షేపం చేస్తున్నారు.

మర్రిచెట్టుక్రింద అరుగుమీద పదిమంది రైతులు కూర్చుని కబుర్లు చెప్పుకుంటున్నారు. పంచాయితీబోర్డు రేడియో గ్రామస్థుల కార్యక్రమంలో - 'గాలికుంటు నివారణోపాయలు' వివరణగా చెబుతోంది. మధ్యమధ్యన రేడియో వింటూనే రైతులు రాజకీయాలు మాట్లాడుకుంటున్నారు.

మున్సబుగారు అరుగుపైన మునిగాళ్ళమీద కూర్చుని ఎదురూగ్గా చేతులు కట్టుకొని నిలబడ్డ వెట్టివాళ్ళమీద నోరు పారేసుకుంటున్నాడు.

వెంకటరత్తయ్యా చీకటిపడేవరకూ తుమ్మగుంటదగ్గర మెరకచేలో మట్టిపనిచేసి గడ్డపలుగుకు తట్ట తగిలించుకొని, భుజంపై పెట్టుకొని - ఇంటికి వస్తున్నాడు.

పాలు అమ్ముకొనే వెంకమ్మ పాడిగేదెల్ని ఇంటిదగ్గర్నుంచి - చావట్లోకి తోలుకెళ్ళుతూన్నది.

ఆ దృశ్యాలన్నీ కుమారస్వామి కళ్ళకు తట్టలేదు. అతని మనస్సులో అరటితోటల్లో, మసకచీకట్లో - షావుకారుగారి అబ్బాయీ, యానాదిలక్ష్మి, పదిరూపాయల నోటూ ... తమలపాకు తీగ వొంగినట్టు ఆమె లొంగిపోవడమూ ... గుండ్రంగా తిరుగుతున్నాయి. వికారాన్ని తెచ్చిపెడుతున్నవి. అవినీతినీ, అన్యాయాన్నీ, అధర్మాన్నీ - బహిరంగపర్చే ఏ

దృశ్యాన్ని చూసినా, ఏ సంఘటనను పరిశీలించినా, సాక్ష్య బలంతో చెవులారా విన్నా అతని మనస్సు అట్లాంటి వికార స్థితికీ, అలజడికీ, ఆలోచనల తీవ్రతకూ గురిఅవుతుంది.

రథశాలప్రక్క వీధిలో షావుకారుగారి మేడవుంది. ఆ వీధిలోకే నడిచాడు కుమారస్వామి. జరుగుతూన్న చెడును షావుకారుగారితో చెప్పి, తగుజాగ్రత్తలు తీసికొని - అట్టాంటి పాడుపనుల్ని యికమీదట జరక్కుండా చూస్తానని వాగ్దానం పుచ్చుకొనేవరకూ అతని మనోవీధిలో చీకటిలాంటి అశాంతి తారట్లాడుతూనే వుంటుంది. అందుచేతనే కుమారస్వామి షావుకారుగారి మేడగేటు నెట్టుకొని లోపల ప్రవేశించాడు. గేటుమీద తెలుపు బోర్డుమీద ఎరుపు అక్షరాలలో 'కుక్క ఉన్నది జాగ్రత్త'.అన్న హెచ్చరికను గమనించలేదు. అయినా ఆ ఉగ్రభైరవమూర్తి వరండాలో స్తంభానికి గొలుసుతో కట్టివేయబడి, రెండుకాళ్ళూ ముందుకుచాచి, తలపైకెత్తి భీకరంగా చూస్తూనేఉంది. అతను కట్టుకున్నది తెల్లటిదుస్తులు కావటంచేత ఆ ఆలిశేషియన్ కుక్క అరవలేదు.

మేడ క్రిందిభాగపు హాలులో మెర్క్యురీ దీపకాంతి బ్రహ్మాండంగా వెలుగుతూ, హాలులోని ఖరీదైన పర్నిచరునూ, అందమైన వస్తువుల్నీ, గోడల రంగుల్నీ, ఇంటి సౌభాగ్యాన్నీ చాటింపువేస్తున్నది. గార్డెన్‌లోని పూలచెట్లు చల్లగాలి సోకు కూలపడగా కమ్మని వాసనల్ని వెదజల్లుతున్నాయి. ఇంట్లో అలికిడిలేదు. అంత లోగిలీ శ్మశానంలో వెన్నెల వర్షంవలె నిశ్శబ్దంగావుంది. మనుష్యుల సందడిలేదు. విద్యుద్దీపాలు

మాత్రం కర్రపెత్తనం చేస్తున్నాయి. ఒకటి రెండు నిమిషాలు హాలులో నిలబడి, తూర్పు దిక్కునున్న ఖాళీస్థలంలోకి వెళ్లాడు కుమారస్వామి. అక్కడా ఎవ్వరూ లేరు. షావుకారుగారి భార్య, వంటమనిషి - వంటగదిలో ఉన్నారేమో! మరి పని వాళ్ళు! షావుకారుగారు! - ఊళ్ళో లేడేమో! షికారుగా పొలాలమీదకు వెళ్ళాడేమో!

ఆ ఖాళీస్థలానికి ఆవల నాలుగు దూలాల పెంకుటి చావడి వుంది. చావట్లో దీపాలు వెలగడంలేదు. మేడక్రింది వరండాలోని దీపపుకాంతి ఖాళీస్థలాన్నిదాటి అవతలకు పోలేక పోతూంది.ఏమీఆలోచక,ఏఆలోచనాచేయలేక-పెంకుటిచావడి ద్వారంలోంచి తూర్పు వీధిలోకి వెళదామనే ఉద్దేశ్యంతో అతను ఆవైపుకు వెళ్ళాడు. చీకటి చీకటిగావుంది. ఆ చావట్లో పశువు లేమీలేవు. ఓమూల పిడకల బస్తాలు, పెద్దరోలూ, వాటిచెంత జనపకట్టల మోపులు - ఇంకోమూల దూలానికి వ్రేలాడకట్టబడిన బండి - ఆ బండికి కాడిలేదు. ఆ బండిక్రింద, నాలుగు పనల చెత్తలో ... రాతిగాబు దగ్గర నిశ్శబ్దంగా నిలబడి ఒక్కసారి నిశ్చేష్టుడైనాడు కుమారస్వామి.

చీకట్లోనే చీకటి మనుష్యుల్ని గుర్తించాడు. షావు కారు గారూ, చాకలి సుబ్బులూ ... నాలుగు పనల చెత్త పైన ... ఛి. ఛీ ... లోకం పాడైపోతోంది! ఊరికి షావు కారు. ఊళ్ళో పెద్ద మనిషి. వ్యవహార జ్ఞాని. సంఘంలో విలు వల్ని పెంచుకున్న వ్యక్తి. ఇన్నేళ్ళు వొచ్చాక - చాకలి సుబ్బులుతో ప్రణయమా? ఎంత విడ్డూరం! ఎందుకు విడ్డూరం?-

తనకు విడ్డూరం గానీ, లోకంలో అది సహజమేమో! వయస్సుతో ప్రమేయం లేకుండా డబ్బుతో ఎంతమావుల్లాంటి సుఖాన్ని పొందడం విడ్డూరం కాదేమో! సంఘం అవినీతి క్రింద జమకట్టుకోదేమో! ఈ రకపు అవినీతి పరువు ప్రతిష్ఠల జోలికి రాదేమో! అదే ధీమా, అదే ధైర్యం, అదే నిర్లక్ష్యం – ఇలాంటి వ్యక్తుల చేత అవినీతికి ప్రోత్సహింప జేస్తూన్నది; అధర్మంలో సుఖాన్ని చవిచూపిస్తూన్నది; అక్రమ వర్తనలో అనుభవాల్ని కూడబెట్టిస్తూన్నది. ఈ అవినీతి స్తంభానికి పునాది డబ్బు. అది పుష్కలంగా వుంటే ఆ స్తంభానికి ప్రమాదం లేదు. ఆ స్తంభంలో పురుగులు కదులాడే ఎంత కుళ్లూ, దుర్గంధ పూరితమైన ఎంత అవినీతి, మానవత్వాన్ని నిద్రబుచ్చే ఎంత స్వార్థమూ, హృదయాన్ని పాషాణంగా మార్చే ఎంత కాఠిన్యతా – రాజ్యం చేస్తూన్నా, సంఘంలో ఆ స్తంభం ఎత్తుగా, అందంగా ఆకర్షణీయంగా, ఆధిక్యతతో కనబడుతుంది. ఇట్లాంటి స్తంభాల ఆసరాతోనే ఈనాటి సమాజ భవనం నిలబడివుంది. ఆ భవనం రిపేరు కొచ్చిందని సంఘ జీవులకు తెలుసు. ఆ భవనానికి ఆధారభూతాలైన స్తంభాలు పుచ్చిపోయాయనీ, భవనానికి చెదలు పట్టిస్తున్నాయనీ, ఎప్పుడో కూలిపోతుందనీ–ప్రజలకు తెలుసు. కాని ప్రయోజన మేముంది? ఆ భవనానికి రంగులు వేయవచ్చు గానీ – రిపేరు ఎవరు చేస్తారు? ... స్వాతంత్ర్యం, సమభ్రాతృత్వం, వర్గచైతన్యం, సమాజ వికాసం, పథకాలూ, ప్రణాళికలు, ప్రగతి పథాలూ – ఇవేమీ ఆ భవనాన్ని రిపేరు చేయలేక పోతున్నాయి. ఆ స్తంభాల్ని పెకలించలేక పోతు

న్నాయి. మరి రిపేరు మార్గమేమిటి? ఎంతకాలం ఈ వ్యవస్థ అనారోగ్య దశలో వుండాలి? అవినీతి, ఆదర్శం, స్వార్థం, మానవత్వ రాహిత్యం, క్రౌర్యం తమలో యిముడ్చుకున్న ఆ స్తంభాల్లో — అంతః చైతన్యం కలగాలి. ఆత్మ జ్ఞానం ఉదయించాలి. తమ అనారోగ్య స్థితిని తాము గ్రహించాలి. తాము రిపేరు కొచ్చినట్టు — అవే తెల్సికోవాలి. అంతవరకూ సాఫీయైన పరిష్కార మార్గం లేదు. ధనబలంతో, అహంభావంతో, అలక్ష్యంతో తండ్రులూ, కొడుకులూ — అవినీతి సుఖంతో, అక్రమ సంతృప్తితో సంచరిస్తూనే ఉంటారు. షావుకారు, కొడుకు చంద్రశేఖరం — ఇంతకంటె ప్రత్యక్ష నిదర్శనం ఏంకావాలి? ఈ విషయం ఊళ్ళో అందరికీ తెలుసా? తెలిసే వుంటుంది — మరి ఎవ్వరూ అనుకోవటంలేదేం? ఎందు కనుకుంటారు? 'లోకం ఎట్లాపోతే, మన కెందుకొచ్చింది?' ఈ తరహా మనస్తత్వానికి మనుష్యులు అలవాటుపడి, అన్యాయాన్నిఎదుర్కొనేశక్తినీ, అవినీతిని ప్రతిఘటించే ధైర్యాన్నీ, అక్రమాన్ని బయటపెట్టే అవసరాన్నీ కోల్పోతూ — వ్యర్థ ప్రలాపాలతో, ఆత్మవంచనలతో, మానసిక వ్యథలతో సంఘాన్ని మరీ అధోగతి పాలు చేస్తున్నారు. ఎట్లాంటి కలుషిత వాతావరణం? ... అనుకుంటూ కుమారస్వామి ఆవేశ పూరితుడై వీధిలోకి వచ్చాడు.

మంచినీళ్ళ బావి వద్ద వీధి దీపపు వెలుతుర్లో కరణం గారి పాడుబడ్డ పెంకుటి చావిడ్ని చూసి — ఈనాటి సంఘాన్ని మరోసారి జ్ఞాపకం తెచ్చుకున్నాడు.

మనసంతా సంకీర్ణమైన ఆలోచనలతో సతమతంకాగా, కుమారస్వామి నేరుగా ఇంటికి వెళ్ళాడు. డాబాముందు గచ్చు మెరాబాలో పెద్ద పాలేరు కోటినాగులు మినుముల బస్తాకి మూతికట్టు పురికొసతో బిగించి కడుతున్నాడు. లైటు కాంతిలో చిరుచెమట పట్టిన వాడి కండలుతీరిన శరీరం మెరుస్తోంది. వదినె, శశిరేఖ పంపు దగ్గర స్టీలుగిన్నె కడుగుతూ – "ఆ గోతాం వరండాలోకి చేర్చరా. రేపు నాగరత్తమ్మగారికి అయిదు మానికలు మినుములు బదులివ్వాలి" అంటున్నది.

నిజంగా వాడు మినుముల బస్తాని ఎత్తేపాటి సమర్థుడే! పదేళ్ళబట్టి ఆ ఇంట్లో కమతానికుంటూ – పెద్ద వాకిలి మండి గంలా తయారయ్యేడు. పొలం పనీ, వ్యవహారమూ, పని ముట్లూ – వాడి అజమాయిషీ క్రిందే! ఊరి పంచాయితీ బోర్డుకు కుమారస్వామి అన్నయ్య సుదర్శనం ప్రెసిడెంటు. ఊళ్ళోని చిన్నా పెద్దా కమతగాళ్ళ సంఘానికి కోటినాగులు ప్రెసిడెంటు. ఏరువాక పూర్ణిమ వస్తే వాడికి గిరాగీ హెచ్చు. రైతులంతా – జీతగాళ్ళను కుదుర్చుకోవటంలో వాడి సలహాలనూ, సహాయాన్నీ పొందుతారు. మంచివాడనీ, నమ్మకస్థుడనీ, నమ్మినబంటులాంటి వాడనీ – వాడికి పేరు. వాడు లేక పోతే సుదర్శనంగారి సేద్యమే లేదు అనుకుంటారు ఊళ్లో. వాడికి పదిహేను బస్తాల ధాన్యమూ, రెండు జతల పంచెలూ, చొక్కాలూ, ఓ మణుగు పుగాకూ – కమతం. ఇంట్లో వాడి మీద అందరికీ అభిమానం.

కుమారస్వామి పంపు దగ్గరకెళ్ళి ముఖమూ, కాళ్ళూ చేతులూ కడుక్కొని, తీగెకు వ్రేలాడవేసియున్న తుండుతో

తుడుచుకొని తన గదిలోకి వెళ్ళాడు. మడతమంచంపై పడు కున్నాడు. తలంతా నాదుగా వుంది. ఆలోచనతో మనస్సు అలిసిపోయి వుంది.

ప్రక్క ఇంటివాళ్ల రేడియోలోంచి ఘంటసాల భావ గీతాలు వొస్తున్నాయి.

సుదర్శనం బజార్నుంచి ఇంటికి రాలేదు.

శశిరేఖ గదిలోకి వచ్చింది. మఱది చీకాకుగా మంచం మీద పడుకొని వుండటాన్ని చూసి విస్తుపోయింది.

"అదేమిటబ్బాయ్! స్నానంచేయకుండాపడుకున్నావే?"

"స్నానం వొద్దులే వదినా! బద్ధకంగా వుంది."

"అయితే భోజనం వడ్డిస్తాను."

"ప్చ్. భోజనంకూడా వద్దు. తల నొప్పిగావుంది." అన్నాడు కుమారస్వామి మునివ్రేళ్లతో నుదురు కణతల్ని వొత్తుకుంటూ.

"మరి చెప్పావు కాదేం! వుండు. అమృతాంజనం తెచ్చి వ్రాస్తాను. అయిదునిముషాల్లో తగ్గుతుంది. ఆ తర్వాత స్నానం చేసి, అన్నం తిందువుగాని" అంటూ శశిరేఖ గదిలోంచి చర చరా వెళ్ళింది. మరునిముషంలోనే అమృతాంజనం డబ్బా పట్టు కొచ్చింది.

కుమారస్వామి పడుకున్నవాడల్లా, లేచికూర్చున్నాడు.

"లేచావేం? పడుకో అబ్బాయి. నుదుటుకు గట్టిగా వ్రాస్తాను." అన్నది శేఖ డబ్బామూత తీస్తూ.

కుమారస్వామి మనస్సు చివుక్కుమన్నది.

"ఇటివ్వు. నేను రాసుకుంటానులే" అన్నాడు కుమారస్వామి చేయి చాపుతూ.

ఆమె మాట్లాడకుండా డబ్బా యిచ్చింది. ఎందుకో అతను ఆమె ముఖంకేసి చూడలేకపోయాడు. శశిరేఖ అతని ఎదురుగ్గానే నిలబడింది - ఎట్లా రాసుకుంటావో చూస్తాను అన్నట్టు. కుమారస్వామి బిడియపడ్డాడు. తల పైకెత్తలేదు. అతని బిడియాన్ని సులభంగా గ్రహించిన శశిరేఖ గదిలోంచి వెళ్ళిపోయింది.

ఆమె వెళ్ళిపోతూన్న సమయంలో కుమారస్వామి తల పైకెత్తాడు. ఆమె కొప్పులోని తెల్లటి మల్లెపువ్వులూ, పొడుగాటి జడా, జడప్రక్క వ్రేలాడుతూన్న నల్లంచుల తెల్లటి ఖటావ్ వాయిల్ పైటచెంగూ, బెత్తెడు వెడల్పు జరీ గల మబ్బురంగు నేత జాకెట్టు బిగింపుతో ఉబికిన నడుమూ, బలమైన పిరుదులూ, సొగసైన నడకా - యధాలాపంగా చూశాడు. చిరునవ్వు నవ్వుకున్నాడు నిశ్శబ్దంగా.

—వదినె ఎంత అమాయకురాలు? ఎంత నిష్కల్మషమైనమనిషి ?లోకంతీరు తెలీదు. సంఘపు వాతావరణాన్ని అర్థం చేసి కోలేదు. తను మంచంపై పడుకొని వుండగా, తనపైకి వంగి, తన నుదుటుకు అమృతాంజనం రాస్తుందా? ఎవ

రైనా చూస్తే – ఏమనుకుంటాడు! అన్నయ్య చూస్తే ఎంత బాధ పడతాడు? ఆమె హృదయ నైర్మల్యం – ఆమెచేత అట్లా పలికించవచ్చు. గాలికంటె వేగంగా అపోహల్ని ప్రచారం చేయగల ఈ సంఘంలో – వయస్సులో వున్న పురుషుడూ, స్త్రీ హృదయాల్లో ఎంత నిర్మలత్వాన్నీ, మనస్సుల్లో ఎంత పవిత్రతనూ పదిలపర్చుకున్నా, ఒకచోట వుంటే...ఆ దృష్టితోనే చూస్తారు. వదినెకు ఆపాటి ఇంగిత జ్ఞానం ఎట్లా లేకపోయింది! తనమీద అంత కలుపుగోలుతనాన్నీ, చనువునూ ఆమె ప్రదర్శించనక్కర్లేదు. ఎప్పటికైనా ఆమెకే ప్రమాదం. కొంతమంది తమ అతిమంచితనం వల్లనే ఇబ్బందులకూ, అపార్థాలకూ గురి అవుతూ వుంటారు. ఈ లోకంలో 'చెడు'కు గల స్థానమూ, విలువా, గౌరవమూ, మెప్పూ, గుర్తింపూ, అభివృద్ధీ, సుఖమూ 'మంచి'కి లేవు. మంచివాడికి సంఘంలో స్థానం లేదు; విలువ లేదు; గౌరవం లేదు; మెప్పుదల లేదు; గుర్తింపు లేదు; అభివృద్ధిని పొందడం లేదు; సుఖపడటం లేదు. చెడ్డవాడు సంఘంలో స్థానాన్ని చిక్కించుకుంటున్నాడు; విలువల్ని పెంచుకుంటున్నాడు; మెప్పుదలకు అర్హుడవుతున్నాడు; గుర్తింప బడుతున్నాడు; అభివృద్ధిలోకి పోతున్నాడు; సుఖపడుతున్నాడు. మంచీ – చెడూ నిర్ణయంలో ధనప్రభావం ప్రముఖస్థానం వహించినంతకాలమూ – ఈ అవ్యవస్థ తప్పదు. దుర్మార్గులూ, మోసగాళ్ళూ, స్వార్థపరులూ – సంఘంలో పైఎత్తునే వుంటూ వుంటారు.

నుదురుకు అమృతాంజనం రాసుకొని పడుకున్నాడు కుమారస్వామి. తలనాదు అయిదునిముషాల్లో తగ్గలేదు. ఆలోచిస్తోనే - తొమ్మిదిన్నరకు నిద్రబోయాడు. బజార్నుంచి సుదర్శనం వొచ్చి, స్నానంచేసి, భోజనంచేసిపడకగదిలోకి వెళ్లాడు. తను భోజనంచేసే ముందు, శశిరేఖ మరిది గదిలోకి వొచ్చి చూసింది - అతను నిద్ర బోతున్నాడు. భోజనం చేయలేదే! అనుకుందిగానీ, అతనికి నిద్రాభంగం కలిగించలేదు.

౨

లోకంలో ఓ తరహా మనుష్యులున్నారు. వాళ్ళు జీవితంలో కొన్ని ఉత్తమ ఆదర్శాలను, ఉదాత్త ఆశయాలను నిర్ణయించుకుంటారు. వాటి సాధనద్వారా సంఘానికి అపారమైన సేవచేయాలనీ, మానవ వికాసానికి తోడ్పడాలనీ, ప్రైణ్యాన్ని తీసికొని రావాలనీ, తద్వారా జీవితాన్ని సార్థకపర్చుకోవాలనీ ఆవేశంతో కృషిచేస్తారు. ఆకృషిలో వ్యక్తిగత సౌఖ్యాలకూ, స్వప్రయోజనాలకూ, మమకారాలకూ, మానవ సహజమైనకొన్ని గుణాలకూ-దూరమౌతారు. తమఆదర్శాలు అక్కరకు రానప్పుడు, తమ ఆశయాలు సాధింపబడనప్పుడు, తమ కృషి సఫలం కానప్పుడు-సంఘం కొరకరాని కొయ్యగా కనబడుతుంది; కాలం గ్రహణం పట్టిన సూర్యుని పగిది గోచరిస్తుంది; జీవితం స్మశాన వాటికలోని పువ్వువలె భావించబడుతుంది. అప్పుడా మనుష్యులు 'సినిక్'లుగా మారడం

సహజం. ప్రతి సంఘటనలోనూ, ప్రతి విషయంలోనూ, ప్రతి భావంలోనూ-దోషాన్ని దర్శిస్తారు. ద్వేషాన్ని ద్విగుణీకృత పర్చుకుంటారు. తమకు తామే గొప్ప వాళ్ళ మనుకుంటారు. మిగతా వాళ్ళంతా అల్పులుగా, అసమర్థులుగా, అశక్తులుగా కనబడతారు. అట్టి తరహాకు చెందిన మనిషే కుమారస్వామి.

కుమారస్వామిని గురించి ఆ ఊళ్ళో చాలమంది చాలా రకాలుగా అనుకుంటారు. 'నిఖార్సైన మనిషి. న్యాయంకోసం నిలబడతాడు. అన్యాయం చూస్తే ఓర్చుకోలేడు. అవినీతిని సహించడు.' 'అతను దోషదర్శి. ఈ వయస్సులోనే అట్లాంటి మనస్తత్వానికి అలవాటుపడటం విషాదకరం.' 'ఆ మాటకొస్తే ఈ సమాజంలో నీతి, నిజాయితీలకూ, మంచికీ, ధర్మానికీ ప్రాకులాడే ప్రతివ్యక్తీ దోషదర్శియే! సంఘజీవుల్లో మిసమిస లాడే స్వార్థం, ద్వేషం, అవినీతి, దుర్మార్గం, అసూయ-అతన్ని అట్లా మార్చింది.' 'ఆచరణ సాధ్యంగాని ఆలోచనలు గల వాడు. అతని ఆదర్శాలు ఆకాశంలోని నక్షత్రాలవంటివి. జీవితంలో వాటిని అందుకోవటానికి ప్రయత్నిస్తూ - అందు బాటులోవున్న సుఖాన్ని ఖాతరుచేయని అవివేకి.' 'కీడెంచి మేలెంచే మనస్తత్వం. తనకు న్యాయంగా తోచిన దాని కోసం ప్రాణానికి తెగించి పోరాడతాడు. అన్యాయం, అవి నీతి, అక్రమమం - అతనికి శత్రువులు. శత్రుసంహారంకోసం తాపత్రయపడుతూ వుంటాడు.' 'ఎంతసేపూ ఎదుటవాళ్ళ సంగతేతప్ప తన సంగతి ఆలోచించుకోని బాపతు' 'తెలివి గలవాడు. మేధావి. కొఱగాని ఆలోచనలతో, ఆవేశాలతో, అక్కర్లేని జోక్యాలతో - చెడిపోతున్నాడు' 'నిర్మొహమాటి.

అంతస్థులు పాటించకుండా మాట్లాడతాడు. లౌకికజ్ఞానం తక్కువ.' కుమారస్వామిమీద ఊళ్లో కొంతమందికి మంట. మరికొంతమందికి జాలి. ఇంకొంతమందికి అభిమానం. మొత్తం మీద అంతా 'అతను నలుగురిలో కలిసే మనిషి కాదు' అనుకోవడం కద్దు.

అన్న సుదర్శనానికీ, అతనికీ శారీరకంగా పోలికలున్నాయి గానీ - మనస్తత్వాల్లో, ఆలోచనల్లో, మాటల్లో, చేష్టల్లో ఎక్కడా పోలికలు అందవు. సుదర్శనం ఆదర్శాల కోసం పడిచచ్చే వ్యక్తి కాదు. అవసరం ముందు ఆదర్శాన్ని చూడడు. కొన్ని ఆదర్శాల అడ్డగీతల్లో జీవితాన్ని బంధించటం - కూపస్థమాండూకంవలె, ఓరకమైన బానిసత్వంవలె భావిస్తాడు. పరిణామాలకూ, పరిస్థితులకూ అనుగుణంగా ప్రవృత్తుల్ని పరిశుద్ధం చేసికొని, వృద్ధిచేసికోవటంవల్ల - జీవితంలో కొన్ని యిబ్బందుల్నుంచి తప్పుకొని ముందుకు సాగవచ్చు నన్న అభిప్రాయానికి ప్రాధాన్యత నిస్తాడు. ఈనాటి సంఘవ్యవస్థ లోపభూయిష్టం. అన్యాయం, అవినీతి, అసూయా ద్వేషాలు, వంచన, అలజడి, దోపిడి, లంచగొండితనం, బలహీనమైన వర్గాన్ని అణగద్రొక్కటం - ఈనాటి సమాజంలో తాండవిస్తున్న శక్తులు! వీటివల్ల వ్యవస్థ నానాటికీ చెడిపోతుంది గానీ బాగుపడదు. సంఘాన్ని మరమ్మత్తు చేయాలంటే- మానవ సమూహపు శక్తి, అంతర్గత చైతన్యం, పరిణామ దృష్టి కావాలి గానీ, ఒక వ్యక్తి ఆదర్శబలం వల్లనూ, ఆవేశపుపొంగు వల్లనూ, ఆదుర్దాపోకడ వల్లనూ అయ్యేదికాదు. అన్యాయాన్ని ప్రతిఘటించినా ప్రయోజనం శూన్యమైనప్పుడు-

అన్యాయాన్ని చూస్తూ ఊరుకోవడం మేలు. అవినీతిని అరికట్టలేనప్పుడు - దాని జోలికి పోకుండా ఉండడం మంచిది. దుర్మార్గుల్లో పరివర్తన కలగనప్పుడు - వాళ్ళకో నమస్కారం పెట్టటం సమంజసం. ఈ విధమైన మనఃప్రవృత్తుల్ని ప్రతివాడూ జీర్ణించుకుంటే - 'లోకం ఏంకాను?' అన్న ప్రశ్న రావచ్చు. ఇప్పు డేమాతున్నది? ఇక ముందూ అదే అవుతుంది! - సుదర్శనం భావాలు అట్లాంటివి. ఊళ్లో అతనికో పార్టీ ఉన్నది. ఆ పార్టీకి సుదర్శనం నాయకుడు. క్రిందటి ఎన్నికల్లో - ఆ పార్టీ మనుష్యులు ఎక్కువ మంది మెంబర్లుగా వచ్చారు. సుదర్శనం పంచాయితీ బోర్డుకు ప్రెసిడెంటు యైనాడు. పరిపాలనలో తన వర్గానికి, పార్టీ మనుష్యులకు ప్రత్యేక సదుపాయాలు, ప్రయోజనాలు కలుగజేస్తున్నాడు. తన ముఠా ఆధిక్యతను ప్రకటించే కార్యాలు ఘనంగా చేస్తున్నాడు. అది అన్యాయంగానూ, అక్రమంగానూ, పక్షపాతంగానూ అతను భావించటం లేదు. ప్రతిపక్ష సభ్యులు కన్నెర్ర జేస్తున్నారు. మీటింగుల్లో బల్లలు గుద్దుతున్నారు. కరపత్రాలు పంచుతున్నారు. పిటీషన్లు పెడుతున్నారు. ప్రచారాలు చేస్తున్నారు. గాలిదుమారానికి చెట్టు తలవంచుతుంది గానీ - పడిపోదుగా!

కుమారస్వామి ఒక పార్టీకి చెందిన మనిషి కాదు. అతనికి ప్రత్యేకమైన వ్యక్తిత్వముంది. జీవితంలో అతని ఆదర్శాలు, ఆలోచనలు, దృక్పథాలు వేరు. న్యాయం, ధర్మం, నీతి - ఈ పార్టీకి చెందినవాడు. వాటి సంరక్షణే అతని ధ్యేయం. తనని గురించి, వాటి సంరక్షణలో తన శక్తి సామర్థ్యాలను గురించీ, తన అగత్యాన్ని గురించీ ఎప్పుడూ ఆలోచనలే. అన్నయ్యకు

ఎదిరి ముఠావాళ్లతో గూడా మాట్లాడతాడు. అన్నయ్య ముఠాలో వాళ్లను కూడా ద్వేషిస్తాడు. ధనం, హోదా, పెద్దతనం, చెలామణీ-వీటినిబట్టి మనిషి విలువల్ని అంచనావేసుకుం. ఒక మనిషిని గూర్చి అభిప్రాయాన్ని ఏర్పర్చుకోవడంలో నీతికీ, నిజాయితీకీ, మనఃప్రవృత్తులకూ బరువునిస్తాడు. వాటి దృష్టి నుంచి ఒకవ్యక్తిమీద ఓ అభిప్రాయానికి వస్తే-ఆ అభిప్రాయం చెరగని ముద్రవలె నిలిచిపోతుంది.

కుమారస్వామికి తండ్రిలేడు. ఏడేళ్ళక్రితం పడమటిపొలాన మినపకాయకోతలో త్రాచుపాముకరిచి చనిపోయాడు. అప్పుడతను ఫిఫ్తుఫారం చదువుతున్నాడు - తండ్రి మరణానంతరం ఇంటిపెత్తనం సుదర్శనం చేతికి వొచ్చింది. అప్పుడే అతను ఇంటర్మీడియేట్లు మూడుసార్లుతప్పి-చదువుకూ, తన జీవితానికీ పొత్తుకుదరదని తేల్చుకున్నాడు. ఊళ్ళో రాజకీయాల్లోకి దిగాడు. యువకుల్నీ, పెద్దవాళ్లనూ ఆకర్షించాడు. పంచాయితీబోర్డుకు మెంబరుగా నిలబడ్డాడు. గెలిచాడు. వైస్-ప్రెసిడెంటుగా ఎన్నికైనాడు. ఆపైన మూడేళ్ల తర్వాత ఎన్నికల్లో-మళ్ళీగెలిచి, మెంబరుగావచ్చి, ప్రెసిడెంటు అయినాడు. సుదర్శనం రాజకీయంగా పెద్దవాడు కావటానికి అతనిలోని చొరవ, ఆలోచనలనైపుణి, ముఠాను ఆకట్టుకొనే తెలివితేటలు, ఆదర్శాల సడలింపు-ముఖ్యమైన హేతువులు. తండ్రి చచ్చిన దగ్గర్నుంచీ తమ్ముణ్ణి గురించి అతనికి భయం. అతని మనస్తత్వపుపోకడ, భిన్నమైన ఆలోచనలూ, పెడగా వుండే నైజమూ, నీతినిజాయితీలపట్ల కాఠిన్యతా-సుదర్శనానికి భయకారణాలు. కుమారస్వామికి అడిగినంత డబ్బు యిచ్చేవాడు.

ఎక్కడ చదువుతానంటే-అక్కడే చదువుకోమనేవాడు. పరీక్ష తప్పినా 'ఎందుకు తప్పావు?' అని ప్రశ్నించేవాడు కాదు. 'తీరిక సమయాల్లో ఆలోచిస్తూ, షికార్లుచేస్తూ వుండకపోతే - పొలం వెళ్ళి కూరో్చిరాదూ!' అని అనేవాడు కాదు. ధైర్యంలేదు. తను ఇంటి పెత్తనం చేస్తూన్నా, వేలకొలదిడబ్బు తనచేతుల్లో తిరుగుతూన్నా-సుదర్శనం ఎప్పుడూ ఇంటి విషయాల్లో యజమాని దర్జాని 'ఫీల్' కాలేదు.

తల్లి మంగమ్మకు చిన్న కొడుకు కుమారస్వామిమీద అమితమైన ప్రేమాభిమానాలు. అవి ప్రదర్శించేందుకు ఆవిడ తహతహలాడుతూ వుంటుంది గానీ, కుమారస్వామి లక్ష్య పెట్టడు. ఆ పద్ధతి అతనికి గిట్టదు. కన్నకొడుకులపైనే మాతృమూర్తి ప్రేమాదరణలు చూపడంలో తేడా లెందుకుండాలి.

ఆ రోజు ఉదయం తొమ్మిది గంటలకు కుమారస్వామి చన్నీళ్ళ స్నానంచేసి, ఊళ్లో లోకల్ లైబ్రరీ అథారిటీవారి బ్రాంచి లైబ్రరీకి బయలుదేరాడు. ఊళ్లోవుంటే నిత్యమూ విధిగా లైబ్రరీకి వెళతాడు. అందులో అతనికి సభ్యత్వం కూడా ఉంది. తీరిక సమయాల్లో ఆలోచించటంతోపాటు విపరీతంగా చదువుతూ వుంటాడు.

ఉదయపు ఎండ పెద్ద బజార్లో తెల్లగా పడుతోంది. షావుకారుగారి ధాన్యపుకొట్లు వరండాలో పొలం కవులు కిచ్చి కాలిమీద కాలువేసికొని కూర్చుని కబుర్లు చెప్పుకోవటంలో ఎక్కువ సుఖాల్ని అనుభవిస్తూన్న నలుగు రైదుగురు ఆసాములు జాతీయ అంతర్జాతీయ రాజకీయాలు మాట్లాడు

కుంటున్నారు. ఒకాయన చేతిలో దినపత్రిక కూడా వుంది. సుబ్బయ్యగారి అంకయ్య దున్నపోతుల బండిని తోలుకొస్తున్నాడు. బండిలో రెండువడ్లబస్తాలున్నాయి. దంపుడు మరకు కాబోలు! వెంకయ్యగారి పాలేరు వాములదొడ్డి దగ్గర్నుంచి ఎండుగడ్డి మోపు తీసికెడుతున్నాడు. పెద్ద బజార్లోంచి కుమారస్వామి నడుస్తున్నాడు. ఆ వీధిలోనే వుంది లైబ్రరీ. జానయ్య కిరాణాకొట్టు దగ్గర ఇద్దరు ముత్తైదువలతో పేరంటానికి వెళుతూ శైలారాణి ఎదురైంది. తలవంచుకొని నడిచే అలవాటుగల కుమారస్వామి ఆ సమయంలో ఎందుకో తల ఎత్తడమూ సరిగ్గా అదే సమయానికి అతనికేసి ఆమె చూస్తూ దోరగా చిరునవ్వు నవ్వటమూ సంఘటనపూర్వకంగా జరిగిపోయాయి. పైపెచ్చు ఆమె చిరునవ్వులో సిగ్గుదొంతరలు వెల్లివిరిశాయి.

కుమారస్వామి గుండెలో పచ్చిముల్లుగుచ్చుకొన్నట్లయింది. చప్పున ముఖం క్రిందికి దించేసుకున్నాడు.

కిరాణాకొట్టు అరుగుమీద కూర్చున్నవాళ్ళు వాళ్ళకేసి చూసీ చూడనట్టు చూశారు. తమకేసి స్పష్టంగా చూసివుంటారనే అనుకున్నాడు కుమారస్వామి. అతనిలోని కోపోద్రేకాలు ఫెళ్ళున బయటపడి, ముఖాన్ని ఎఱుపు చేసినయ్. గబగబా ముందుకు నడిచాడు. వలపును రేకెత్తించే ఆమె చిరునవ్వూ, వయస్సును ప్రకటించే ఆమె ప్రేమ చూపులూ—తెల్లని గోడపై బురద చిందిపడ్డట్టుగా అతని మనోఫలకంపై పడ్డాయి. ఆ అనుభూతి అతనికి కొత్త. అందుకే వికారాన్ని కలిగించింది. కోపంతో శరీరాన్ని కుళ్ళగించింది.

ఎంత తెగింపు చేసింది శైలారాణి! పెద్దబజార్లో, పది మంది తిరిగేచోట, నలుగు రైదుగురు కూర్చున్నచోట, తన కేసి చూస్తూ, చిరునవ్వు నవ్వుతుందా! ఆమె అభిప్రాయ మేమిటి? తనని ఎరిగివున్నట్టు – లోకానికి వెల్లడిచేయాలనా! వెల్లడిచేస్తే – ఆమెకు కలిగే ప్రయోజనమేమిటి? అసలు ఆమెకీ తనకీ పెద్దపరిచయ మేముంది? గుంటూరులో ఓసారి రాత్రి పది గంటలకు సినిమా చూసి ఒక్కతే వెళుతూంటే బ్రాడిపేట ఆరోలైనులో ఆమెవెంట ఇద్దరు రౌడీలు పడ్డారు. ఆ వీధినే తనువస్తూ ఆమెను ఆ ఇబ్బందినుంచి కాపాడాడు. అప్పుడామె చెప్పింది: తను కాలేజీలో బి. ఏ. చదువుతున్నా ననీ, ఇద్దరిదీ ఒకేగ్రామమనీ, మున్సబుగారి కూతుర్ననీ. అప్పటి వరకూ ఆమె ఎవరో, ఏవూరో, ఏం చదువుతూన్నదో తనకి తెలీదు. కాలేజీలో కూడా చూసినట్టు జ్ఞాపకంలేదు. ఆ తర్వాత కూడా ఎప్పుడూ ఆమెతో తను మాట్లాడలేదు. ఓసారి బస్సులో కనిపించిందిగానీ – తను మాట్లాడించలేదు. అంతేగాకుండా ఆమె మాట్లాడించేందుకు ప్రయత్నం చేయ బోగా, తను ముఖం ప్రక్కకు తిప్పుకున్నాడు. ఆమెతో పరి చయాన్ని పెంచుకోనేలాలన తనకుంటేనేగా!... మళ్ళీ ఈరోజు! ఛి, ఛీ, కొత్త వయస్సు ప్రవేశించగానే ఆడవాళ్ళు ఎన్ని పోకళ్ళు పోతారు? మగవాడి హృదయంలో మోజును కదిలించటానికి ఎన్ని ప్రయత్నాలు చేస్తారు? ఆమె తనకేసి ఎందుకు చూడాలి! చూస్తేమటుకు చిరునవ్వెందుకు నవ్వాలి? ఆ చిరునవ్వులో సిగ్గునెందుకు అభినయించాలి? కన్య కుండ వల్సిన లక్షణాలేనా అవి! కాలేజిల్లోకూడా అంతే! మగపిల్లలు

ఆడపిల్లల చూపులకోసం, చిరునవ్వులకోసం, మాటలకోసం - ప్రొద్దస్తమానమూ చదువునూ, తమ బాధ్యతనూ, కర్తవ్యాన్నిమర్చి, రోడ్లు పట్టుకొని తిరుగుతూనే ఉంటారు. ఓ అందమైన అమ్మాయి తనకేసి చూస్తే - చలిజ్వరం కమ్ముకొన్న వాడిలా అయిపోతాడు అబ్బాయి; చిరునవ్వు నవ్వితే-మూర్ఛపోయినంత ఇదవుతాడు; మాట్లాడితే-ఇహసరే, మనస్సును నేరుగా ఆకాశానికి అటుప్రక్క పోనిచ్చి మధురమైన కలలుకంటాడు, ప్రేమవ్యాధికి గురవుతాడు. అంతటితో చదువుకు స్వస్తి, డబ్బు దండుగ. పరీక్ష తప్పుతాడు. మార్చికీ, సెప్టెంబరుకూ రంగుల రాట్నం తిరిగినట్టు తిరుగుతాడు. జీవితం జుగుప్సగాతోస్తుంది. భవిష్యత్తు బండరాయిగా కనబడుతుంది. తను ప్రేమించిన పిల్లకు మరొకళ్లతో వివాహమైతే-నిరాశా, నిస్పృహాలతో చినికిచినికి ఆత్మహత్యకు తలపడతాడు. ప్రేమ-విరహం-వైరాగ్యం. బ్రతుకు తొలిమలుపులో తప్పటడుగు వేసి, జీవితాల్లో ఎందుకూ పనికిరాకుండా పోతూన్నవాళ్లిను తను చూస్తున్నాడు. తన క్లాసులో తెలివైన విద్యార్థి రామనాథం ఓ అమ్మాయి ప్రేమలోపడి, చదువుమీద మనస్సు పోక పిచ్చివాడిలా తయారై, చివరకు పరీక్షలకు మానుకోని వెళ్ళిపోలేదూ! ఫస్టుక్లాసు వొచ్చే కుర్రవాడని అందరూ అనుకొనేవాళ్ళు. కేవలం మగపిల్లల్ని నిందించికూడా ప్రయోజనం లేదు. నిప్పులేనిదే పొగ రాదన్నట్టు ఆడపిల్లల ప్రోద్బలమూ, కవ్వింపూ, విలాసచేష్టలు లేనిదే - మగపిల్లలు అంతగా ఎగబడరు. కాలేజీల్లో ప్రవేశించగానే, మిగతావాళ్ళ కంటె విజ్ఞానంలో ఆధిక్యతను సంపాదించినట్టు, హోదాను పెంచు

కున్నట్టు, ఆకర్షణీయంగా కనబడాలనే సెంటిమెంటుకు లోనవుతూ ప్రవర్తిస్తారు. మగపిల్లల నవ్వులకు, కనుసైగలకు, ప్రేమలేఖలకు, మాటలకు, వెకిలిచేష్టలకు – ఆడపిల్లలు సమాధానాలు చెప్పటంకూడా, పరిస్థితుల్ని హీనపరుస్తున్నాయి. అమాయికత్వంకావచ్చు, మిడిమిడి జ్ఞానంకావచ్చు, వయస్సు పెట్టే గిలిగింతలుకావచ్చు–ఈ రోజుల్లో ఆడపిల్లలు, ముఖ్యంగా కాలేజీల్లో చదివేవాళ్లూ, ఉద్యోగాలుచేసేవాళ్ళు 'నీతి'నిగూర్చి శ్రద్ధవహించటంలేదు. కోర్కెల్ని, జీవితంలో సుఖాన్ని ఒక్కసారి అనుభవాల పాత్రలో జుర్రుకుందామన్న తాపత్రయాలను, ఏదో రకంగా ముందుకు పోవాలనే ఆవేశాలను కాలంతో పాటు పరుగులెత్తిస్తున్నారు...జీవితాన్ని అపార్థంచేసికొంటూ, సౌఖ్యాన్ని తప్పుడు అంచనా వేసికొంటూ, గాలిలో తేలిపోతున్నారు మనుష్యులు... అనుకుంటూ కుమారస్వామి గ్రంథాలయ ఆవరణలో ప్రవేశించాడు. రీడింగ్ రూములో కూర్చుని మేగజైన్సు తిరుగవేయ నారంభించాడు.

## 3

ఎప్పటికిమల్లే కుమారస్వామి ఆ రోజు సాయంత్రం కూడా షికారుకు బయల్దేరాడు చెరువు దగ్గరకు. డొంకలో నడుస్తున్నాడు. వాతావరణం ప్రశాంతంగా వుంది. పచ్చని పొలాలపై సంధ్యాకాంతి మనోహరంగా పడుతోంది. చెట్ల నీడలు ముందుకు సాగుతున్నాయి. డొంకకు అటూ ఇటూ వున్న పొలాల్ని, అందులో పనిచేసే మనుషుల్ని, పశువుల్ని,

సహజమైన ప్రకృతినీ - చూస్తూ ఆలోచిస్తూ మెల్లగా నడుస్తున్నాడు కుమారస్వామి.

హఠాత్తుగా అతని వెంట ఎవరో పరుగెత్తుకొస్తూన్న చప్పుడు విని, వెనక్కు తిరిగి చూశాడు. తొమ్మిదేళ్ళ కుర్రాడు పొడుగు చొక్కా, పొట్టి లాగూ ధరించి, ముఖం మీదకు జుత్తుపడుతూండగా, చెమట వొళ్ళంతా దిగకారుతూండగా - పరుగెత్తుకొంటూ వచ్చి, కుమారస్వామికి కొంచెం యెడంగా ఆగాడు. ఆ కుర్రవాడు అంత శ్రమ తీసికున్నదీ తన కోసమే అనుకున్నాడు కుమారస్వామి. నిలబడి వాడికేసి 'ఏమిటి ?' అన్నట్టు ఆదుర్దాగా చూశాడు.

ఆ కుర్రవాడు బెదురు చూపులు చూడసాగాడు. తప్పు చేస్తూన్నవాడి భయం ఆ కుర్రవాని ముఖంలో గోడకు సున్నం వేసినంత స్పష్టంగా కనబడుతూంది.

"ఎవరి కోసం? ఏం కావాలి?" అన్నాడు కుమారస్వామి తల ఆడిస్తూ. ఆ కుర్రవాడ్ని రెండు మూడుసార్లు బజారులో చూశాడు గానీ, ఎవరి అబ్బాయో తెలీదు.

ఆ కుర్రవాడు క్షణంలో సగంసేపు నేలకేసి చూసి, ఆపైన తల ఎత్తే ధైర్యం లేక గబగబా కుడి చేతిని జేబులో పెట్టి, మడత పెట్టిన ఓ తెల్లటి కాగితాన్ని తీసి, అతని చేతికి అందించి - రెండు కాళ్ళ స్వారీ చేసాడు.

కుమారస్వామి ఆ కాగితాన్ని విప్పి చూసుకున్నాడు. శైలారాణి వ్రాసిన ప్రేమలేఖ!

'ప్రియమైన ... స్వామికి!

'ఆరోజు రాత్రి గుంటూరులో నన్ను రౌడీల బారినుండి తప్పించిన క్షణంనుంచీ, నా మనస్సూ, హృదయమూ, ఆత్మా, సర్వస్వమూ - మీపైకే మళ్ళాయి. అప్పట్నుంచీ నాలో అంకురించిన ప్రేమాభిమానాలు మొక్కలై, చెట్టులా ఎదిగినాయి. ఆ చెట్టు పువ్వులు పూసి, కాయలు కాసి, సార్థకతను సంపాదించాలంటే - మీ ప్రేమ, ఆదరాభిమానాలు, సహృదయత, సౌశీల్యం కావాలి. ప్రథమ వీక్షణంలోనే మీ సౌందర్యం, మంచితనం - నా మనస్సులో ప్రవేశించి, అధికారాన్ని చేపట్టాయి. నా హృదయానికి మీరు అధిపతి. మిమ్మల్ని ఆరాధించటమే నా జీవిత లక్ష్యం. మీ జీవన రాగంలో ఐక్యం కావటమే నా జీవితాదర్శం. మీ బ్రతుకు బాటలో పయనించటమే నా బ్రతుక్కు సౌభాగ్యం. మీ వెలుగే - నాకు సుఖం; మీ నీడే - నాకు శాంతి. మీ మార్గమే నాకు ముక్తి. మిమ్మల్ని మనస్ఫూర్తిగా నమ్ముకున్నాను. మన ఇద్దరికీ ఈడూ, జోడూ. మీకు ఆస్తి, అందమూ, చదువూ, వయస్సూ ఉన్నాయి. నాకూ ఆస్తీ, అందమూ, చదువూ, వయస్సూ ఉన్నాయి. ఇరువురమూ వివాహం చేసికొని - సుఖంగా, ఆదర్శంగా జీవయాత్ర చేయవచ్చు, మీ అభిప్రాయం తెలిపితే - పెండ్లికి ఏర్పాట్లు చేసికోవచ్చు. నా ప్రేమను గుర్తించి, అంగీకారాన్ని తెలియచేస్తారని విశ్వసిస్తున్నాను. మీ లేఖ కోసం వేయి కన్నులతో నిరంతరం ఎదురు చూచే —— శైలారాణి'

ఆ లేఖ చదువుకున్న కుమారస్వామి కోపోద్రేకంతో గింగిరాలు తిరిగాడు. 'ఊరు చెడిపోతోంది. శైలారాణి తనకీ ప్రేమ లేఖ వ్రాయటమా! ఎంత మంది ఆడపిల్లలు యౌవనపు తొలి ఉద్రేకాలను, మెరుపుల్లాంటి మోహాలను 'ప్రేమ' క్రింద భావించి - ఇట్లా మగపిల్లలకు ప్రేమలేఖలు వ్రాస్తున్నారో! సినిమాలు, చవుకబారు సాహిత్యమూ, ఫ్యాషన్లూ, సంస్కారాన్ని పెంపొందించలేని చదువూ - యువతీ యువకుల్ని పెడమార్గాల్ని పట్టిస్తున్నాయి. జీవితాన్ని రంగుల అద్దాల్లో దర్శిస్తున్నారు. సుఖాన్ని గూర్చి ఆధారాలు లేని ఆశల్ని అల్లుకుంటున్నారు. భవిష్యత్తును బంగారు పంటగా భావిస్తున్నారు. ముందుగల అగాధాల్ని కానలేక కళ్ళు మూసికొని పరుగులు పెడుతున్నారు. నీతి, నిజం, వాస్తవం - వీటిని గురించిన భయాల్ని దాచుకుంటూ, ఏదో బావుకోవాలనే ఆరాటంతో తప్పటడుగులు వేస్తున్నారు. లేకపోతే - శైలారాణి తనని ప్రేమించటమేమిటి? ఎందుకు ప్రేమించింది? ఒక స్త్రీ ప్రేమించదగ్గ ఉత్తమ లక్షణాలు తనలో ఏమున్నాయి? అసలు ఆమె తనని ప్రేమించాల్సిన అగత్యమేముంది! ఆమె ప్రేమకోసం తనెప్పుడూ దరఖాస్తు పెట్టుకోలేదే! 'ప్రేమ' అంటే ఆమెకు సరైన అర్థం తెలుసా? తెలియనక్కర్లేదు. ఈ కాలంలో పదాలకు అర్థాలు తెల్సికొని ఎవ్వరు సంచరిస్తున్నారు? పైపెచ్చు - ఈడూ, జోడూ, పెళ్ళి చేసుకోవాలట! ఎవరో అన్నట్టు. 'ప్రేమ అనేది దూరాన ఆకాశంలో మెరిసే నక్షత్రం. దాని వేపే తల ఎత్తి చూస్తూ రోడ్డుప్రక్క గోతిలో పడిపోవడం వివాహం'. తనట్లా ఆకాశంలో మెరిసే

నక్షత్రం కేసి తల ఎత్తి చూస్తూ రోడ్డు ప్రక్క గోతిలో పడ దల్చుకోలేదు. ఆ విషయంలో తనకి ఖచ్చితమైన అభిప్రాయా లున్నాయి. శైలారాణి లాంటి వాళ్ళు ఎంత మంది తనని ప్రేమించినా, రవ్వంత చలించడు. ఈ రోజుల్లో ప్రేమించడం - ఎంత సులువై పోయింది! ఏ వీధి మలుపులో, ఏ బస్సు స్టాండులో, ఏ రైల్వే ప్లాట్‌ఫారం మీదనో, ఏ సినిమాహాల్లో, ఏ కాలేజీలో, ఏ బీచిలో - ఎక్కడ చూసినా, ఓ అబ్బాయి ఓ అమ్మాయిని ప్రేమిస్తూనే వుంటాడు; ఓ అమ్మాయి ఓ అబ్బాయి కేసి ఆ భావంతో చూస్తూనే వుంటుంది. నాగరి కతతో పాటు ఈ ప్రేమ జాడ్యం పెరిగిపోతున్నది. రానురాను వయస్సు నేర్పే అలవాటుగా పరిణమిస్తూన్నది. సెక్సు వాంఛని ప్రేమగా ఆరాధించటం పరిపాటి అయింది. తను ఈ లేఖను నిర్లక్ష్యంగా చింపి, అవతల పారేయరాదు. శైలారాణికి బుద్ధి వచ్చేలా చేయాలి! మగవాడికి ప్రేమలేఖ వ్రాసే, ఆమె సాహసానికి తగిన శాస్తి చేయాలి! ఈ సంగతి ఊళ్లో పదిమందికి తెలిస్తే-ఆమె ప్రవర్తన ఎంత కలుషితమౌతుంది? ఆమెను పెళ్ళి చేసికోవటానికి ఏ యువకుడు ముందుకు వస్తాడు? ఆ తొందరపాటు భవిష్యత్తుపై ఎట్లాంటి దుష్ట వాతావరణాన్ని కలుగజేస్తుంది? ... ఇవన్నీ శైలారాణి ఆలోచించిందా? లేదు. ఈనాటి పడుచులు అల్లాంటి విచ క్షణా జ్ఞానానికి అలవాటు పడలేదు. నాగరికత, ఫ్యాషన్లు, సంస్కార విహీనత, మిడిమిడి జ్ఞానం, కాలపు వేగం-వాళ్ళను సక్రమ మార్గంలో పెట్టలేవు...' ఆ లేఖనుమడిచి ప్రక్క జేబులో పెట్టుకొని డొంకలో నడక సాగించాడు కుమారస్వామి.

* * * *

నాయుడుగారి తాళ్ళతోపు చెంతనే వుంది మున్సబు గారి అరటితోట. మోటబావినుంచి ఇంజనుద్వారా తోటకు నీళ్ల తడి కడుతున్నారు. మున్సబుగారు ఇవతల తట్టు మిరప తోటలో నులకమంచంమీద కూర్చుని మెకానిక్‌తో కబుర్లు చెబుతున్నాడు. పెద్దపాలేరు కాలువలోంచి నీళ్ళు పొర్లి పోకుండా మట్టి అడుసుతో కట్టలువేస్తున్నాడు. చిన్నపాలేరు తోటలో అరటిపాదుల్లోకి నీళ్ళు పెడుతున్నాడు. రెండున్నర అంగుళాల పైపుగల ఇంజను చప్పుడుచేస్తో బావిలోని నీటిని తోటలోకి రవాణాచేస్తూంది.

డొంకలోంచి తాళ్లతోపుప్రక్క గట్టుమీదుగా తన దగ్గరకొస్తున్న కుమారస్వామినిఅంతదూరానచూసి,ఉత్తరాది నాటుపుగాకుచుట్ట కాలుస్తూన్న మున్సబు ఆశ్చర్యపోయాడు. ఆయన మంచంప్రక్క కూర్చున్న మెకానిక్ ఇంజనుదగ్గరకు వెళ్ళాడు. కుమారస్వామి గంభీరంగా ఆయనవద్ద నిలబడ్డాడు.

మున్సబు సహజమైన చిరునవ్వుతో— "రా! అల్లుడూ! కూర్చో" అంటూ మంచం ప్రక్కకు జరిగాడు.

కుమారస్వామి ముఖం చిట్లించుకున్నాడు— మంగలంలో ఉప్పుగల్లు చిట్లినట్లు. వరసైన ప్రతియువకుడ్నీ 'అల్లుడూ!' అంటూ సంబోధించటం మున్సబుగారికి అలవాటు.

"మీతో మాట్లాడాలి" అన్నాడు కుమారస్వామి నిలబడే.

"కూర్చో, మాట్లాడుకుందాం" అన్నాడు మున్సబు చేతిలోని చుట్టను పిల్లకాలువలోనికి విసరివేస్తూ.

కుమారస్వామి కొంచెం తటపటాయించాడు. విషయం పదిమందికీ తెలియడం అతని కిష్టంలేదు.

"రహస్యమా! ... అయినా ఫర్వాలేదు. ఇక్కడ కానివాళ్ళెవరున్నారు? ఎవరిపనుల్లో వాళ్ళున్నారులే!" అన్నాడు మున్సబు అతని సందేహాన్ని పసికట్టి.

కుమారస్వామి ప్రక్క జేబులోంచి శైలారాణి వ్రాసిన ప్రేమలేఖ తీసి మున్సబు కిచ్చాడు. ఆ లేఖ చదువుకున్న మున్సబు ముఖం పెనంమీద బాగా కాలిన పెసరట్టయింది.

"నేను గనుక సరిపోయింది. మరొకళ్ళయితే ఎంత గోలయ్యేది? మీ పరువు ప్రతిష్ఠలు రోడ్డుమీద దుమ్ములో కల్సిపోయేవి. మీ అమ్మాయికి తగినట్టు బుద్ధి చెప్పండి. పెళ్ళికాకముందు ఇల్లాంటి ప్రేమలేఖలు వ్రాస్తే - పెళ్ళి కావటమే కష్టం. తర్వాత విచారించి ప్రయోజనం లేదు." అన్నాడు కుమారస్వామి కంఠంలో కఠినత్వాన్ని పలికిస్తూ. ఆ పైన క్షణంసేపూ కూడా అక్కడ వుండకుండా డొంకలోకి వెళ్ళాడు.

మున్సబు నిశ్చేష్టుడై నులకమంచంలో కూర్చుండిపోయాడు. ఆయన చేతిలోని కూతురి ప్రేమలేఖ గాలికి రెపరెప లాడింది.

* * * * *

ఫించను పుచ్చుకోబోతూన్న సూర్యునిచుట్టూ చిన్న చిన్న మబ్బులన్నీ చేరి సభ నేర్పాటు చేశాయి. సూర్యుని

ఆఖరుకాంతిఅస్పష్టంగాపొలాలపై పడుతూన్నది.కుమారస్వామి డొంకలో చెరువు కట్టకేసి నడుస్తున్నాడు. అతని మనస్సులో రకరకాలైన ఆలోచనలు ఎండమావుల్లా తిరుగాడుతున్నాయి.

ఎదురుగ్గా ఎడ్లబండి తోలుకుంటూ ఓ యువకుడు వస్తున్నాడు. తలగుడ్డ దిట్టంగా చుట్టి, జల్లకు ఆనుకొని తొట్లో నిలబడి, పగ్గాలు ఎడం చేతితో పట్టుకొని, కుడిచేత్తో గజ్జెల చెర్నాకోల కదిలిస్తూ, ఎడ్లను వడిగా అదిలిస్తూ ఆ యువకుడు సినిమాపాట ఆలాపిస్తున్నాడు-నమ్మినబంటులో నాగేశ్వర్రావు ఎడ్లబండి తోలుతూ పాడేపాట. ప్రక్కనే పచ్చిగడ్డిమోపు నెత్తిన పెట్టుకొని ఓ యువతి వయ్యారంగా నడుస్తూ వస్తోంది. ఆ యువకుడూ, ఆ యువతీ జోరుగా ఎకసెక్కాలు ఆడుకుంటూ, చిరునవ్వుల బాణాల్ని విసురుకుంటున్నారు. మోహపు చూపుల దండల్ని మార్చుకుంటున్నారు. నెత్తిమీదున్న ఆ పచ్చిగడ్డిమోపును జల్లలో వేసి, బండి ఎక్కమంటున్నాడు ఆ యువకుడు. నలుగురుచూస్తే ఏమనుకుంటారు? అంటూ కనుబొమల్ని ఎగురవేస్తూన్న దా యువతి.

అతను ఎడ్లబండిని ఆపాడు. పరంపట్టెమీదుగా క్రిందికి దూకాడు తొట్టిలోంచి. ఆమె బెదురు చూపులు చూస్తూ నిలబడింది. ఆమెతలపై పచ్చగడ్డి మోపును అతను లాక్కొని బండిజల్లలోకి విసిరివేశాడు. బండిఎక్కమని బలవంతపర్చాడు. నేను నడిచేవస్తానని బుంగమూతిపెట్టి, చేతుల గాజులు గలగల్లాడించిం దామె. ఆ చేతుల గలగలకూ, బుంగమూతికీ, కళ్ళల్లో కొట్టవచ్చినట్టు కనబడే మోహానికీ - అతని వొళ్ళు గరిపొడిచింది. ఆమె నడుంచుట్టూ కుడిచేయివేసి, బండిదగ్గ

రకు లాగాడు. నిశ్శబ్దంగా నిలబడ్డ ఎద్దు వాళ్ళసరసాల్ని తలలు ప్రక్కకుతిప్పి చూచాయి. నడుంచుట్టూ ఉక్కు చువ్వలా పెనవేసికొన్న చేతిని విడిపించుకొని, ఆమె చక్రం ఆకులమీద కాళ్లుపెట్టి, వసికర్ర పట్టుకొని జల్లలోకి ఎక్కింది.

ఆదృశ్యాన్ని కళ్లారచూసిన కుమారస్వామి ప్రకోపితుడైనాడు. ఆ ఛర్నాకోలతో ఆయువతీ యువకుల్ని బండికి కట్టివేసి నెత్తురుకళ్ళ జూద్దామన్నంత కోపావేశానికి గురియైనాడు. వాళ్ళెవరో అతనికి తెలియదు. తన ఊరివాళ్ళే అనుకున్నాడు. ఆ పచ్చిశృంగార మేమిటి? అంతబరితెగిపోయారా? వాళ్ళిద్దర్నీ నిలబెట్టి - నాలుగు చీవాట్లువేసే ఉద్దేశ్యంతో కుమారస్వామి గబగబా బండిదగ్గరకు వెళ్లాడు.

అంతలో ఆ యువకుడు తొట్లోకి ఎక్కి, చిరుగాలివంటి చిన్నదాని సొగసుకు మురిసిపోతూ, ఛర్నాకోలతో ఛెంగున అదలించాడు. బండి గతుకులదారిలో దడదడలాడుతూ వెళ్ళింది. ఆ దుమ్ము ముఖంపై పడగా-కుమారస్వామి చిందులు తొక్కాడు పళ్ళు పటపటలాడిస్తూ.

౭

ఆంధ్రాయూనివర్సిటీ డిగ్రీక్లాసుల పరీక్షాఫలితాలు వొచ్చాయి. ప్రెసిడెంటుగారింటికి ఉదయం ఎనిమిదిగంటలకు వార్తాపత్రిక వచ్చింది. సుదర్శనం అప్పుడే స్నానంచేసి, కాఫీ రెండోసారి త్రాగి. పేపరుకోసం ఎదురుచూస్తూ హాల్లో పడక కుర్చీలో కూర్చున్నాడు. దినపత్రిక చూడనిదే అతనికి కాలం

కదిలినట్టు కనబడదు. ముందు రాష్ట్ర రాజకీయాలను, పంచాయితీ బోర్డులకు సంబంధించిన వార్తలను ఆదుర్దాగా చదువుతాడు. ఆపైన దేశం మొత్తానికి సంబంధించిన విషయాలు; తీరికవుంటే కాలక్షేపంగా అంతర్జాతీయవార్తలు చూస్తాడు. ఆరోజువచ్చిన దినపత్రిక అందుకొని, రెండో పేజీలో ప్రకటించబడ్డ పరీక్షాఫలితాల్ని చూసి – కుమార స్వామిని కేకవేశాడు.

స్నానానికి తయారవుతూ, గదిలో అద్దంముందు నిలబడి, తలకు నూనెరాసుకుంటూన్న కుమారస్వామి అన్నయ్య కేక విని, గబగబా హాల్లోకి వచ్చాడు.

"నీ నంబరెంతరా? రిజల్ట్సు వచ్చాయి."

కుమారస్వామి నంబరు చెప్పాడు. కాని ఓ మోస్తరు ఆదుర్దానికూడా చూపెట్టలేదు. నిమ్మకు నీరెత్తినట్టు నిశ్చలంగా నిలబడ్డాడు చేతులు వెనక్కు పెట్టుకొని.

"ప్యాసైనావు. థర్డు క్లాసు" అన్నాడు సుదర్శనం పత్రిక అతని చేతి కివ్వబోతూ.

ఆ పత్రిక తీసికోకుండానే గదిలోకి వెళ్ళాడు కుమార స్వామి. థర్డు క్లాసు వొచ్చినందుకు అతనికి ఏ మాత్రం విచారం లేదు. ఎందుకంటె తను ప్యాస్ అవుతానని అతను ఊహించలేదు, ఏ సందర్భంలోనూ అనుకోలేదు. ఎవ్వరితోనూ గొప్పగా చెప్పుకోలేదు. ఒక వేళ పరీక్ష తప్పి యుండినా ఆశ్చర్యపడేవాడు కాదు. అతనికి చదువుమీదా,

పరీక్షలమీదా, డిగ్రీలమీదా శ్రద్ధ తక్కువ. చదువుయొక్క ముఖ్యోద్దేశం పందెంలో నెగ్గినట్టు పరీక్షలు ప్యాసుకావడం కాదు. విజ్ఞాన సముపార్జన, సంస్కారాన్ని పెంపొందించుకోవడం, నీతీ నిజాయితీల పరిధిలో జీవితానికి సార్థకతనూ, విలువలనూ చేకూర్చుకోవడం, ఆత్మ విశాలత్వాన్ని గట్టి పర్చుకోవడం, కట్నాలకోసం, హోదాకోసం, ప్యాషన్లకోసం చదివే వాళ్ళంటే అతనికి మంట. అట్లాంటి వాళ్ళను చాల తేలికగా చూస్తాడు.

పదకొండు గంటలకు భోజనాల దగ్గర కూర్చున్నప్పుడు, "ఏంచేస్తావు?" అన్నాడు సుదర్శనం తమ్ముడ్ని ఉద్దేశించి.

అన్నపు ముద్ద నోట్లో వుండడం చేత కుమారస్వామి వెంటనే సమాధానం ఇవ్వలేదు.

"ఎమ్. ఏ. చదువు. వీలుగా వుంటే ఎల్. ఎల్. బి. కూడా చదువు. ఉత్తర హిందూస్థానపు విశ్వవిద్యాలయాల్లో డబుల్ కోర్సు వుంటుంది. ఏ నాగపూరో, సాగరో, బెనారసో వెళ్ళి చదవటం మంచిది." మళ్ళీ అందుకున్నాడు సుదర్శనం.

"ఇంకా నేను చదవను" అన్నాడు కుమారస్వామి తల వంచుకొని ముక్తసరిగా.

చీమకుట్టినట్టు చివుక్కుమనగా, తమ్ముడికేసి చూశాడు సుదర్శనం. భోజనం చేయటం మానివేసి.

సుదర్శనం వూరుకోలేదు.

"ఎందుకని ?" అని మళ్ళీ తమ్ముణ్ణి ప్రశ్నించాను.

"ఇప్పటికి చదివింది చాలు. ఇంకా పై చదువుల వల్ల ప్రయోజన మేముంది? ఉద్యోగంచేసే ఉద్దేశ్యం నాకెప్పుడూ లేదు. నా చదువు యొక్క ఆశయం అదికాదు. ఇక ముందు కూడా కాదు. విరివిగా పుస్తకాలు చదివి-విజ్ఞానాన్ని జీర్ణించు కొనే శక్తి సామర్థ్యాలు నాకు ఏర్పడ్డవనే విశ్వాసం కలిగింది. ఎం. ఏలూ, ఎల్. ఎల్. బి. లు చదవడం శుష్కదండుగ."

తమ్ముడు ధోరణికి సుదర్శనం కలవరపడ్డాడు.

"అయితేఏం చేద్దామని!"

"చేసేందుకు చాలావుంది. చేయటానికి చాలా వున్నప్పుడుకూడా - చేయటానికి భయపడి, మనకెందుకులే అని తప్పించు కోవటం, బ్రతుకును ఓ గాడిలో పడవేసి, అదేసాగి పోతుందిలేగూడ్సుట్రైన్‌లాగా అని నిశ్చింతగా వుండడం - నా దృక్పథం కాదు. చేయదల్చుకుంది నిర్భయంగా, నిర్మొహమాటంగా, నిక్కచ్చిగా చేస్తాను."

"నువ్వు చేయదల్చుకున్న దేమిటి ?"

"ఎంతైనా వుంది. ముఖ్యంగా మన ఊరును మార్చాలి. ఈ వూళ్లో మనుషుల్లో స్వార్థం, ద్వేషం, అసూయ, అక్రమం, అన్యాయం, టక్కరితనం, వంచన, అవినీతి - పెచ్చు పెరిగి పోతున్నాయి. మోసాలు చేసికోవడం, ద్రోహాలు తలపెట్టడం, బక్కవాణ్ని అణగద్రొక్కడం, స్వలాభాన్ని ఆరాధించటం, కక్షలు పెంచుకోవడం, పార్టీలు కట్టడం, వర్గపోరాటాన్ని అధిక పర్చడం - ఇదీ ఈనాటి మన ఊరిపరిస్థితి. ఊరు ఘోరంగా

పాడైంది. మనుషుల మనస్తత్వాలు పుచ్చిపోయాయి. నీతికీ, న్యాయానికీ, ధర్మానికీ — చెదలు పట్టింది. చెదపురుగుల్లాంటి మనుషులు సంఘపెద్దలై, వ్యవస్థకే ముసలం తెస్తున్నారు. మానవత్వానికే అపఖ్యాతి కలిగిస్తున్నారు. ఇది సహించరాని శోచనీయమైనస్థితి. పది పదిహేనేళ్ల క్రితం మన ఊరు ఎల్లా వుండేది? ఇప్పుడెట్లా వుంటూన్నది! మనుషుల్లో అప్పటి ఆత్మీయతా, స్నేహసౌభ్రాతృత్వాలూ, సహకార సౌశీల్యతలూ, ధర్మవర్తనమూ, నీతినిజాయితీలపట్ల గౌరవాభిమానాలూ, నిర్మలమైన ప్రేమవాత్సల్యాలూ — ఇప్పుడున్నాయా? లేవు. ఈ అవ్యవస్థత, అసభ్యత, దోపిడీతత్వం, సంస్కారవిహీనత, పచ్చిస్వార్థం — మనుషుల్లో ఎందుకు పరవళ్లు త్రొక్కుతున్నాయి? "నవ భారత నిర్మాణం జోరుగా సాగిపోతూంది; అన్నిరంగాల్లో అభివృద్ధి తారాపథానికి జేరుతూంది. ప్రాజెక్టులు, పరిశ్రమలు, పంచాయితీ సమితులు, ప్రజాస్వామ్య వికేంద్రీకరణా, ప్రణాళికలూ — దేశంలో నవచైతన్యాన్ని కలిగించి, ముందంజకు పరిశుభ్రమైన రాస్తాను పరుస్తున్నాయి. ప్రజలు ప్రగతిపథంలో పరుగిడుతున్నారు" అంటున్నాయి పత్రికలు. నిజమేకావచ్చు. కాని మనిషిలో అంతర్గతంగా, ఆత్మపరంగా వొచ్చిన మార్పేమిటి? ఆమార్పు ఎల్లాంటిది? ఈనాటి మనిషి మరొకమనిషిని ద్వేషిస్తున్నాడు; ఎదుటవాని అభివృద్ధిని సహించలేకపోతున్నాడు; గడ్డిపోచలా పరిస్థితులకు లొంగిపోతున్నాడు; తాత్కాలిక ప్రయోజనాలకోసం, సంఘంలో స్థాయిని చిక్కించుకొనేందుకు, కీర్తిప్రతిష్ఠల్ని ఇనుమడింప

జేసే వ్యక్తిత్వంకోసం - అవినీతినీ, అన్యాయాన్నీ, అధర్మాన్నీ పోషిస్తున్నాడు; తనకి నయాపైసా లాభం కనబడితే- ఎదుట వాడికి రూపాయి నష్టమైనా లక్ష్యపెట్టడంలేదు. ఈ పనివల్ల తనకు సుఖమూ, ప్రయోజనమూ, శాంతీ లభిస్తాయనుకుంటే- సాటివాడి కష్టాన్నీ, నష్టాన్నీ, క్షేమనూ, దుర్మార్గాన్నీ దృష్టిలో వుంచుకోవడంలేదు. అధికారంకోసం, పదవులకోసం, ఆధిక్యత కోసం-కొంతమంది వ్యక్తులుచేసే తప్పుడుపనుల్నిగూర్చి చెప్ప నక్కరలేదు! మన స్వార్థం...వ్యక్తిత్వం మనిషి ఎంత దిగజారిపోయాడు! సంఘంలో బాధ్యతగల వ్యక్తులు ఎప్పుడు నైతికంగా, మానసి కంగా, ధార్మికంగా-పతనమౌతారో, ఆ ప్రభావం వ్యవస్థపై పడుతుంది. పండులో చేరిన పురుగులు, పండు మొత్తాన్నీ కుళ్ళ బెట్టినట్లు - అల్లాంటి వ్యక్తులు సంఘాన్నే కుళ్ళబెడతారు. మన ఊళ్ళోకూడా అల్లాంటివ్యక్తులున్నారు. అందుచేతనే మన ఊరు కుళ్ళిపోయే ప్రమాదంలోవుంది. ఆ ప్రమాదంనుంచి ఊరిని పరిరక్షించాలంటే కొంతమంది తీవ్రకృషి, ప్రతిఘటనాధైర్యం గలవారి సాహసం, నీతినిజాయితీలకు జీవితాన్ని ముడిపెట్టిన వారి అండదండలూ కావాలి. మన దేశానికి పల్లెటూళ్ళే పట్టు గొమ్మలు. పట్టుగొమ్మలు పెళుసుగావుంటే-చెట్టు సౌభాగ్యమే చెడిపోతుంది. గ్రామీణవ్యవస్థ పరిశుభ్రంగా, ఆదర్శప్రాయంగా సభ్యసౌశీల్యతలతో అలరారుతుంటే-దేశానికి అదే అందం; అదే రక్షణ; అదే పటిష్ఠత. మన ఊరి బాగుకు కృషిచేయ దల్చుకున్నాను. ఊళ్ళో తాండవిస్తూన్న అవినీతి, అక్రమం, స్వార్థచింతన, కక్షలూ, కార్పణ్యాలూ, అసూయాద్వేషాలూ- నిర్మూలించటానికి కంకణం కట్టుకున్నాను. అదే నా జీవితా -

దర్శం. నా ఆదర్శాన్ని ఆచరణలో పెట్టేందుకు శక్తి వంచన లేకుండా ప్రయత్నిస్తాను. అందుకే నేను చేయవల్సింది చాలా వుంది. నా కృషిలో నాకు విశ్వాసం వుంది ఎంతవరకు కృతకృత్యుణ్ణి కాగలననేది-వ్యక్తులపైనా, పరిస్థితులపైనా ఆధారపడి వుంటుంది."

తమ్ముడి ఉపన్యాసానికి సుదర్శనం నిర్ఘాంతపోయాడు. అతని ధోరణీ, దృక్పథమూ, కొండకు వెంట్రుకకట్టే సాహసమూ-సుదర్శానానికి బాధనూ, వెగటుదనాన్నీ కలిగించాయి. కుమారస్వామి అవివేకుడు. మొండిపట్టుదల గలవాడు. పర్వతం దగ్గరకు తను పోకుండా, అదే తనదగ్గరకు రావాల్సనే మూఢతత్వంగలవాడు. పైపెచ్చు ఇనుపకడ్డీలాంటి ఆదర్శాలతో జీవితానికి బలాన్నీ, సార్థకతనూ, విలువల్నీ పదిలిపర్చుకుందామనే నైజంగలవాడు. లోకజ్ఞానం వుంది. పరిస్థితుల్ని అవగాహన చేసికోగల నిపుణత గలదు. 'దేశం ఇట్లా ఎందుకవుతూన్నది' తెలుసు. కాని ఆవేశపరుడు. అతీత దృష్టితో అహాన్ని ఎక్కువ చేసికుంటున్నాడు. తన ఆలోచనల కనుగుణంగా, ఆదర్శాల అడుగుజాడల్లో, ఆశయాల నీడల్లో - ప్రపంచం నడవాలి; సాంఘికవ్యవస్థ మారాలి; మానవ చైతన్యం ఏర్పడాలి. అనే పదునైన స్వభావం గలవాడు. అట్లాంటి స్వభావాన్ని వృద్ధిచేసికుంటూ, కొండలాంటి సామాజికవ్యవస్థను 'ఢీ' కొనాలంటే - తల బొప్పికట్టక మానదు. జీవితంలో అపజయాన్ని పొందక తప్పదు. ఆదర్శాలు బోర్లపడక మానవు. ఆశయాలు అగాధంలోకి జారటం తథ్యం. నలుగురు నడిచే బాటలో నడవటమే ఈనాటి మనిషికి సుఖం,

కర్తవ్యం, ప్రయోజనం. కొత్తదారిలో కాకులు దూరని కారడవు లుండవచ్చు; అధిగమించరాని పర్వతాలుండవచ్చు; సముద్రాలుండవచ్చు. పాతదారి ఎప్పుడూ సుగమమైనది. ప్రమాదంలేనిది.

"నీ ధోరణీ, దృక్పథమూ చాల అసహజంగాఉన్నాయి. ఆచరణ సాధ్యంకానివి-నీ ఆదర్శాలు, ఆశయాలూ. అయినా నీకెందుకురా ఈ దేశసేవ ?" అన్నాడు సుదర్శనం.

"అర్థంలేనిప్రశ్న." అన్నాడు కుమారస్వామి. కొంచెం ఆవేశాన్ని పొందినవాడై.

వంటగదిలోకి వచ్చిన మంగమ్మ, కొడుకు లిద్దరూ ఎండిపోయిన ఎంగిలి చేతులతో అన్నం తినకుండా వాదించు కోవటాన్ని చూసి, విస్తుపోయి - "అదేమిటి ! అట్లా పళ్ళాల ముందు ఎండిపోయిన చేతులతో కూర్చున్నారు. ముందు భోజనం చేయండి. ఆ తర్వాత మీ వాదనలు..." అన్నది.

ఇద్దరూ మళ్ళీ అన్నం తినేందుకు వంగారు. మాట్లాడ కుండా భోజనాలు ముగించారు. పళ్ళాల్లోనే చేతులు కడు క్కొని, ఇద్దరూ వంటగదిలోంచి బయటికొచ్చారు. కుమార స్వామి తన గదిలోకి వెళ్లాడు. సుదర్శనం పంచాయితీబోర్డు ఆఫీసుకు వెళ్ళాడు.

ఆ రోజు మధ్యాహ్నం కుమారస్వామి తన గదిలో పడుకొని, ప్లేటో 'రిపబ్లిక్' చదువుకుంటూ వుండగా-మంగమ్మ చప్పుడు చేయకుండా వచ్చి, మాడామీద కూర్చున్నది.

రెండు నిముషాల వరకూ అతను తల్లిని గమనించలేదు. ఆ తర్వాత 'ఏమిటమ్మా!' అన్నట్టు తల్లికేసి చూశాడు.

"పరీక్ష ప్యాసైనావటగా! పైచదువుకు పోవూ!" అన్నది మంగమ్మ మనస్సులో చెప్పదల్చుకున్న విషయానికి ఉపోద్ఘాతంగా.

"చదివింది చాలదూ!"

"ఆమాటానిజమేలే! పెద్దచదువులు చదివి ఉద్యోగాల్లో చేరి, ఊరూరా తిరగాల్సినఖర్మ మనకేం పట్టింది. ఉద్యోగాలు చేయటం మనవంశంలోనే లేదు. అయితే వెంటనే పెళ్ళిచేసికో. సంబంధాలుకూడా చాలా ఉన్నాయి. నీకు నచ్చిన పిల్లను చేసికోవచ్చు" మంగమ్మ దీర్ఘాలు తీసింది.

"నాకుపెళ్లా!" ఆశ్చర్యంగా అన్నాడు కుమారస్వామి. తల్లి అంతకంటె ఎక్కువగా ఆశ్చర్యపడింది.

"మరి నీకుగాక మరెవరికిరా? చదువు పూర్తిచేసావు, వయస్సువచ్చింది. నేను మంచానపడకముందే నీ కామచ్చట కూడా తీరిపోతే – నాకే దిగులూ వుండదు."

"పెళ్ళి మొదట్లో ముచ్చటగానే వుంటుంది. ఆ తర్వాతే ముసళ్ళపండుగ. పెళ్ళిచేసికున్న వాళ్ళంతా సుఖంగా వుంటు న్నారా? దేనికి, లేనిపోని బెడదను కొనితెచ్చుకోవడం. పెళ్ళిచేసికోకుండానే నేను నిశ్చింతగా వుంటాను." అంటూ కుమారస్వామి పుస్తకంలోకి మళ్ళీ తలదూర్చాడు.

మంగమ్మకు మెదడంతా ఓమాటు మొద్దు బారింది. చిన్న కొడుకు నోటినుంచి అట్లాంటి మాటల్ని ఆవిడ

ఊహించలేము. కూర్చో బెట్టిన బొమ్మలా కొన్ని క్షణాల పాటు కూర్చుండి పోయింది. అంతలో శశిరేఖ గదిలోకొచ్చింది చిరునవ్వు నవ్వుతూ.

"చూడవే శశీ! వీడెంత విడ్డూరంగా మాట్లాడుతున్నాడో! పెళ్ళి చేసికోడుట. ఈ చోద్యం ఎక్కడేనా వుందా! ఎప్పుడేనా విన్నామా!" మళ్లీ అందుకుంది మంగమ్మ.

"అదేమి టబ్బాయోయ్! పెళ్లి చేసికోవా?" అంటూ దగ్గరున్న కుర్చీలో కూర్చుంది శశిరేఖ. ఆమె ముఖాన సందర్భంలేని చిరునవ్వు సాగుతూనేవుంది.

కుమారస్వామి చదివే పుస్తకాన్ని మూసేశాడు.

"నాకు పెళ్ళి, సంసారం, పిల్లలు, గందరగోళం – వీటి మీద సదభిప్రాయాలులేవు. అసలు నన్నడిగితే పెళ్ళిచేసికోవడం ఓరకమైన స్వార్థం. కని పెంచిన నేరానికి త్వరగా పెళ్ళిచేసి, బాధ్యత వొదిలించుకుందామన్న వధువు తల్లిదండ్రుల తాపత్రయం స్వార్థం; పెంచినందుకూ, చదువు చెప్పినందుకూ సరిపడ్డ కట్నాన్ని పెళ్ళిద్వారా రాబట్టుకోవాలన్న వరుని తల్లిదండ్రుల కోర్కె కూడా స్వార్థమే. పెళ్ళి చేసికొని, భార్యద్వారా సుఖాన్ని పొందాలనుకోవటం పెళ్ళికొడుకు స్వార్థం; పెళ్ళిద్వారా, జీవిత భారాన్ని భర్తపై వేయాలనుకోవటం భార్య స్వార్థం. రకరకాలైన స్వార్థాలతో కూడుకున్న పెళ్ళిని నే నెందుకు చేసికోవాలి? కాబట్టి నాకు పెళ్ళి అక్కర్లేదు. పెళ్ళిచేసికొని ఎంతమంది నిజంగా సుఖశాంతుల్ని పొందుతున్నారో వ్రేళ్ళమీద లెక్కించి

చెప్పండి ! పెళ్ళి అయిన దగ్గర్నుంచీ, ఇరువురిమధ్యా సంసారంలో చీకాకులూ, చీత్కారాలూ, అపోహలూ, అలిగి పోవటాలూ, పోట్లాటలు,కొట్లాటలు, మధ్యవర్తుల జోక్యాలూ,సర్దుబాటులూ, విడాకులూ, కోర్టులూ, మనవర్తులూ–వైవాహిక బంధంలో మనం నిత్యమూ చూస్తున్న చిక్కులే ఇవి. వివాహం ఒక ఆచారమేగాని – తప్పనిసరియైన నియమం కాదు. మనం భూమిమీద జన్మించింది కేవలం పెళ్ళిచేసికోవడానికీ, పిల్లల్ని కనడానికీ, జనసంఖ్యను పెంచడానికీ కాదు. ప్రతి వ్యక్తీ తన బ్రతుకును సార్థకపఱ్చుకోవడానికి కొన్ని ఆదర్శాల్ని ఏర్పరచుకొని – వాటి సాధనకే జీవితకాలాన్ని వినియోగించాలి. పెళ్ళి, సంసారము, పిల్లలు – మొదలైన ప్రాకృతికమైన విషయాలు, ఆ ఆదర్శాల నీడనే జరిగిపోవాలిగానీ జీవితంలో ప్రాముఖ్యాన్ని పొందరాదు. పెళ్ళిచేసికోకుండా బ్రహ్మచారిగా వుండిపోవడం నా ఆశయాల్లో ఒకటి. నేను స్వతంత్ర జీవిని. స్వేచ్ఛగా బ్రతకడం, స్వేచ్ఛగా మాట్లాడటం, స్వేచ్ఛగా తిరగడం, స్వేచ్ఛగా ఆలోచించుకోవడం – నా ఆశయాల్లో మరొకటి. ఆ స్వేచ్ఛే నాకు సుఖం, సంతృప్తి, వెలుగు. పెళ్ళిచేసికుంటే– అట్లాంటి స్వేచ్ఛనాకు లభించదు. నా ఆదర్శాన్ని ఆచరణలో పెట్టేందుకు అవకాశం వుండదు. నా ఆశయాల ప్రకారం బ్రతుకును మళ్ళించుకోవడం కష్టం. కనుక నన్ను పెళ్ళి చేసికోమని మీరు నన్ను వొత్తిడి పెట్టకండి" అన్నాడు కుమారస్వామి. వెంటనే పుస్తకం తెరిచాడు – చదువుకొనేందుకు.

మంగమ్మ నోటిమీద అయిదువేళ్లూ పెట్టుకొని నిర్విణ్ణు రాలైంది.

మఱదితో తను వాదించి లాభంలేదనుకొని, కుర్చీ లోంచి లేచి వెళ్ళింది శశిరేఖ.

మంగమ్మ మామూలు స్థితిలోకి రావటానికి చాలసేపు పట్టింది. ఆవిడ మాడామీదనుంచి లేస్తూ, "అయితే నువ్వు జీవితంలో పెళ్ళే చేసుకోవన్నట్టా" అన్నది.

కుమారస్వామి తల్లి మాటల్ని వినిపించుకోలేదు.

సమాధానం కోసం ఓ నిమిషంసేపు నిలబడి, ఏవో గొణుక్కుంటూ గదిలోంచి వెళ్లింది మంగమ్మ.

౫

భూగోళశాస్త్రరీత్యా ప్రపంచాన్ని రెండు భాగాలుగా విభజించవచ్చు: ఉత్తరధ్రువమూ, దక్షిణధ్రువమూ. మనదేశాన్నిగూడా రెండుభాగాలు చేయవచ్చు: ఉత్తర భారతము, దక్షిణభారతము. పై విభజన నైసర్గికస్వరూపాన్ని బట్టి చేయబడినది. కాని నేడు రాజకీయాలదృష్ట్యా భారత దేశంలో ప్రతిగ్రామాన్ని రెండు భాగాలుగా విడదీయవచ్చు. రెండుపార్టీలు లేని ఊరులేదు. ఒకపార్టీ అధికారవర్గానికి – అంటే గ్రామపంచాయితీ అధ్యక్షునికి చెందినది. మరోపార్టీ అధికారవర్గానికి వ్యతిరేకమైనది – అంటే పంచాయితీబోర్డు

లోని ప్రతిపక్షసభ్యులకు చెందినది. ఈ రెండుపార్టీలే కాకుండా మూడోపార్టీ, నాలుగోపార్టీగల ఊళ్ళుకూడా లేకపోలేదు.

ఆ ఊళ్ళో ముఖ్యంగా రెండేరెండు పార్టీలు. ఒకటి పంచాయితీబోర్డు ప్రెసిడెంటు సుదర్శనంది. రెండోది ప్రెసిడెంటుకు పోటీచేసి రెండుఓట్ల తేడాతో ఓడిపోయిన బసవనాగయ్యది. రెండువర్గాలూ బలమైనవే. సుదర్శనంపార్టీలో షావుకార్లూ, డబ్బుగలవాళ్ళూ, రౌడీలూ, భయస్థులూ, రాజకీయపు ఎత్తుల్లో ఆరితేరినవాళ్ళూ, ముఠాను ఆకట్టుకొనే నైపుణ్యంగలవాళ్ళూ ఉన్నారు. బసవనాగయ్యపార్టీలో మధ్య తరగతి రైతులూ, పేదవాళ్ళూ, కూలివాళ్ళూ, జీవితంలో ఏదోరకంగా దెబ్బతిన్నవాళ్ళూ, ధనికవర్గాన్ని ద్వేషించేవాళ్ళూ, ఉడుకురక్తంలాంటి భావాలుగల యువకులూ ఉన్నారు. ఊళ్ళో ఏ ఎలక్షనువచ్చినా సుదర్శనంపార్టీవాళ్ళే నెగ్గుతూవుంటారు. బసవనాగయ్యపార్టీవాళ్ళు పోటీచేస్తూ వుంటారు; ఓడిపోతూవుంటారు. అయినా వాళ్ళలో ఆశ చావ లేదు. చావదు. నిరాశలోనే ఆశను పెంచుకోవడానికి అల వాటు పడ్డారు. 'ఈ ఊరిని తమ అధీనంలోకి తీసికొనే రోజు వస్తుంది. పంచాయితీబోర్డును పట్టుకొని, తమ ఆశయాల ప్రకారం పరిపాలించే శుభసమయం ఎప్పటికైనా రాకపోదు.' దృఢవిశ్వాసంతో అనుకుంటూవుంటారు. సుదర్శనంముఠావాళ్లు ఎప్పుడూ ఆధిక్యతనూ, హెచ్చుదనాన్నీ, హెూదానూ, అధికారపక్షపు విర్రవీగునూ - మాటల్లో, చేతల్లో స్పష్ట పరుస్తూ వుంటారు.

బసవనాగయ్యా ముఠావాళ్ళు ఉక్రోషాన్నీ, ఏమీ చేయలేని బలహీనతనూ, 'ఇవి మంచివాళ్ళకు రోజులుకావులే' అన్న భావాన్నీ, అసూయా ద్వేషాల్నీ, మైనారిటీవర్గ తత్వాన్నీ - మాటల్లో ప్రకటిస్తూ వుంటారు. బసవనాగయ్యా వర్గం వాళ్ళ నోళ్లు పెద్దవి. లౌడుస్పీకర్లలాంటివి. సుదర్శనం వర్గం వాళ్ళ నోళ్ళు అంత పెద్దవి కావు. లౌడుస్పీకర్లలా వాగ లేవు. ప్రతి బోర్డు మీటింగులోనూ గందరగోళమే! గలా టాయె! ఒక్కోసారి కుర్చీలు ఎత్తుకొని విసరుకొనే 'క్లైమాక్సు' కూడా వస్తుంది. ఏమైనా మెజారిటీ సుదర్శనం పార్టీది. వాళ్ళ ముఠా మనుష్యులు నివసించే ఇళ్ళకే మంచిరోడ్లు; వీధుల్లో దీపాలు; శుభ్రమైన సైడుకాల్వాలూ; సెప్టిక్ లెట్రి నులూ. బసవనాగయ్యా ముఠావాళ్ళ వీధులకు మంచిరోడ్లు లేవు, గొడ్డూ గోదా నడవాల్సిందేగాని,మనుష్యులూ బళ్ళూ నడవటం కష్టం; సహజంగా ఏర్పడ్డ సైడుకాల్వలు దుర్గం ధంలో గట్టులేని ప్రవాహంలా రోడ్లపై విచ్చలవిడిగా ప్రవ హిస్తూవుంటాయి; రాత్రుళ్లు వెలుగుకు నోచుకోలేదు రోడ్లు; తడికెల దడుల లెట్రినులేగానీ, సెప్టిక్ టాంకులు కావు.

ఊళ్ళో గ్రంథాలయ యాజమాన్యం, కో-ఆపరేటివ్ సొసైటీ పాలన, ప్రసూతి శిశుకేంద్రపు అజమాయిషీ, దేవా లయపు ధర్మకర్తృత్వమూ, హైస్కూలు మేనేజిమెంటూ - సుదర్శనం పార్టీ వాళ్ళదే. బసవనాగయ్యా పార్టీవాళ్ళు ఆ గ్రంథాలయానికి వెళ్ళరు. ఓ పాతికమంది యువకులు 'యువ జన గ్రంథాలయం' అనేచిన్న లైబ్రరీ ఓ గది అద్దెకుతీసికొని పెట్టి, వార్తా పత్రికలు తెప్పించుకుంటారు. అందులో పుస్త

కాలు లేవు. దానికి గవర్నమెంటు గ్రాంటు రాదు. కో-ఆపరేటివ్ సొసైటీ పాలనలో వారికి ప్రాతినిధ్యం లేదు. ఆ సొసైటీవల్ల కలిగే సౌకర్యాలు వాళ్ళకు లేవు. పంచదార, ఎరువులు, విత్తనాలు మొదలైనవి వాళ్లకు పంపకానికి అందవు. వాళ్ళు అవసరమైతే తమ ఆడవారి కాన్పులకు బస్తీకే వెళతారుగానీ, ఊళ్ళోని ప్రసూతి కేంద్రానికి వెళ్ళరు. వెళ్ళితే జాగ్రత్తగా చూడరనిభయం. కొంతమంది దేవాలయానికికూడా వెళ్లరు. మరికొంతమంది తమ పిల్లల్ని ఊళ్లోని హైస్కూలుకు పంపరు. మూడుమైళ్ళదూరంలోవున్న ప్రక్క గ్రామపు హైస్కూలుకు పంపుతారు. ఊళ్ళో పార్టీలు బలపడి, వైషమ్యాలు ముదిరి, కక్షలు పెరిగాక - పెద్ద రైతులు కొంతమంది, సుదర్శనం పార్టీకి చెందినవాళ్ళు, బక్క రైతుల్నుంచి పాలిపొలాలు తీసికొని సొంతసేద్యం పెట్టారు.

ఊళ్ళల్లోనూ, మాసూళ్లోనూ పల్లెజనం బసవనాగయ్య పార్టీకి చెందినవాళ్ళు కావటంవల్ల, ప్రక్క ఊళ్ళనుంచి కూలీలను ఎక్కువ రేట్లు కిరాయి యిచ్చి, పనిచేయించుకుంటూ వుంటారు. సొంత ఊరిపొలంలో పొరుగూరి కూలిజనం పనిచేయటం పల్లెవాళ్లకి తగనిమంట. అయినా పళ్లు పటపట కొరకటం, పిడికిలి నలుపుకుంటూ కూర్చోవటంతప్ప-వాళ్ళేమి చేయగలరు? బసవనాగయ్యాముతా ఆసాముల పనుల్లోకే వెళుతూంటారు - కూలి తక్కువైనా రైతుల్లో కూడా సహకార సామరస్యాలు తగ్గాయి. పొలం నాట్ల సమయంలో నీళ్లదగ్గర తగాయిదాలు పడుతూ వుంటారు. క్రితం సంవత్సరం బ్రాంచి కెనాల్‌కు గండిలుకొట్టి ముందుగా పొలం తడుపు

కున్నందుకు సుదర్శనం పార్టీవాళ్లు ఓవర్సీరును వో త్రిడిపెట్టి - బసవనాగయ్యా పార్టీవాళ్ళపైన ఆర్రో నెంబరు వ్రాయించి కలెక్టరుచుట్టూ, ఇంజనీర్ల చుట్టూ, కోర్టులచుట్టూ త్రిప్పించి మూడు చెర్వులనీళ్ళు త్రాగింపజేశారు. కలెక్టరుగారికీ, పెద్ద దొరగారికీ ఎన్ని మెమోరాండాలు పెట్టినా - డబ్బు చాలా వొదిలింది. అట్లాగే సుదర్శనం పార్టీవాళ్ళు రెండో నెంబరు బ్రాంచి కెనాల్‌కు నారుమళ్ళ నీళ్ళకోసం గంపీలుకొడితే - ఆ ఓవర్సీరే కళ్లు మూసికొని పాలు త్రాగాడు. పై అధికార్లకు పిటీషన్లు పెట్టినా ప్రయోజనం లేకపోయింది. అప్పట్నుంచీ గ్రామరాజకీయాల్లో రెండువర్గాలమధ్య ఉద్రిక్తత హెచ్చింది.

బసవనాగయ్యా ముఠాలోని యువకుల్లో ఉడుకురక్తం ఎర్రెర్రగా కందసాగింది. ఊరి వాతావరణంలోని గంభీరతను చూసి ముసలివాళ్లు 'ఎప్పుడో ఊళ్ళో పెద్దయుద్ధం జరుగుతుంది యిరుపక్షాలమధ్య, కొన్ని శవాలు లేవక తప్పదు; అప్పుడుగానీ తెలిసిరాదు' అనుకుంటూవున్నారు. ఊరిపరిస్థితి అట్లాంటి తీవ్రదశలోవుండగా - కుమారస్వామి ఏ పార్టీకి చెందినవాడు! అన్న సందేహం కొంతమందికి కలగక పోలేదు.

నిజానికి కుమారస్వామి ఏ పార్టీకిచెందిన వ్యక్తికాదు. ఆ విషయం సుదర్శనానికీ స్పష్టంగా తెలుసు. అన్నయ్యాపార్టీ వాళ్లతోనూమాట్లాడతాడు. బసవనాగయ్యాపార్టీవాళ్లతోనూ తిరుగుతాడు. సెలవలకు ఇంటికి వొచ్చినప్పుడల్లా ఇరుపక్షాలకు చెందిన మనుష్యుల దగ్గరా-ఊళ్లోజరుగుతున్న వ్యవహారాలను అడిగి తెల్సుకుంటాడు. రెంటికీ సామ్యం చిక్కక చిరాకు

పడతాడు. తనకు తానుగానే కొన్ని నిర్ణయాలన్నీ చేసుకుంటాడు. ఏమైనప్పటికీ కుమారస్వామికి కొన్ని విషయాలు విశదమైనాయి. పంచాయితీబోర్డు, హైస్కూలు, కో-ఆపరేటివ్ సొసైటీ, దేవాలయపుట్రస్టీ చేజిక్కించుకొని, అన్నయ్యాపార్టీ వాళ్లు అధికార దుర్వినియోగంచేస్తూ, మైనారిటీవర్గాన్ని అన్ని విధాలా అణగద్రొక్కేందుకు ప్రయత్నిస్తున్నారు.ముఠాని బలపర్చుకోవడం, తన వర్గానికి సౌకర్యాల్ని కల్పించుకోవడం, పాక్షికంగా వ్యవహరించటం, అన్యాయాలకూ, అక్రమాలకూ జంకకపోవడం, ప్రతి పనీ కసికొద్దీ, ప్రతీకారవాంఛావేశంతో చేయడం - అన్నయ్య పార్టీ ఊళ్ళో ఆధిక్యతను నిరూపించుకుంటోంది. ఈ పద్ధతీ, దృష్టీ, దృక్పథమూ, పరిణామమూ - ఊరికి మేలుకాదు. ఊరి పతనానికే దారితీస్తాయి. తను ప్రతిఘటించి తీరాలి. ఊళ్ళో దాదాపు సగం మందికి అసౌకర్యాలు, అన్యాయాలు, అక్రమాలు జరుగుతున్నాయి. సగం రోడ్లు అధ్వాన్నస్థితిలో ఉన్నాయి; సగం ఊరికి రాత్రి పూట దీపాలు లేవు; సగం ప్రజలకు ఆరోగ్య రక్షణ సరిగ్గా లేదు. అట్లా ఎందుకు జరగాలి? ప్రజలంతా పన్నులు చెల్లించడంలేదా? ప్రతి వ్యక్తికీ సుఖంగా, సౌకర్యంగా నివసించే హక్కులేదా? గ్రామపంచాయితీ అధికారులకు సక్రమంగా, న్యాయంగా, నిష్పాక్షికంగా ప్రవర్తించాల్సిన బాధ్యతలేదా? తను సహించరాదు. అన్నయ్య పదవీవ్యామోహంతో, అధికారదర్పంతో, ముఠాతత్వంతో - అన్యాయంగా, అధర్మంగా, పక్షపాతబుద్ధితో వ్యవహరిస్తున్నాడు. అన్నయ్య మనస్తత్వాన్నీ, పార్టీతత్వాన్నీ, ప్రవర్తననూ మార్చాలి. అప్పుడు

గానీ ఊరు బాగుపడదు. ఈ పార్టీలూ, కక్షలూ, ఉద్రిక్తతలూ, పరస్పర ద్వేషాలూ - నశించాలి. అందుకు తను నిర్విరామంగా కృషి చేయాలి.

ఒకరోజు మధ్యాహ్నం సుదర్శనం ఖాళీగా వున్నప్పుడు కుమారస్వామి వెళ్ళి - నిర్మొహమాటంగా తన మనస్సులో వున్న విషయాలన్నిటినీ చెప్పి, "అన్నయ్యా! పంచాయితీ బోర్డు ప్రెసిడెంటుగా, ప్రజల నాయకుడివిగా నువ్వు అట్లాంటి వర్గతత్వాన్ని ప్రోత్సహించడం, పక్షపాతంతో ప్రవర్తించడం, అల్పసంఖ్యాకుల్ని అణగద్రొక్కేందుకు పూనుకోవడం, ముఠావాళ్ల చేతిలో కీలుబొమ్మ కావటం - సమంజసం కాదు. పంచాయితీ అధ్యక్షునిగా నీ బాధ్యతల్ని, విధుల్ని, చేష్టల్ని ఎన్నడైనా ఆత్మవిమర్శ చేసికొని చూచుకున్నావా? నీ పాలనలో ఒక వర్గం సౌకర్యాల్ని, ఆధిక్యతను పొందుతూన్నది. మరొక వర్గం అసౌకర్యాల్ని, అన్యాయాల్ని అనుభవిస్తోంది. ఇందుకేనా నిన్ను గ్రామప్రజలు అధ్యక్షునిగా ఎన్నుకుంది? పంచాయితీ పాలన ముఖ్య ఆశయాలకే ఆచరణలో అప్రదిష్ట తెస్తున్నావు. తద్వారా దేశానికే ద్రోహం చేస్తున్నావు. ఈ ముఠా వ్యామోహాన్నీ, పక్షపాతబుద్ధినీ వొదులుకోకపోతే - నిరాశచెందే ప్రజలు తగినట్టు దెబ్బతీస్తారు." అన్నాడు.

అన్నయ్య అన్న అభిమానమూ, భక్తీ, వినయమూ లేకుండా, అట్లా కుండ బద్దలు కొట్టినట్టు కఠినంగా తమ్ముడు మాట్లాడటం-సుదర్శనానికి ఆశ్చర్యం కలుగలేదు గానీ, బాధపడ్డాడు. తమ్ముడ్ని చూస్తే అతనికి భయం. కుమారస్వామి

నీతీ నిజాయితీలూ; అన్యాయాన్నీ, అక్రమాన్నీ, అధర్మాన్నీ సహించలేని మనఃప్రవృత్తీ; వాటిని యెదుర్కొనే ఆవేశమూ; ధైర్యస్థైర్యాలూ - సుదర్శనానికి అంతర్గత భయ కారణాలు. కనుక తన తప్పిదాల్ని గురించి సూటిగా చర్చించి, సమర్థించుకో జూడడు.

"ఈనాటి రాజకీయ పరిజ్ఞానం నీకు లేదురా! ఇప్పటి రాజకీయాలకు సిద్ధాంతానికీ, ఆచరణకూ ఎంతో తేడావుంది. సిద్ధాంతాన్ని సిద్ధాంతంగానే ఆరాధించాలి. ఆచరణ కొచ్చేప్పటికి - సిద్ధాంతాన్ని దృష్టిలో పెట్టుకోనక్కర్లేదు. సిద్ధాంత రీత్యా ఆచరణకు ప్రాముఖ్యత నిస్తే - అభివృద్ధికి పోవడం కష్టం. అడ్డదారిని చేరుకున్నంత త్వరగా, రహదారిని గమ్యస్థానము చేరుకోలేము. ఈ పల్లెటూరి రాజకీయాల్లో వున్న తికమకలు నీకు తెలీప్. కుడీ ఎడమా భేదాలులేకుండా అందర్నీ ఒకే రకంగా ఆదరిస్తే - మన పార్టీ ఏముంది? మన పార్టీ యొక్క ప్రయోజన మేముంది? మన వాళ్ళ ఆధిక్యతేముంది? మనల్ని నమ్ముకున్నందుకు - వాళ్ళకి ప్రత్యేకమైన వనర్లేమిటి? ఈ ఊరి రాజకీయాల్లో నువ్వు తల దూర్చటం మంచిది కాదు. సిద్ధాంతానికీ-ఆచరణకూ పొత్తు వుండాలంటావు ఈ రోజుల్లో అది సాధ్యపడదు. ముక్కుకు సూటిగా పోవాలనటం ఎంత మొండితనమో, సిద్ధాంతం ప్రకారం ఆచరించాలనటం కూడా అంత మొండిదనమే! ముక్కుకు సూటిగా పోతే - ముక్కు బెదురుతుంది. అల్లాగే సిద్ధాంతం ప్రకారం ఆచరిస్తే తల బొప్పి కడుతుంది."

"చాలా చవకబారుగా మాట్లాడుతున్నావన్నయ్యా! నమ్ముకున్న సిద్ధాంతాల్ని, ఏర్పచ్చుకున్న ఆదర్శాల్ని, నిర్ణయించుకున్న ఆశయాల్ని - ఆచరణలో పెట్టే ధైర్యంలేనప్పుడు, కష్టనష్టాల్ని ఎదుర్కోవాల్సి వస్తుందన్నభయం ఉన్నప్పుడు, పిరికిదనంతో దృక్పథాల్నించి జారిపోయేప్పుడు, గొప్ప సిద్ధాంతాలకూ, ఉన్నతాదర్శాలకూ, ఉన్నతాశయాలకీ జీవితంలో ప్రాధాన్యతనిచ్చి, ప్రజాసేవకు పాటుపడుతున్నామని - ప్రకటించుకోవటం దేనికి? బురఖా తగిలించుకొని ప్రజల్ని మోసం చేయడం దేనికి? స్వార్థపరులై, ముఠా రాజకీయాలకు లోనై అధికార దుర్వినియోగం చేస్తూ, సోషలిస్టు సమాజికవ్యవస్థకు అపకీర్తి తెస్తూ ప్రజల్ని, ప్రభుత్వాన్ని దోచుకోవడం దేనికి? గ్రామమంటే - అందులో కొంతభాగమేనా? గ్రామప్రజలంటే - కొంతమంది ప్రజలేనా? గ్రామాభివృద్ధిఅంటే - కొంతమేరకు జరిగిన అభివృద్ధేనా? మీలాంటివారు పంచాయితీలకు అధ్యక్షులుగా వున్నంతకాలమూ - గ్రామీణవ్యవస్థ ఇట్లా అస్థవ్యస్థంగానే వుంటూ, ప్రజాస్వామ్య మనుగడకే ప్రమాదం వాటిల్లుతుంది. మీరు స్వార్థానికి, కక్షలకూ, కార్పణ్యాలకూ, ముఠాలకూ నాయకులుగానీ - ప్రజలకుకాదు. మీకు సిద్ధాంతాలు లేవు; ఆదర్శాలులేవు; ఆశయాలులేవు. అన్నీ మాటల్లోనే. దోపిడీయే మీ సిద్ధాంతం; అధికారాన్ని చేపట్టటమే మీ ఆదర్శం; పదవులూ, ముఠాలూ పెంచుకోవడమే మీ ఆశయాలు" - కుమారస్వామి ఆవేశపూరితుడై ముఖాన్ని ఎరుపు చేసికున్నాడు.

"అనుభవం తక్కువ. ఆవేశం ఎక్కువ. జీవితంలో నువ్వింకా అక్షరాభ్యాస దశలోనే వున్నావు. అనుభవం ఇంకా నీకు పాఠాలు నేర్పలేదు. వ్యవహారానికీ, పరిపాలనకూ అనుభవం ముఖ్యంగానీ – ఆవేశంకాదు. సిద్ధాంతాల ఎండ మావులకు లోనై, ఉడుకురక్తపుటావేశానికి గురై మాట్లాడు తున్నావుగానీ, 'దేశంలో ఏం జరుగుతూంది?' అని ఒక్కసారి పర్యాలోకించిచూస్తే – ఇంత కఠినంగా మాట్లాడవు. రాజకీయాలకూ, మతాతత్వానికీ, స్వప్రయోజనాలకూ అతీతుడై ఒక్క పంచాయితీబోర్డుప్రెసిడెంటు నిజాయితీగా ప్రవర్తించితే మట్టుకు – దేశం బాగుపడుతుందా? అతని నిజాయితీని, ఆదర్శ తత్వాన్ని, ఉత్తమభావాల్ని మెచ్చుకుంటారా? మెచ్చు కున్నా మాటల్లోనేగానీ – అతనెంతకాలం తన స్థానాన్ని నిల్పుకోగలుగుతాడు? ప్రచండంగా ప్రవహించే వరదలో – గడ్డిపోచ తలఎత్తి ఎంతసేపు నిలబడగలదు?...రాజకీయాల్లో దిగేముందు ఆవేశాన్ని కట్టిపెట్టి, ప్రశాంతంగా ప్రేక్షకునివలె అనుభవాన్ని ప్రోగుచేసికో. అనుభవంలేకుండా ఆశయాల్ని ఆరాధిస్తూ ఆవేశాన్ని పెంచుకుంటూ కూర్చుంటే— గాలిలో మేడలుకట్టడమే అవుతుంది." – కుర్చీలోంచి లేచి సుదర్శనం బజారుకెళ్లాడు, తమ్ముడితో వాదనలో దిగడంవల్ల తన కెట్టిప్రయోజనమూ లేదనుకుంటూ.

తీవ్రంగా అన్నయ్యను ప్రతిఘటించేందుకు నోరు విప్ప బోయే సమయానికి, అట్లా పిరికిగా లేచిపోవడం – కుమార స్వామికి ఆశ్చర్యమూ, అసహ్యమూ వేసినయ్. రెండు నిముషాలపాటు నిశ్చలంగా ఆలోచించి వదినదగ్గరకు వెళ్లాడు.

"వదినా! అన్నయ్య వ్యవహారం ఏం బావుండలేదు. ఊరును నాశనం చేస్తున్నాడు. తన ముఠాని పెంచుకొంటూ, తన ముఠావాళ్లకి అధికార హోదాలో సౌకర్యాలూ, పంపకాలు కలిగిస్తూ, ఎదుటివాళ్లకు అన్యాయంచేస్తూ నేల మట్టానికి అణగద్రొక్కేందుకు ప్రయత్నిస్తున్నాడు. ఇది అన్నయ్యకు శ్రేయస్కరం కాదు. ఊళ్లో స్పర్థల్నీ, కక్షల్నీ, భేదాల్నీ, ఎక్కువ తక్కువల్నీ గట్టిపర్చడం - ఊరికీ, దేశానికీ, మానవత్వానికీ ద్రోహంచేయడమే. అన్నయ్యను మనస్సు మార్చుకోమని చెప్పు."

"నువ్వు చెప్పింది నిజమే నబ్బాయ్! మీ అన్నగారు ప్రతి పనీ పక్షపాతంతోనే చేస్తున్నారు. తన పార్టీని బలపర్చుకుంటున్నారు. నాకూ ఆందోళనగానే ఉంది - ఈ అన్యాయాల్నీ, అక్రమాల్నీ, పక్షపాతాల్నీ సహించలేక ఎదుటి పార్టీవాళ్ళు ఏం అఘాయిత్యం చేస్తారోనని. నేను చెప్పి చూస్తాను. ఆయనగారిలో మార్పువొచ్చేట్టు ప్రయత్నిస్తాను" అన్నది శశిరేఖ మనస్సులోని ఆదుర్దాని ముఖంపై స్పష్టంగా కనబరుస్తూ.

నిజంగా వదినె అన్నయ్యలో తను ఆశించిన మార్పును తీసికొని రాగలిగితే - ఆమెను దేవతగా తను పూజించవచ్చు అనుకున్నాడు కుమారస్వామి.

★

58

## ౬

దుర్వ్యసనాలు మానవుని పతనానికి జారుడు మెట్లు లాంటివి. అందులో జూదం ముఖ్యం. దేశంలో పేకాట పిశాచానికి ఎన్ని కుటుంబాలు చితికిపోతున్నాయో! కాని అది మానని గాయంలాంటి వ్యసనం. ఆ వ్యసనంలో మరీచికలాంటి సుఖం ఉంది; ద్వేషం ఉంది; దుఃఖం ఉంది; మోసం ఉంది; కార్పణ్యం ఉంది; కలహం ఉంది; అధఃపతనం ఉంది. పేకాట వ్యసనపీడితునికి దేశంతో పనిలేదు; కాలంతో నిమిత్తం లేదు; ప్రగతిని గురించి ఆలోచన లేదు; ప్రజాస్వామ్యంపై అభిలాష లేదు; సాంఘిక విలువలూ, నియమాలూ, మర్యాదలూ - వీటిని గురించి లక్ష్యంలేదు. పేకాటే ధ్యేయం. పేకాటే ప్రాణం. పేకాటే స్వర్గం. పేకాటే నరకం. పేకాటే కాలం. పేకాటే జీవితం. అట్లాంటి వ్యక్తులు దేశానికి ద్రోహులు. సంఘానికి చీడపురుగులు. పేకాటవల్ల బాగుపడిందెవ్వరు? వ్రేళ్ళమీద లెక్కించవచ్చునా? చెడిపోయిందీ, చితికిపోయిందీ, నాశనమైందీ - తమపై ఆధారపడ్డ జీవుల్ని పాతాళానికి క్రుంగదీసిందీ, భార్యా పిల్లలకు భవిష్యత్తు లేకుండా నిత్యదారిద్ర్యానికి గురిచేసిందీ లక్షలపై లెక్కించవచ్చును గదా! ఈనాడు ఈ పేకాట పిశాచం పల్లెటూళ్ళను విరివిగా ఆవహించింది. ఆ వ్యామోహంలోపడి దీపం పురుగులకుమల్లే మాడిమసి అవుతున్నారు దేశాభ్యుదయానికి దీక్షగా కృషి సల్పవల్సిన యువకులు. పేకాట మోజులోపడి ప్రొద్దస్తమానం పొలంలో నడుం ఎత్తకుండా పనిచేసే యువకులు, ఇప్పుడు

రథశాల గోడలకు పట్టిన బూజుకుమల్లే రథశాలనే పట్టుకు వ్రేళ్ళాడుతున్నారు. అందినంతవరకు నోట్లమీదా, ఇళ్ళ తాకట్లమీదా పైకం తెచ్చి పిశాచానికి ధూపం వేస్తున్నారు. అదేమని అడిగిన భార్యల్ని ఛీదరించుకుంటున్నారు; తమ అదృష్టానికి పట్టిన గ్రహణాలని తిడుతున్నారు; తన్నుతున్నారు. వెండి, బంగారు వస్తువుల్ని, డబ్బుతోపాటు పేకాటపాలు చేస్తున్నారు. తాత్కాలిక దుఃఖోపశమనం కొరకు, పేకాటలో పోయిన డబ్బువల్ల కలిగే బాధను మర్చిపోయేందుకు – మరికొన్ని వ్యసనాల్ని అలవాటు చేసికుంటున్నారు : వ్యభిచారం, త్రాగుడు, మోసం, దగా, దొంగతనం, దౌర్జన్యం. కొంతమంది యువకులు ఈ దుస్థితిలోకి దిగజారటం గ్రామీణ వ్యవస్థకు, సంఘజీవనానికి, దేశాభివృద్ధికి గొడ్డలిపెట్టు. ఈ ఊళ్లో జరిగే దొంగతనాలకూ, వ్యభిచారాలకూ, దౌర్జన్యాలకూ, త్రాగి తందనాలాడటాలకూ, టక్కరితనాలకూ, బలాత్కారాలకూ, కొన్ని కుటుంబాల్లోని భీభత్సాలకూ – రథశాలలో నిరంతరం పేకాట ఆడే ముఠాకూ సంబంధాలున్నాయి. గ్రామనాయకులు, పెద్దమనుష్యులు, బాధ్యతగల వ్యక్తులు ఏమీ పట్టించుకోవటం లేదు. గారడీవానికి పాము కరిస్తే వింతగా చూసినట్టు చూస్తున్నారు. ఈ దుర్వ్యవస్థ ఇకపై కొనసాగటానికి వీల్లేదు. తగినచర్యలు తీసికొనబడాలి. ఆర్థికంగా, నైతికంగా, సాంఘికంగా దిగజారుతోన్న వ్యక్తులకు తెలుపుడుచేయాలి. వాళ్ళ దుర్మార్గాన్ని అంతమొందించాలి. అందుకోసం తను పాటుపడాలి – అనుకున్నాడు

కుమారస్వామి ఆరోజు సంజెప్రొద్దు వాహ్యాళికి బయలు దేరుతూ,

రథశాలవీధిలో నడుస్తూన్నవాడల్లా తక్కున ఆగి, వెనక్కుతిరిగి-నేరుగా పోలీసు స్టేషనుకు వెళ్ళాడు కుమార స్వామి. అతనిముఖం ఆవేశంతో జేవురించింది. కళ్ళల్లో అసహ్యాన్ని భరించలేని ఆవేగం ద్యోతకమాతూన్నది. నడకలో దుష్టకార్యాన్ని అరికట్టే తాపత్రయం ప్రకటింపబడుతోంది.

శాంతిభద్రతలకు సూచనగా పోలీసుస్టేషను ప్రశాంతంగా ఉంది. ఇరువురు కానిస్టేబుల్సు వరండాలో నిశ్శబ్దంగా 'పులీ - మేక' ఆట ఆడుకుంటున్నారు గులకరాళ్లతో. హెడ్ కానిస్టేబులు గోడకు తాపీగా చేరగిలబడి, వారపత్రికలోని సినిమాబొమ్మలు ఆసక్తిగా చూస్తున్నాడు. లోపలగదిలో సబ్ ఇనస్పెక్టరు బూట్లకాళ్లను డ్రాయరుమీద పెట్టి, కుర్చీలో ఏటవాలుగా పడుకొని కోడినిద్ర పోతున్నాడు. పైన సీలింగు ఫ్యాను విద్యుక్తధర్మంప్రకారం తిరుగుతూన్నది.

సాయంత్రపునీడలు వడిగా జరిగిపోతున్నాయి.

కుమారస్వామి తిన్నగా పోలీసుస్టేషనులోకి వచ్చి, "సబ్ ఇనస్పెక్టరుగారూ!" అన్నాడు.

అతనిరాకను పులిజూదంలోఉన్న ఇరువురు కానిస్టేబుల్సు గానీ, వారపత్రిక సినిమాబొమ్మల్లో ముఖమూ, మనసూ దూర్చిన హెడ్ కానిస్టేబులుగానీ గమనించలేదు.

తన పిలుపుకు సబ్ ఇనస్పెక్టరు కనుబొమలుకూడా కదలకపోయేప్పటికి, కుమారస్వామి కటువుగా పిల్చాడు మళ్లీ అరచేతితో డ్రాయరుమీద చప్పుడుచేస్తూ.

ఆరడుగుల పొడవూ, రెండువందల ఇరవై రెండుపౌన్ల బరువూగల సబ్ ఇనస్పెక్టరు నాయుడు నిద్రలో తేలుకుట్టినట్టు ఉలిక్కిపడి లేచాడు.

"ఆఁ! ... ఆఁ! ఏమిటి? ఏంజరిగింది?" అన్నాడు డ్రాయరుమీది బూటుకాళ్లను క్రిందికి దించుతూ, టోపీని ఆదుర్దాగా పెట్టుకుంటూ.

"కొంపలు కూలిపోతున్నాయి. సంసారాలు రాలిపోతున్నాయి. భార్యలూ, పిల్లలూ గగ్గోలుపెడుతున్నారు."

"ఎక్కడ? ఎక్కడ? ఏయ్! హెడ్డూ!..."

కుర్చీలోంచి లేచి సబ్ ఇనస్పెక్టరు బెల్టు సర్దుకున్నాడు.

వారపత్రికలో క్రిస్టియన్ కీలర్ నగ్న చిత్రం చూస్తూ తన్మయత్వం జెందుతూన్న హెడ్డు, ఇనస్పెక్టరు గర్జన విని విసుగ్గా లేచి వొచ్చాడు.

కానిస్టేబుల్సు పులిజూదం మాని, గులకరాళ్ళు గోడవతల విసరి, టోపీలు సవరించుకుంటూ లోపలికొచ్చారు.

"ఏం జరిగింది సార్!" అన్నాడు హెడ్డు కానిస్టేబుల్ వారపత్రికను మడిచి నిక్కరు జేబులో దోపుకుంటూ.

ఇనస్పెక్టరు నాయుడు కుమారస్వామికేసి చూశాడు. హెడ్డూ, కానిస్టేబుల్సూ కూడా అతనికేసే చూసారు.

"ఊళ్లో పేకాట పిశాచం స్వైరవిహారం చేస్తూన్నది. కొంతమంది యువకులు ఆ దుర్వ్యసనానికిలోనై, వ్యవసాయపు పనులు మాని, డబ్బు తగలేస్తూ - కొంపల్ని కూల్చుకుంటున్నారు. సంసారాలు చితికిపోతున్నాయి. రథశాలలో రేయింబవళ్ళూ పేకాట సాగుతూన్నది. ఇంత కాలం నుంచీ మీరేం చేస్తున్నట్టు? కొందరి వ్యక్తుల్లో ప్రారంభమైన ఈ దురభ్యాసం ఎంత మందికి అలవడింది? గ్రామ శ్రేయస్సుకు ఎంత దెబ్బ? జూదాన్ని అరికట్టడం మీ డ్యూటీ కాదా!" అన్నాడు కుమారస్వామి పిడికిలి బిగించి.

సబ్ ఇనస్పెక్టరు నాయుడు మధ్యాహ్నం తిన్న చేపల కూర గొంతులోకి వొచ్చేట్టు పెద్ద పెట్టున నవ్వాడు.

హెడ్డూ, కానిస్టేబుల్సుకూడా తుస్కారంగా నవ్వారు.

వాళ్ళ నవ్వుకు కుమారస్వామి ఆశ్చర్యపోయాడు; ఆవేశపూరితుడైనాడు.

"అయితే మీరు చర్యతీసికునేదేమీలేదా?"

"తీసికుంటాం. కాని ఏం లాభం? రథశాలలో పేకాట ముఠా అంతా మీ అన్నయ్య పార్టీ మనుష్యులేగా! మేము పట్టుకొని లాకప్‌లో పెట్టినా, మీ అన్నగారు విడిపిస్తారు. ఆయనకు ఎమ్. ఎల్. ఏ. గారి మద్దతున్నది. మా శ్రమ నిష్ప్రయోజనం గదా!" అన్నాడు ఇనస్పెక్టర్ నాయుడు హ్యాట్ తీసి డ్రాయరుమీద పెడుతూ, కుర్చీలో కూర్చుంటూ.

"అల్లాగని మీరు చేతులు ముడుచుకొని కూర్చుంటారా! ఊళ్ళో రోజూ జరుగుతూన్న పబ్లిక్ న్యూసెన్సును

ఓర్చుకుంటారా! వాళ్ళను పట్టుకోవటం మీకు చేతకాకపోతే సమర్థతలేకపోతే - ఉద్యోగానికి రాజీనామా ఇవ్వండి. ఆత్మ వంచనతో ఉద్యోగ ధర్మానికి ద్రోహంచేయడం దేనికి? ఉత్రుడియంగా గవర్నమెంటు సొమ్ము తినటం దేనికి? ఊళ్ళో లా అండ్ ఆర్డరును అమల్లో పెట్టలేకపోతే పోలీసు స్టేషను వుండి ప్రయోజన మేమిటి? సుఖంగా నిద్రలుపోవటానికా! తీరిగ్గా పులిజూదం ఆడుకోవటానికా! మీరు వెంటనే తగు చర్యలు తీసికొని, ఊళ్లో పేకాట పిశాచాన్ని రూపు మాపకపోతే - పై అధికారులకు రిపోర్టు చేస్తాను" అన్నాడు కుమారస్వామి కఠినంగా.

సబ్ ఇనస్పెక్టరు నాయుడుకు రోషం పడదోసుకొచ్చింది. క్రోధావేశపరుడై, కుర్చీలోంచి గబుక్కున లేచి హేట్ పెట్టుకొని లాఠీ తీసికొని - "ఏయ్! హెడ్డూ పద!" బయలు దేరాడు.

హెడ్, ఇరువురు కానిస్టేబుల్సూ ఇనస్పెక్టరును అనుసరించారు.

బజార్లో అరుగుల మీద కూర్చున్న వాళ్ళంతా ఇనస్పెక్టరు దూకుడు చూసి - ఎక్కడ దొంగతనం జరిగిందో, దొంగ ఆచూకీ దొరికిందేమో అనుకున్నారు.

సబ్ ఇనస్పెక్టరునాయుడు పోలీసుల సహాయంతో ఆ సాయంకాలం రథశాలను ముట్టడివేశాడు. పాయింటుకు అణా చొప్పున ఇంటర్ నేషనల్ రమ్మీ ఆడుతున్న పదిమంది యువకులు చిక్కారు. కొంతమంది పారిపోవడానికి ప్రయ

త్నించారుగానీ వీలుపడలేదు. పైఎత్తున ఆటజూస్తున్న ముగ్గురు మనుష్యులు మాట్టుకు తప్పించుకున్నారు. ఆటగాళ్ళు మాత్రం బీరుపోకుండా పట్టుపడ్డారు. నాయుడు వాళ్ల దగ్గరున్న పైకం మొత్తం ఏడువందల ఎనభై రూపాయల డెబ్బైరెండు నయాపైసలు తీసుకున్నాడు. హెడ్ కానిస్టేబులు మూడు పేకల్ని ప్రోగుజేసి భద్రపరిచాడు.

"నడవండి పోలీసుస్టేషనుకు" అన్నాడు సబ్ ఇనస్పెక్టరు నాయుడు లాఠీని రాతికేసి కొడుతూ.

ఆ పదిమందీ జీవచ్ఛవాలవలె పోలీసులమధ్య పెద్ద బజారులో స్టేషనుకు నడిచారు.

—ఆ సంఘటన ఊళ్లో చాలమందిని ఆశ్చర్యచకితుల్ని చేసింది. వాళ్లంతా పంచాయితీబోర్డు ప్రెసిడెంటు సుదర్శనం పార్టీకి చెందినవాళ్లే. సుదర్శనానికీ, సబ్ ఇనస్పెక్టరునాయుడుకీ మంచి జోస్తీఉంది. అందుచేతనే రథశాలలో ఇంతకాలంనుంచీ జూదం నిరాటంకంగా సాగుతూన్నది. ఇవాళ హఠాత్తుగా పోలీసులతో సహా వచ్చి పట్టుకోవటమేమిటి?

కృష్ణస్వామి కిళ్ళీదుకాణంవద్ద బసవనాగయ్యా, ఆయన మనుష్యులూ ఆ దృశ్యం చూసి సంతృప్తికరంగా నవ్వుకున్నారు. "పాపం పండకపోతుందా?"

"మొత్తానికి తగినశాస్తే."

"ఈ ఊళ్ళో మనం ఏంచేస్తే, ఎవ్వ రడ్డుపడతారు— అన్న తిమురుకాస్తా అణిగింది!"

"అక్రమ వర్తనులకి ఎప్పుడైనా ఇదేగతిపడుతుంది."— మొదలైన వ్యాఖ్యానాల్ని పదునైన బాణాల్లాగ విసిరారు బసవనాగయ్యా, ఆయనముఠా మనుష్యులూ.

పోలీసు స్టేషనుకు నడుస్తూన్న ప్రొఫెషనల్ కార్డు ప్లేయర్సు ఆ వ్యాఖ్యానాన్ని విన్నారు. పళ్ళు పటపటకొరికారు. అయినా అవమాన భారంతో తలలు దించుకునే నడిచారు.

సుదర్శనం పార్టీ మనుష్యుల్ని రథశాలలో పేకాట ఆడుతూంటే పోలీసులు పట్టుకొని స్టేషనుకు తీసికెళ్ళారన్న వార్త నిముషాల మీద ఊరంతా ప్రాకింది. బసవనాగయ్య ముఠావాళ్ళు సంతోషించారు. కసిదీర నవ్వుకున్నారు. సుదర్శనం పార్టీవాళ్ళు ముఖాలు మాడ్చుకున్నారు. సబ్ ఇనస్పెక్టరు నాయుడు ఎట్లా పట్టుకున్నాడు? అని ప్రశ్నించుకున్నారు.

అరటి తోటకు నీటి తడి కడుతూంటే చూడబోయిన ప్రెసిడెంటు సుదర్శనానికి కనుచీకటి పడే సమయానికి ఆ విషయం తెల్సింది. తన కొడుకు కూడా ఆ జూదగాళ్ళల్లో చిక్కుకొని పోలీసు స్టేషనుకు తీసికొని పోబడటంతో, పంచాయితీ బోర్డు మెంబరు కొమరయ్య పరుగెత్తుకుంటూ పొలం వెళ్ళాడు ప్రెసిడెంటు సుదర్శనం కోసం.

"మనవాళ్ళ కిది ఎంతో అవమానం. బసవనాగయ్య ముఠావాళ్ళు సంతోషపడుతూ, ఇష్టమొచ్చినట్టు వ్యాఖ్యానాల్ని విసురుతున్నారు. మనవాళ్ళు వినలేకుండా వున్నారు. నా అనుమానం - ఆ బసవనాగయ్యే ఈ పని చేయించాడని. నా అనుమానమే నిజమైతే, ఊళ్లో మనపలుకుబడి వెనుకచూపు

చూసిందన్నమాటే! ఆనాయుడికీ,నీకూ బాగా జోస్తీవుందిగా. ఎందుకు దాడి జరిపినట్టు! నీకు ముందుగా చెప్పనక్కర్లేదూ!" అన్నాడు కొమరయ్య పైపంచతో ముఖానికి పట్టిన చెమటను తుడుచుకుంటూ.

కొన్ని క్షణాల పాటు నిస్తబ్ధుడై నిలబడి పోయాడు సుదర్శనం.

నీళ్ళ ఇంజను మోతబెడుతూ మోటబావిలోంచి నీరు తోడుతూన్నది. కాలువలుగుండా నీళ్ళు అరటిపాదుల్లోకి జారుతున్నాయి. పెద్దపాలేరు కోటినాగులు పార చేత్తోపట్టు కొని పాదులు సరిజేస్తున్నాడు. ఒకపాదు నిండగానే మరో పాదుకు నీళ్లను మలుపుతున్నాడు.

కనుచీకటి ముదురు చీకటిలో కల్సిపోతూన్నది.

ఏం మాట్లాడకుండా సుదర్శనం ఊళ్ళోకి బయలు దేరాడు. కొమరయ్య ప్రెసిడెంటును అనుసరించాడు.

సుదర్శనం ఊళ్ళోకి రాగానే పార్టీ వ్యక్తులంతా అతని చుట్టూ చేరారు.

"మనవాళ్లను వెంటనే విడుదల చేయించాల్సిందే!"

"ఏదో కాలక్షేపానికి రథశాలలో పదిమంది పేకాట ఆడుకుంటూవుంటే, ఇనస్పెక్టరు పట్టుకెళతాడా? ఎన్ని గుండెలు? ఇంతకాలంనుంచీ ఆడుకోవటంలేదా! మాట మాత్రం ముందుగా కబురు చేయకూడదా?"

"ఈ సంఘటన మన అధికారానికీ, పరువుప్రతిష్టలకూ పలుకుబడికీ గొడ్డలిపెట్టు. వాళ్ళను సత్వరం విడిపించకపోతే - బసవనాగయ్యా ముఠావాళ్లు రేపటినుంచీ కాలుల్లాపొడుస్తారు."

"ఎం. ఎల్. ఏ. గారికి కబురుచేస్తైనా-వాళ్ళను వెంటనే వొదిలి పెట్టించాల్సిందే. తెల్లారితే ఈ అప్రతిష్ట ప్రక్కఊళ్ళకు కూడా ప్రాకుతుంది."

"ఏమీ అవసరంలేదు" అంటూ పంచాయితీబోర్డు ప్రెసిడెంటు సుదర్శనం ఒక్కడే పోలీసుస్టేషనుకు వెళ్ళాడు.

సబ్ఇనస్పెక్టరు నాయుడుతో ఓ పావు గంటసేపు రహస్య సంభాషణలు జరిపాడు సుదర్శనం. ఆ తర్వాత నాయుడు ఆజ్ఞమీదట హెడ్ కానిస్టేబులు లాకప్‌లో ఉన్న వారిని ఒక్కసారి విడుదల చేశాడు.

సుదర్శనం చిరునవ్వు నవ్వుకుంటూ ఇంటికి వొచ్చాడు. అతని ముఠావాళ్లు మెడలో పూలదండ వేసినంత పనిజేశారు.

ఆ రాత్రి కుమారస్వామికి తెలియలేదు తను దుర్వ్యసనాల పాలవుతూన్న యువకుల్ని సక్రమమార్గంలో పెట్టేందుకు సబ్ఇనస్పెక్టరుతో పోట్లాడి రథశాలలో పట్టించి, లాకప్‌లో పెట్టిస్తే - అన్నయ్యా తన పలుకుబడిని వినియోగించి విడిపించుకొచ్చాడని.

మరునాడు ఉదయం ఎనిమిది గంటలకు లైబ్రరీకేసి వెళుతుంటే - గత సాయంకాలం రథశాలలో పేకాట ఆడుతూ పట్టుబడి, పోలీసు స్టేషనుకు ఎక్కిన ఇద్దరు యువకులు

కాఫీ హోటలు ముందు సిగిరెట్లు కాలుస్తో కనబడ్డారు. కుమార స్వామి అత్యాశ్చర్యపడ్డాడు. అప్పటికే ఊళ్ళో గాలి గట్టి పడింది - తమ్ముడు లాకప్‌లో పెట్టిస్తే, అన్నయ్య విడిపించు కొచ్చాడని. లైబ్రరీలో కుమారస్వామికి ఆ విషయం తెలియ రాగా, కోపోద్రేకం తాటి ప్రమాణాన ఎత్తు లేవగా, గబ గబా ఇంటికి వచ్చాడు.

గదిలో సుదర్శనం ఎగ్జిక్యూటివ్ ఆఫీసరుతో ఏవో మాట్లాడుతున్నాడు ఆఫీసు విషయాలు.

"అన్నయ్యా! నీ వ్యవహారం మరీ అడ్డసుడిగా వుంది" అన్నాడు కుమారస్వామి వచ్చిరావటంతో, నిలబడే.

ఏమాత్రం దిగ్భ్రమను ముఖంలో కనబర్చకుండా, "మీరు వెళ్ళిరండి. భోజనంచేసి నేను ఆఫీసుకు వస్తాను" అన్నాడు సుందర్శనం ఎగ్జిక్యూటివ్ ఆఫీసరుతో.

ఎగ్జిక్యూటివ్ ఆఫీసరు ఫైలు చంకలో బెట్టుకొని బయ టకు వెళ్లాడు.

'ఏమిట్రా ?' అన్నట్టు తమ్ముడికేసి చూశాడు సుద ర్శనం సిగిరెట్టు వెలిగిస్తూ.

"నువ్వింత అభివృద్ధి నిరోధకుడవని, సంఘద్వేషివని నే నెప్పుడూ ఊహించలేదు. గ్రామపంచాయితీకి అధ్యక్షుడి వైనా - గ్రామంయొక్క - శ్రేయస్సుమీదా, ఆర్థిక వ్యవస్థ పట్లా, న్యాయరంక్షణను గురించీ నీకు శ్రద్ధలేదు. గ్రామీణ సౌభాగ్యానికి గ్రహణంపట్టి క్షీణించిపోతున్నా నీకు లక్ష్యం

లేదు. అవినీతి, అన్యాయం, అక్రమం, మోసం, జూదం, వ్యభిచారం, కక్షలూ, కార్పణ్యాలూ, అపనమ్మకం మొదలైన వాటితో మనగ్రామం ఎంత అస్వస్థతలో వుందో, వాటికి కారకు లెవ్వరో, కీలకం ఎక్కడున్నదో - ఎప్పుడైనా ఆలోచించావా? ఆత్మవిమర్శ చేసుకున్నావా? లేదు. గ్రామంలో ఒకటికి పదికుటుంబాలు దుర్వ్యసనాలవల్ల, కక్షలవల్ల వైషమ్యాలవల్ల పతనమౌతున్నాయంటే - ఆ ప్రభావం గ్రామం మొత్తం పైనవుంటుందిగదా! గ్రామీణ ఆర్థిక దుస్థితికి దారితీస్తాయిగదా! గ్రామ సౌభాగ్యానికి, ప్రజల్లో సామరస్యానికి, పటిష్ఠమైన ఆర్థిక వ్యవస్థకు, నిర్మాణాత్మకమైన అభివృద్ధికీ, సాంఘిక సంక్షేమానికి ఎందుకు కృషి చేయవు? పైపెచ్చు దుర్వ్యసనాలు గలవాళ్ళకు, దుర్మోలాగపరులకు, జూదగాళ్ళకు మద్దతుగావచ్చి, వాళ్ళను లాకప్‌లోనుంచి విడిపిస్తావా? ఇది సంఘద్రోహకరమైన పనిగాదా! అక్రమాన్ని ప్రోత్సహించుటగాదా! తప్పు చేసినవాళ్ళను సరైన పద్ధతిలో పెట్టాలిగానీ - వాళ్ళ తప్పులకు రక్షణ కల్పిస్తావా? చేయూతనిస్తావా? రాత్రి వాళ్ళను ఎందుకు విడుదల చేయించావు?"
కుమారస్వామి నిలబడే అక్కస్సును వెళ్ళగక్కాడు.

"ఊళ్ళో రాజకీయాలలో జోక్యం కల్పించుకోవద్దని నీకెన్నోసార్లు చెప్పాను. నువ్వు ఆదర్శాల్ని రంగుటద్దాల్లో చూస్తూ ఆవేశపడుతున్నావు. ఆచరణనుగూర్చి ఆలోచించటం లేదు. రాజకీయాల్లో 'అధికారం' యొక్క పాత్రను గుర్తించి, ప్రవర్తించేవాళ్ళు-ఒక్కొక్కప్పుడు అన్యాయాన్ని న్యాయంగా భావించాలి; అక్రమాలను ఓర్చుకొని, మద్దత్తుఇవ్వాలి; తన

వాళ్ళు తప్పుచేసినా చిక్కుల్లో పడకుండా కాపాడాలి. మరి వ్యక్తియొక్క పలుకుబడికిగల ప్రయోజనమేమిటి? దేశకాల పాత్రోచితంగా మంచిచెడ్డలు; న్యాయాన్యాయాలు; నీతి అవినీతులు మారుతూవుంటాయి. ఆమార్పునీడను ప్రయాణించడం ఈ రోజుల్లో వివేకవంతుల లక్షణం. ఆ మార్పును గమనించక ఎదురుతిరిగినందువల్ల ప్రయాణంసాగదు. మనిషి గొంగళి సామెతకే కట్టుబడి వుండాల్సివస్తుంది. జీవితంలో అనేక ఇబ్బందులకు గురికావాల్సివస్తుంది. ఈ ఊరికి నేను పంచాయితీ బోర్డు ప్రెసిడెంటుగా వొచ్చానంటే - నన్ను ఏకగ్రీవంగా మెంబర్లు అందరూ ఎన్నుకోలేదు. ఒక వర్గపు మెజారిటీతోనే ఎన్నికైనాను. ఆ వర్గానికి ప్రాముఖ్యత నివ్వడం, ఆదరణ చూపడం, చేతనైన సహాయం చేయడం నా ధర్మం. పేకాట ఆడుతూ రథశాలలో పట్టుబడ్డవాళ్ళు ఆవర్గానికి చెందినవాళ్ళు. వాళ్ళని ఆ చిక్కునుంచి విడిపించటం నాకర్తవ్యం. వాళ్ళేదో సరదాగా ఆడుకుంటున్నారు. డబ్బులుకూడా పెట్టి ఆడుతూండవచ్చు. కొన్నాళ్ళుపోతే వాళ్లకే తెల్సివొస్తుంది - పేకాటలోని ప్రమాదం. పేకాడటం చెడ్డపనేకావచ్చు. ఆ దుర్వ్యసనంతో సంసారాల్ని నాశనం చేసినవాళ్ళుకూడా ఉన్నారు. ఆ విషయం నాకు తెలియకకాదు. పేకాట పిశాచాన్ని ద్వేషించేవాళ్ళల్లో నేనూఒకణ్నే. కాని మనవాళ్ళు తాత్కాలిక ఇబ్బందుల్లో యిరుక్కుంటే-ఆ ఇబ్బందుల్నుంచి తొలగించవద్దా! వాళ్లను స్టేషన్నుంచి విడిపించకపోతే మనముఠా ఆధిక్యతేముంది? ఎదుటివారికి చులకనైపోమా! రాజకీయాల్లో ఇల్లాంటి కిటుకులు, పలుకుబడి వినియోగాలు మామూలే.

నీకిట్లాంటివి తెలియవు. తెలియనప్పుడు మెదలకుండా ఘారుకోవడం మంచిది. ఆవేశంతో, ఆగ్రహంతో నన్ను నిందించి ఏంలాభం? ఆదర్శాలకంటె ఆచరణలకు నేను విలువనిస్తాను. కేవలం ఉన్నతాదర్శాల్ని ఏర్పర్చుకొని ప్రయోజనంలేదు. ఆచరణసాధ్యానికి తెచ్చుకోవాలి. ఆచరణలో ఉన్న కష్టనష్టాల్ని గుర్తించి ఎప్పటికప్పుడు సవరణల్ని చేసికొంటూ జీవితానికి స్థాయినీ, సార్థకతనూ సమకూర్చుకోవాలి. నీ ఆదర్శాలు వేరు; నా ఆచరణలు వేరు. రెండింటికీ పొత్తుకుదరాలనే ఆవేశం నీకుండటం సమంజసంకాదు. ఇంకా నువ్వు బాగా ఎదగాలి. అనుభవాన్ని జీర్ణించుకోవాలి. లోకజ్ఞతను పొందాలి. అంతవరకూ ఆగ్రహావేశాలను పరిమితంచేసికుంటూ ఆలోచనల్లో వైవిధ్యం నేర్చుకో. ఇట్లాంటివిషయాల్లో తొందరపడి నోరుజారడం వ్యక్తిత్వానికి మంచిదికాదు." ప్రశాంతంగా అన్నాడు సుదర్శనం.

అన్నదమ్ము లిరువురకూ శశిరేఖ కాఫీ పట్టుకొచ్చి యిచ్చింది.

ఆ కాఫీ త్రాగి సుదర్శనం బజారు కెళ్లాడు సిగరెట్టు కాల్చుకుంటూ.

నిర్మోహమాటంగా తన మనస్సులో ఎర్రబడ్డ భావాల్ని అన్నయ్య ముందు వ్యక్తం చేద్దామనుకున్న కుమారస్వామి అతనికేసి నిశ్చేష్టతగా చూస్తూ నిలబడ్డాడు.

టేబుల్ మీద కప్పు సాసరూ తీస్తూ—

"మళ్లీ అన్నదమ్ముల మధ్య ఏవో అభిప్రాయభేదాలొచ్చినట్టున్నాయ్!" అన్నది శశిరేఖ.

"సిద్ధాంతాల్లో తేడా లున్నప్పుడు అభిప్రాయభేదాలు రాకేం జేస్తాయి! అసలు అన్నయ్యకు ఒకసిద్ధాంతమంటూ లేదు. ఒకఆదర్శమూ లేదు. ఉన్నా ఆయనసిద్ధాంతాలూ,ఆదర్శాలూ-అధికారంకోసమే. ఒక వర్గాన్ని అణచి, మరో వర్గాన్ని పైకి తీసికొనిరావటం. ఆ వర్గానికి నాయకుడుగావుండటం. లేకపోతే చూడు వదినా! రథశాలలో పదిమందిగూడిరోజూ డబ్బులుతో పేకాడుతూ ఊళ్లో ఎంత చెడుగును తెచ్చిపెడుతున్నారో. ఆ రామయ్యగారి వెంకటేశ్వర్లు దిట్టంగా పనిచేసే కుర్రవాడు. రథశాలలో పేకాటకు మరిగి ఆర్నెల్లనుంచీ పొలంకేసే పోవడం లేదు. ఊరంతా అప్పులు. చేతికి అందినట్టు నోట్లు వ్రాసి తెచ్చి జూదంలో పెడుతున్నాడట. ఉన్న రెండెకరాల్లో ఓ యకరం బేరం పెట్టాడట. అది అప్పులకు సరిపోతుందట' ఆ చెంచయ్యగారి నారాయణ సంగతికూడా అంతే. మొన్న పెళ్లాం పెళ్లినాటి గాజులు కిరాణాకొట్టు జానయ్య దగ్గర తాకట్టుపెట్టి అణా వడ్డీతో రెండొందలు తెచ్చి, పేకాటలో తగలబెట్టాడట. ఇట్లాంటి వాళ్లు ఎంతమందో! అసలే రెక్కాడితే గానీ, డొక్కాడే కాపురాలు. ఇట్లాంటి దుర్వ్యసనాలకు అలవాటుపడితే కొంపలు కూలిపోక ఏముంది? యువకుల్లో దినదినాభివృద్ధి చెందుతూన్న ఈ దురభ్యాసాన్ని అరికట్టేందుకు సబ్ ఇనస్పెక్టరుతో పోట్లాడి హఠాత్తుగా దాడి చేయించి, పదిమందిని పట్టించి, లాకప్‌లో పెట్టిస్తే - రాత్రి అన్నయ్య విడిపించుకొచ్చాడట. తన పలుకుబడిని దుర్వినియోగం చేస్తున్నాడనటానికి ఇంతకంటే వేరే నిదర్శనం కావాలా? అదేమంటే - 'నీకు అనుభవం లేదు. ఊళ్ళో రాజకీయాలు

నీకు తెలీవు. మొదలకుండా వుండు. ఆదర్శాలు వేరు, ఆచరణలు వేరు' అంటాడు. అన్నయ్య చేస్తూన్న పనులు సబబుగా ఉన్నాయా? ఆయన పతనాన్ని ఆయనే కొని తెచ్చుకుంటున్నాడు. నా మాటల్ని పెడచెవిని పెడుతున్నాడు. అన్నయ్యలో మార్పు నువ్వయినా తీసుకొస్తావేమోనని ఆశపడుతూంటే ..."

"ఎన్నోమార్లు చెప్పాను ... ఈ పార్టీలూ, రాజకీయాలూ, అన్యాయాలూ, పక్షపాతాలూ ఎందుకు? అధికారంలో వున్నప్పుడు కుడి ఎడమల తేడాతో వ్యవహరిస్తే - ఎప్పటికైనా ప్రమాదమే! దృక్పథాన్ని మార్చుకోవాలి. కాని నా మాట వింటేనా! అయినా ఈ తడవ గట్టిగా చెప్పి చూస్తాను."

శశిరేఖ కప్పులూ, సాసర్లూ తీసికొని వంట గదిలోకి వెళ్ళింది.

కుమారస్వామి మనస్సు బావుండలేదు. అపజయాన్ని పొందిన వాని మనస్సుకు మల్లే అల్లకల్లోలంగా ఉంది. కొంచెం సేపు తనగదికి వెళ్ళి పచార్లు చేసాడు. ఏదో పుస్తకం తెరిచాడు - చదివేందుకు. కాని చదవలేకపోయాడు. సబ్ ఇనస్పెక్టరు నాయుడు అప్పుడే అన్నాడు 'మేము పట్టుకొని మాత్రం ఏం ప్రయోజనం? మీ అన్నయ్య విడుదలచేయిస్తాడుగా! ఆయనకు ఎం. యల్. ఏ. గారి మద్దత్తు ఉంది.' అక్షరాలా అల్లే జరిగింది. అంతా ఒక ఫ్యాక్టరీలో తయారైన సరుకే! స్వప్రయోజనాలను దృష్టిలో పెట్టుకొని-ఆత్మద్రోహం చేసుకుంటూ, తద్వారా దేశానికే ద్రోహం చేస్తున్నారు. తనకి

అపజయమే! తన సిద్ధాంతానికి అపజయం! తన ఆదర్శానికి అపజయం! తన కృషికి అపజయం! సాంఘిక న్యాయానికి అపజయం! చట్టానికి అపజయం! మంచికి అపజయం! చెడుకు విజయం. దుర్వ్యసనానికి విజయం. అక్రమానికి విజయం. అన్యాయానికి విజయం. దుష్టశక్తులకు విజయం. స్వార్థపరులకు విజయం. పేకాట పిశాచానికి విజయం ... చిరునవ్వు నవ్వుకున్నాడు కుమారస్వామి అప్రయత్నంగా.

## ౭

ఆరోజు పగలు పన్నెండు గంటలకు భోజనం చేశాక ప్రెసిడెంటు సుదర్శం యింటికి వెళదామనుకున్నాడు మున్సబు హరినారాయణ. పడకకుర్చీలో పడుకొని కొంచెంసేపు చుట్ట కాల్చాడు. ఇంట్లో శైలారాణి పడకగదిలో పడుకొని శరత్ బాబు నవల చదువుకొంటూన్నది. ఆ మధ్యనుంచీ ఆమెకు నవలలపిచ్చి జోరుగా సాగింది. రోజుకో నవల చొప్పున ఊళ్ళో లైబ్రరీలోని నవలలన్నీ చదువుతూన్నది. శరత్ సాహిత్యం రెండోసారి మొదలెట్టింది చదివేందుకు. ఆమెకు సాంఘిక నవలలమీదే మోజు. డిటెక్టివ్ సాహిత్యమంటే మంట. ఓ నవల చదవటం – పాత్రలను గురించీ, వాతావరణాన్ని గురించీ, పరిస్థితులను గురించీ, ముగింపును గురించీ ఆలోచించటం అభిలాషగా మార్చుకుంది. తండ్రి బస్తీకి వెళ్ళినప్పుడల్లా – క్రొత్తగా వచ్చిన సాంఘిక నవలల్ని తెచ్చిపెట్టమని పోరుకాడేది. డబ్బుకు జంకకుండా

మున్సబు నవలల్ని కొనితెచ్చేవాడు. ఓ గుడ్డల బీరువాని ఖాళీచేసి, అందులో నవలల్నీ, కథల పుస్తకాల్నీ అమర్చింది. ప్రతి పుస్తకంపైనా తన పేరువ్రాసి, నంబరు వేసింది. పుస్తకాల పేర్లనూ, రచయితల పేర్లనూ, వెలనూ స్టాకురిజిష్టరులాంటి ఓ బౌండు పుస్తకంలో ప్రత్యేకంగా వ్రాసింది. ఇంట్లో గ్రంథాలయం ఏర్పాటు చేయాలని ఆమెకోర్కె. పుస్తకాలమీద కూతురుకు గల శ్రద్ధకు మున్సబు మురిసిపోయేవాడు.

శైలారాణి మున్సబుగారి ఏకైక పుత్రిక. ఆయనకు కొడుకులులేరు. చిన్నతనంనుంచీ ఆమెను అతిగారాబంగా పెంచాడు. భార్య చనిపోయిన దగ్గర్నుంచీ ఆమె మున్సబుకు ప్రాణం; జీవితం; సర్వస్వం. ఆమె బ్రతుకు సౌఖ్యంకోసమే, ఆమె జీవితపు వెలుగుకోసమే – ఆయన బ్రతుకు,శ్రమ, సంపాదన, మున్సబుగిరీ. 'ఆమెకు జీవితంలో ఏలోటూ వుండకూడదు. ఆమె బ్రతుకు శాంతి సౌఖ్యాలతో, పరిపూర్ణమైన తృప్తితో, ఆనంద లహరివలె సాగిపోవాలి. అహర్నిశమూ వెలుగునే గానీ, చీకటిని చూడరాదు.' అదే ఆయన జీవిత లక్ష్యం; ఏకైక ఆశయం. అట్లానే ఆమెను పెంచాడు. చదువుకున్నంత వరకు చదువు చెప్పించాడు; ఆమె విలాసాలకు, ఫ్యాషన్లకు, చీరలకు, నగలకు, పుస్తకాలకు, వస్తువులకు 'అదేమిటి ?' అన్న ప్రశ్న లేకుండా డబ్బు యిచ్చాడు. వివాహం విషయంలో కూడా ఆమెకు పూర్తిస్వేచ్ఛను ఇచ్చాడు. కాని తనమటుకు తానూ అక్కడక్కడా సంబంధాలు వెతుకుతూనే ఉన్నాడు. కట్నాన్ని గురించి బాధలేదు. కుర్రవాడు ఇంజనీరింగుగానీ, మెడిసిన్‌గానీ చదివినవాడై వుండాలి. మంచి

ఆస్తిపరుడు కాకపోయినా పర్వాలేదు. అందగాడై వుండాలి. కుటుంబం, సాంప్రదాయం, పరువు ప్రతిష్ఠలు వొంక పెట్టటానికి వీల్లేకుండా వుండాలి. అన్నింటికీ మించి వరుడు సుగుణ సంపన్నుడు కావాలి. అట్లాంటి వనరులన్నీ గల ఓ సంబంధం తటస్థపడగా మున్సబు కూతుర్ని హెచ్చరించాడు.

"అమ్మాయీ! ఈ సంవత్సరం నీకు పెళ్ళిచేయాలనుకుంటున్నాను. చదువుకూడా అయిపోయిందిగా. ఆ ముచ్చట తీర్చుకుంటే – నీ జీవితానికి మంచి పట్టు దొరుకుతుంది. నా బాధ్యత కొంత సడలుతుంది. అదీగాక నీకు పెళ్ళివయస్సు వొచ్చింది. నీ పెళ్లివైభవం చూడాలని ఊళ్లోవాళ్ళంతా తహతహలాడుతున్నారు. అన్నిహంగులూగల ఓ సంబంధం కూడా ఆజీలుగావుంది. పిల్లవాడు ఇంజనీరింగు చదివాడు. అందగాడు, ఆస్తిఉన్నది, బుద్ధిమంతుడు, కుటుంబం చక్కనిది. ఏమంటావు?"

శైలారాణి ముఖం గోడకు సున్నము పులిమినట్లుగా అయింది.

మున్సబు డిల్లపాటు చెందాడు.

శైలారాణి తన ప్రేమగాథను నిర్భయంగా తండ్రికి నివేదించింది. మున్సబు సంతోషపడలేదు. కాని సంతోషపడ్డట్టె నటించాడు. బలవంతాన చిరునవ్వు పెదాలపైకి రప్పించి, ప్రదర్శించాడు. శైలారాణి ప్రమోదానందభరితురాలైంది.

తను కుమారస్వామిని గాఢంగా ప్రేమించినట్టూ, జీవితంలో అతన్ని తప్ప వివాహం చేసికోనట్టూ శైలారాణి దృఢంగా చెప్పిన దగ్గర్నుంచీ - మున్సబు తీవ్రమైన ఆలోచన చేయసాగాడు. కుమారస్వామి సద్వర్తనుడు. అందమైనవాడు. అవినీతి, అన్యాయం, అక్రమం - వీటిని సుతరామూ సహించలేని నైజం గలవాడు. జీవితంలో కొన్ని ఆశయాల్ని నిర్ణయించుకొని, వాటి ప్రకారం జీవిత పథాన్ని నిర్దుష్టంగా చేసికోవాలనే పట్టుదలగలవాడు. కాని ఈ కాలంలో అంత ముక్కుకు సూటిగా పోవాలంటే వీలుపడుతుందా? జీవితంలో ముందుకు పోగలడా! భార్యను సంతోషపెట్టగలడా! సంఘాన్ని గురించి అతగాడి భావాలు వేరు; దృక్పథాలు వేరు; ప్రవర్తన వేరు. తన ఆదర్శాల అడుగుజాడల్లో సంఘం కదలిరావాలంటాడు. తన ఆశయాల ప్రకారం సంఘంలో మార్పు రావాలంటాడు. తను వాంఛించినట్టు మనుష్యుల్లో చైతన్యం రావాలంటాడు. అదెట్లా సాధ్యపడుతుంది? ఊరందరిదీ ఒక దారి; అతగాడి దొక దారి. అట్లాంటి వింత మనస్తత్వం, విపరీత భావాలు, అందుబాటులో లేని ఆశయాలు, మొండి పట్టుదల గల కుమారస్వామితో తన కూతురు సహధర్మచారిణిగా జీవితంలో సంపూర్ణ సౌఖ్యాన్ని పొందగలదా! అతగాడ్ని గూర్చి సాకల్యంగా ఆలోచించుకొనే, అర్థంచేసికొనే-శైలారాణి ప్రేమించిందా! ఆమె ప్రేమిస్తేమటుకు-కుమారస్వామి ప్రేమించవద్దూ! ప్రేమించటం చేతకావద్దూ! ఈనాటి యువకులకూ, అతనికీ ఎక్కడా మనస్తత్వంలో సామ్యంలేదు. శైలారాణిని ప్రేమిస్తున్నవాడైతే ఆమె వ్రాసిన ప్రేమలేఖను అంత

నిర్దయగా, నిస్సిగ్గుగా, ప్రేమరహితంగా తన కెందుకు చూపెడతాడు? హెచ్చరిక చేస్తాడు! కుమారస్వామి శైలా రాణిని ప్రేమించలేదు. తన కూతురే పొరపాటుపడుతున్నది. ఏకపక్ష ప్రేమ ఇది. ఆ సంగతి ఆమెతో ప్రస్తావిస్తే బాధ పడుతుంది. తను ఆమెను కష్టపెట్టినవాడవుతాడు. ప్రేమలో ఇల్లాంటి ఎదురు దెబ్బలు మానసిక అనారోగ్యానికి దారి తీస్తాయి. తను మెలకువగా ప్రవర్తించాలి. కుమారస్వామి ప్రేమించకపోతేయేం, పెళ్ళిచేసికోవచ్చుగా. ఆపైన ప్రేమల్ని అభివృద్ధి చేసికోవచ్చు. పెళ్ళిళ్లు చేసికొనే వాళ్లంతా పెళ్ళికి ముందే ప్రేమించుకుంటున్నారా! వివాహం తర్వాత దాంపత్య జీవితంలో ప్రవేశించక అనురాగాల్నీ, ప్రేమల్నీ, మమతల్నీ పెంచుకొంటూ జీవితాల్ని సౌఖ్యమయం చేసి కోవడం లేదూ! తనే స్వయంగా వెళ్ళి, సుదర్శనంతో కుమారస్వామి పెళ్ళి విషయమై మాట్లాడితే సరిపోతుంది. తనూ ఆయన పార్టీకి చెందిన మనిషే. ఇంతకంటె మంచి సంబంధం కుమారస్వామికి వస్తుందా! తనకి ఒక్కతే కూతురు. పదెకరాల నిక్షేపంలాంటి మాగాణీ, మూడెకరాల బంగార భూమి లాంటి మెట్టా, పాతిక ముప్ఫై వేల వరకూ డబ్బు నిల్వా, కొన్ని స్థలాలూ ఉన్నాయి. శైలారాణి అందాల బొమ్మ. విద్యావంతురాలు. సంస్కారమూ, సభ్యతా గలది. నూరు సవర్ల బంగారం ఉన్నది. ఇంకేం కావాలి? సుదర్శనం ఎగిరి గంతేసి సంబంధానికి ఒప్పుకోడూ!–అట్లాంటి ఆలోచనల్లో ఉండే మున్సబు హరినారాయణ ఆరోజు భోం చేసిన తర్వాత ప్రెసిడెంటు సుదర్శనంగారింటికి వెళ్ళి వద్దా

మనుకున్నాడు. అట్లాగే బయలుదేరాడు. తండ్రి ఎక్కడికి వెళ్లుతున్నాడో, ఏ కార్యార్థమై వెళ్లుతున్నాడో గ్రహించినదై, మనస్సులో ఆనందమయ మరీచికలు సంచరించగా తండ్రిరాక కొరకై ఎదురుచూడ సాగింది.

*  *  *  *

తుడిచిన అద్దంలాగ ఎండ కాస్తోంది.

మున్సబు ప్రెసిడెంటుగారి ఇంటికి వెళ్ళగానే అదునుకు సుదర్శనం ఇంట్లోనే ఉన్నాడు. హరినారాయణను పూజ్యభావంతో ఆహ్వానించి, మర్యాద చేశాడు. కుర్చీలో కూర్చున్న మీదట నిదానంగా చుట్ట వెలిగించాడు మున్సబు.

"వొంట్లో ఖులాసాగా వుంటోందా?" అన్నాడు సుదర్శనం సంభాషణ మొదలు పెడుతూ.

"ఆఁ! ఆరోగ్యాన్ని గురించి నేనెప్పుడూ జాగ్రత్తలు తీసికుంటాను. ముఖ్యంగా ఆహారం విషయంలో నియమం ప్రకారం వేళకు మితంగా భోజనం చేస్తాను. కనిపించిన పదార్థాన్నల్లా తినాలనే ఆకాంక్ష వుండదు. అందుచేత నీ వయస్సులో వున్న చాలమందికంటె నా ఆరోగ్యం మెరుగ్గా వుంటుంది. గర్వంగా చెప్పుకోవడం కాదు."

"అవును. ఈనాటి యువకులు ముప్పై యేళ్లకే వార్ధక్యంలో పడుతున్నారు. ఆరోగ్యం విషయంలో శ్రద్ధ లేదు. రోజుకు పదిమాట్లు కాఫీలు త్రాగటం, నాలుగు పెట్టెలు సిగరెట్లు పీల్చడం, వేళతప్పి నాలుగు మెతుకులు కొరకటం, ఏ అర్ధరాత్రికో నిద్రబోవడం, బారెడు ప్రొద్దెక్కినా నిద్ర

లేవక పోవడం - రానురాను యువకుల్లో జవసత్త్వాలు క్షీణించి పోతున్నాయి. ఆలోచనల్లో చూపిస్తోన్న ఆసక్తి ఆరోగ్యంలో చూపెట్టుట లేదు. అదీగాక ఇప్పటి సరుకులన్నీ అమ్మోనియా, డాల్డా చవుకబారు నూనెల ప్రభావంలో కూడుకున్న వేగా! రకరకాలైన రోగాలు డాక్టర్లకు కూడా ఒక్కొక్కప్పుడు అంతు బట్టడంలేదు. ఒక నిమిషంలో కులాసాగా నవ్వేవాడు, మరో నిముషంలో గుండె ఆగి దేహం చాలిస్తున్నాడు. ఆరోగ్యం విషయంలో వెనకటి వాళ్ళకూ ఇప్పటివాళ్ళకూ పోలికే లేదు.

"బాగా చెప్పావు. అది సరేగానీ, నీతో ఒక వ్యవహారం వుండి వచ్చాను. పండు కాగలదనే ఆశతోనే వచ్చాను."

"చెప్పండి. నా చేతనైన సహాయం చేస్తాను."

"బయట వ్యవహారమేమీకాదు. బంధుత్వపరమైనదే! మీ తమ్ముడు కుమారస్వామిలేడూ! అతగాడ్ని అల్లుడుగా చేసికోవాలని నా కోర్కె. రెండు కుటుంబాలూ ఒకళ్ళకొకళ్ళు బాగా ఎరుకగలవే. మంచిచెడ్డల్ని గురించి ఆలోచించే పని లేదు."

సుదర్శనం ఆశ్చర్యచకితుడైనా, ముఖంలో గంభీరతను ప్రకటించాడు. అతనిముఖంలోని మార్పుల్ని సునిశితంగా గమనిస్తూన్న మున్సబుకు ఏమీ అర్థంకాలేదు. తనా విషయం బయటపెట్టటంతోటే సుదర్శనం సంతోషహృదయుడై 'అంతకంటే కావాల్సిందేముంది?' అంటూ ఆనందబాష్పాలు రాలుస్తాడని ఊహించిన మున్సబు తికమకబడ్డాడు. ఇరువురి మధ్య కొన్ని క్షణాలు నిశ్శబ్దంలో దొర్లాయి.

"నామట్టుకునాకు అంగీకారమే. అసలు వాడికింతకంటె గొప్పసంబంధం రాబోదు. అదృష్టదేవత మిమ్మల్ని పంపించిందనే చెప్పొచ్చు. మాఅమ్మకూడా సులభంగా ఒప్పుకుంటుంది. కాని వాణ్ని అడిగిచూడాలి. ఏమంటాడో! విచిత్రమైన విరుద్ధ ధోరణిలో మనఃప్రవృత్తుల్ని గట్టిపర్చుకుంటున్నాడు. వివాహం, సంసారం, పిల్లలు, యీ బాదరబందీపట్ల విముఖత్వాన్ని చూపెట్టుతున్నట్టు వింటున్నాను."

మున్సబు ఒక్కసారి నిరాశతో క్రుంగిపోయాడు. ఒక నిమిషంవరకూ నోరు కదల్చలేకపోయాడు.

"మాఅమ్మాయి మీతమ్ముణ్ని గాఢంగా ప్రేమించింది. అతన్ని తప్ప జీవితంలో పెళ్ళిచేసుకోనని పట్టుపడుతూంది. ఎట్లాగైనా యీ వ్యవహారంలో నీవు కల్పించుకొని, పెళ్ళి జరిగే ఏర్పాటుచేయాలి." అన్నాడు మున్సబు ప్రతిమాలే ధోరణిలో.

"తప్పకుండా. నా శాయశక్తులా ప్రయత్నిస్తాను. పెళ్ళి జరిగితేనైనా వాడిలో అనుకూలమైన మార్పువొస్తుందేమోనని నా ఆశ. వాడు ఒప్పుకొంటే త్వరగానే పెళ్ళిచేద్దాము." సుదర్శనం సహృదయంతో సానుభూతి కనబర్చాడు.

ఆ సమయంలోనే మంగమ్మ మండిగం దగ్గరకొచ్చి నిలబడింది. "కులాసాయేనా అన్నయ్యా!" అన్నది మున్సబు నుద్దేశించి.

"ఆఁ! ... ఆ మధ్య నువ్వేదో నాలుగు లంఖణాలు చేసావని తెల్సింది. ఇప్పుడు ఆరోగ్యంగా, వొంట్లో ఉసులుగా వుంటూందా?"

"ఆఁ! ఏదో లే...వయస్సుకొద్దీ రోగాలుకూడా ముదురుతూవుంటాయి" అంటూ మంగమ్మ మండిగం చెంత నే.చతికిలబడింది.

"అమ్మా! మున్నబుగారు మనతో వియ్యమందటానికి ఉత్సాహ పడుతున్నారు. వాళ్ళమ్మాయిని మనకుమారస్వామికి యిచ్చి పెళ్ళిచేస్తానంటున్నాడు" అన్నాడు సుదర్శనం.

"నిజంగానా! అంతకంటే కావాల్సిందేముంది! ఏం అన్నయ్యా!" మంగమ్మ నిఖాల్సయిన సంతోషంలో పొంగిపోయింది.

మున్నబుకూడా ఆశా రేఖలు వెలుగును చూచినట్టు ఆనంద హృదయుడైనాడు.

"అవునమ్మాయీ! మా శైలకూడా ఇష్టంగా వుంది. మీతో బంధుత్వాన్ని పెంచుకోవడంకంటే నాకువెక్కువేముంది! ఊళ్ళో మంచి అండదండలుంటాయి. మీదే ఆలస్యం. వొచ్చేమాసంలో మంచిలగ్నాలున్నాయట. సిద్ధాంతిని కనుక్కున్నాను."

"శుభస్యశీఘ్రం. వొచ్చే నెలలోనే పెళ్ళిచేద్దాం ఏంరా అబ్బాయీ!"అన్నది మంగమ్మ పెద్దకొడుకుకేసి చూస్తూ.

"మరి వాడ్ని కనుక్కోవద్దూ."

"కనుక్కుంటే మాత్రం వొద్దంటాడా? కావాలనుకున్నప్పుడు యింత మంచి సంబంధాలొస్తాయా? వాడికీ పెళ్లీడు

వచ్చిందిగా. చదువుకూడా లేదాయె! ఒకింటివాడైతే బాధ్యతలుకూడా తెల్సివొస్తాయి అన్నయ్యా! మంచిరోజుచూసి మళ్ళీ కబురుచేస్తానులే" అన్నది మంగమ్మ భరవాసాతో.

కాని సుదర్శనానికి తమ్ముడ్ని గురించి భయంగానే ఉంది. "పెద్దమనిషికి అంత త్వరపడి మాటయివ్వడం మంచిది కాదు." అనుకున్నాడు.

మంగమ్మ మాటలకు కడుపు నిండినవాడై మున్సబు లేచాడు కుర్చీలోంచి ఇంటికి వెళ్ళేందుకు.

"ఉండన్నయ్యా! కాఫీ త్రాగిపోదువుగాని" అన్నది మంగమ్మ.

"కాదులే అమ్మాయీ! పన్నెండింటికేగా నేను భోజనంచేసింది, నాలుగింటిక్కానీ కాఫీ త్రాగను. తూర్పుపొలం నుంచి పాలేరు వొచ్చేవేళైంది. వాడ్ని మళ్ళీ అరటితోటకు పంపాలి. వెళ్లొస్తాను."

మండిగంచెంతను చతికెలబడ్డ మంగమ్మ లేచి నిలబడింది. సుదర్శం మున్సబును వీధివాకిట వరకూ పంపించి వొచ్చాడు. ఆయన వెళుతూ వెళుతూ మళ్ళీ ఆ విషయాన్నే కదిపాడు. "అబ్బాయి సుదర్శనం! ఈ వ్యవహారంలో నువ్వు ప్రత్యేకశ్రద్ధ తీసికోవాలి. కుమారస్వామికి ఎల్లాగైనా నచ్చజెప్పి పెళ్ళికి ఒప్పించాలి." అట్లాగేనని సుదర్శనం తల ఆడించాడు.

ఇంట్లోకి వొచ్చాక సుదర్శనం భార్యను పిలిచాడు. ఆమెతో కుమారస్వామి పెళ్ళివిషయం చర్చించాడు. మున్సబుగారి అమ్మాయిది తగిన సంబంధమనీ, ఆస్తిబాగా వస్తుందనీ,

పిల్లకూడా పుత్తడిబొమ్మనీ, ఈ సంబంధం కుదిరి పెళ్ళిజరిగితే ఊళ్ళో మంచి అండ ఏర్పడుతుందనీ సుదర్శనం భార్యతో చెప్పాడు.

"ఏమో! నాకు నమ్మకం లేదండీ-కుమారస్వామిపెళ్ళికి ఓ పట్టాన ఒప్పుకుంటాడంటే!" పెదాలు చప్పరించింది శశిరేఖ.

"వాడు ఒప్పుకోడు. వాడిచేత ఒప్పించాలి. నేను చెబితే నా మాటల్ని ఖాతరు చేయడు. వాడికీ నాకూ సిద్ధాంతాల్లో, దృక్పథాల్లో, ఆచరణల్లో బోలెడు తేడాలున్నాయి. అమ్మవల్లకూడా యీ పనికాదు. ఆవిడ మాటల్ని గోగుపుల్లలకంటె హీనంగాత్రోసివేస్తాడు. వాడికి నచ్చచెప్పటానికి, పెళ్ళికి సుముఖుడ్ని చేయటానికి నువ్వే సమర్థురాలివి. నువ్వంటే వాడికి గౌరవం వుంది. పూజ్యభావం వుంది. నీ మాటల్ని వాడు జవదాటడు. ఎట్లాగైనా వాడ్ని పెళ్ళికి ఒప్పించు." అన్నాడు సుదర్శనం భార్యతో.

"సరే, ప్రయత్నిస్తానులెండి" అన్నది శశిరేఖ పూర్తిగా హామీ ఇవ్వకుండా.

ఆ రోజు మధ్యాహ్నం కుమారస్వామి ఇంట్లో లేడు.



# ౧

మబ్బుల చివరల్ని ఎరుపుమయం చేసిన సూర్యుడు, అస్తమించటానికి ఆజేలుగా ఉన్నాడు. వేడి తగ్గిన వాతావరణం రాత్రి చల్లదనానికి నాందీ వాక్యం ఆలాపిస్తూన్నది.

ఇంటికి వచ్చిన కుమారస్వామిలో కోపంకూడా మబ్బుల చివరల ఎరుపుదనంతో జ్వలితమై వుంది. జరుగుతూన్న అన్యాయాన్ని ఎదుర్కోవాలన్న ఆవేశంతో కూడుకున్న ఆదుర్దాతో ఇంట్లోకి వచ్చిన అతనికి వదినె వాకిట్లోనే ఎదురైంది.

"మధ్యాహ్నం కాఫీకి రాలేదే మబ్బాయి?" అన్నది శశిరేఖ.

వినిపించుకోకుండా అన్నయ్య గదిలోకి వెళ్ళాడు కుమారస్వామి వూపుగా. అతని వెంటే గదిలోకి వొచ్చింది శశిరేఖ చేతిలోని పూచికపుల్లల చీపురుకట్టను కిటికీలో పెట్టి.

"అన్నయ్య లేడా!"

"కాఫీ త్రాగి మూడు గంటకే బజారు కెళ్ళారు. బోర్డు ఆఫీసు కేమైనా వెళ్ళారేమో! లేదా, పొలం వెళ్ళారేమో! ఎందుకు?"

"వదినా! అన్నయ్య దుశ్చేష్టలు మరీ మితిమీరి పోతున్నాయి. అధికారమూ, పలుకుబడి, బలగమూ ఉన్నంత మాత్రాన ఇతర్లకు అన్యాయం చేయడానికే వాటిని ఉపయోగించరాదు. అన్నయ్య దుర్మార్గాలవల్ల నా మనస్సుకు శాంతి లేకుండా వుంది."

"ఏం జరిగింది ?"

"పాపం! ఆ పంతులమ్మ వెంకటసుబ్బమ్మను పంచాయితీ సమితి ప్రెసిడెంటుతో చెప్పి, అన్నయ్య ట్రాన్సఫరు చేయించాడట. ఆమె భోరునఏడుస్తూ్తన్నది. ఇంతకంటె ఘోరమైన దేమైనా వుందా! ఆమె జోలి అన్నయ్య కెందుకు? బాగా చదువు చెప్పే పంతులమ్మని ఊళ్ళో అంతా అనుకుంటున్నారుగదా! ఈ ఊళ్లో ఆమెకు స్వంత ఇల్లుకూడా వుంది. హైస్కూల్లో కొడుకు చదువుతున్నాడట. ట్రాన్సఫరు చేసిన ఊళ్లో హైస్కూలు లేదట. కొడుకు చదువు ఏం కావాలని ఆమె ఏడుస్తోంది. అన్యాయానికీ, అక్రమానికీ, అధర్మానికీ జీవితంలో కంకణం కట్టుకున్నట్టు ప్రతి విషయంలోనూ అన్నయ్య కల్పించుకొని - ఎవ్వరికో ఒకరికి చెడు చేయట మెందుకు ?"

ఫక్కున నవ్వాబోయి, చిరునవ్వు నవ్వింది శశిరేఖ. ఆ చిరునవ్వు యొక్క అంతరార్థం అంతుబట్టక కుమారస్వామి వేపకాయ తిన్న ముఖం పెట్టాడు.

"ఇందులో మీ అన్నయ్య దుశ్చేష్టా, దుర్మార్గమూ, చేసిన అన్యాయమూ, అక్రమమూ, అధర్మమూ ఏమున్నాయి? ప్రతి విషయాన్నీ దోషంతో దర్శించకు. ఎవరు ఏం చెబితే అది అక్షరాలా నిజమని నమ్ముతూ అన్నయ్యను ద్వేషించటం నేర్చుకుంటున్నావు. ఇతర్లు చెప్పిన విషయాల్లో నిజమెంత వుందో, అబద్ధపు పాళ్ళు ఎన్నో, ఏ ఉద్దేశ్యంతో అట్లా ప్రచారం చేస్తున్నారో, తెరవెనుక భాగోతమేమిటో నీ బుద్ధి

కుశలతను వినియోగించి ఆలోచిస్తే - మాటిమాటికీ ఇట్లా అన్నయ్యపై దండెత్తిరావు. ఎవరో 'ఇది అన్యాయం' అని నోరు చించుకోగానే, నువ్వు ఆవేశంతో ఆవురావురుమంటూ ఇంటికి వస్తావు. ఆ పంతులమ్మ వెంకటసుబ్బమ్మ ఎట్లాంటిది? ఆమె నైతికస్థాయి ఏమిటి? ఈ ఊరినుంచి ఎందుకు బదిలీ చేయవల్సి వచ్చింది?-ఒక క్షణం నిదానించి ఆలోచించావా? లేదు. ఆ వెంకటసుబ్బమ్మ పబ్లిక్కుగా కాకపోయినా రహస్యంగా బసవనాగయ్య ఉంపుడుకత్తె. ఆ ఇల్లు కొనిపెట్టింది బసవనాగయ్యే. ఆమె అంతఖరీదైనచీరలూ, రకరకాలైననగలుధరిస్తూన్నదంటే, అంత విలాసంగా, రోజుకో ఫ్యాషన్‌తో తిరుగుతూన్నదంటే - కారణం బసవనాగయ్యే! ఊరంతా అట్టుడికి పోయిన ఆమె అవినీతి చరిత్ర నీకు తెలీదంటే నాకు వింతగా వుంది. ఆమె నీతిమాలిన ప్రవర్తన - పాఠశాల కెంత ప్రమాదం? కొంత మంది ఆమెపై ఫిర్యాదు చేస్తే ఊరి పరువు ప్రతిష్టలు గంగ పాలు అవుతున్నాయని ఆగ్రహపడితే మీ అన్నగారు కల్పించుకొని ట్రాన్స్‌ఫరు చేయించారు ఆ అవినీతిని అరికట్టేందుకు. అది అన్యాయమా? అక్రమమా? అధర్మమా? దుర్మార్గమా?" అన్నది శశిరేఖ అంతర్లీనమైన ఆవేశంతో.

"నువ్వు చెప్పేదంతా నిజమేనా!"

"అవును. నీకు ఎవరో చెప్పింది నిజమూ! నేను చెప్పేది అబద్ధమూ! అంతేనా?"

కల్లోలపూరితమైన మనస్సుతో కుమారస్వామి కుర్చీలో కూలబడ్డాడు. కుడిచేతి మునివ్రేళ్ళను నుదురుమీద రాచు

కుంటూ - విఫలమైన ప్రయోగంతో మబ్బువేసినట్టు మసగ్గా ఉన్న మస్తిష్కపు ప్రయోగశాలలోకి చూచేందుకు ప్రయత్నించాడు.

సూర్యాస్తమయం జరగ్గా, మునిమాపు మెల్లగా అడుగుపెట్టింది. గదిలో పలుచటి చీకటి వ్యాపించింది - కుమారస్వామి మనస్సులోకి మల్లే.

శశిరేఖ కాఫీ తెచ్చియిచ్చి, లైటు వేసింది గదిలో.

కుమారస్వామి వేడివేడి కాఫీ త్రాగి, గ్లాసును ఆమెకిచ్చాడు. ఆ గ్లాసును అందుకుంటూ సన్నగా చిరునవ్వు నవ్వింది శశిరేఖ.

"నన్ను చూస్తే నీకు నవ్వుగావుంది వదినా!" అన్నాడు కుమారస్వామి జేబురుమాలతో ముఖానికి పట్టిన స్వేదాన్ని తుడుచుకుంటూ.

"నిన్ను చూస్తేకాదు. నీ వింత మనఃప్రవృత్తినిచూస్తే, ఆలోచనలకు అందని నీ జీవితపంథానిచూస్తే. దోషాలను దర్శించడంలో నీకుగల ఆసక్తినీ, ఆ ఆసక్తికి అనుగుణంగా పెంపుచేసికొంటున్న భావాల్నిచూస్తే నవ్వుకాక ఏమొస్తుంది? నీ వయస్సుకు నీలాగ విపరీత నైజంతో సంఘానికి విభిన్నంగా ప్రవర్తిస్తున్నవాళ్లు అరుదు. లోకం ఎట్లాపోతే నీకెందుకు? ఎవరికి అన్యాయం ఎవరివల్ల జరిగితే నీ కెందుకు? మనుష్యుల్లో అవినీతీ, అధర్మం, స్వార్థం, మోసం, కుళ్ళూ, కక్షలూ పెరిగితే నీ కెందుకు? 'తనకుమాలిన ధర్మం...' అన్న పెద్దల సామెత విన్నావుగదా! లోకం పాడైపోతుంటే నువ్వు బాధపడాల్సిన

పనేముంది? ఆవేదనతో గింజుకోవాల్సిన అగత్యమేముంది? ఆవేశంతో మనస్సును అల్లకల్లోలం చేసికోవాల్సిన అవసరమేముంది? సంఘంలో నువ్వు ఒక వ్యక్తివేగానీ — సంఘం మొత్తం నువ్వుకాదు. నిన్ను నువ్వు శాసించుకోవచ్చు; నీ శ్రేయస్సు నువ్వు చూచుకోవచ్చు; నీ మటుకు నువ్వు నీతిగా, నిజాయితీగా, ధర్మంగా, స్వార్థరహితంగా, సక్రమంగా బ్రతికవచ్చు; నీ గమ్యస్థానాన్ని నువ్వు సుకరం చేసుకోవచ్చు; నీ జీవితగమనానికి ఉపయోగించే ఆదర్శాల్ని, ఆశయాల్ని, దృక్పథాల్ని నువ్వు తయారుచేసికోవచ్చు; సాధ్యమైతే వాటిని నువ్వు ఆచరణలో పెట్టవచ్చు. అంతేగానీ సంఘం నీ వెంట రాదు. నీకు నచ్చినట్టు, నీ ఆదర్శాలకు తగినట్టు, నీ ఆశయాలకు అనుగుణంగా నీ దృక్పథాల నీడలో—లొంగిరాదు. నువ్వు సంఘక్షేమాన్ని కోరవచ్చు, సంఘంలో పెరుగుతూన్న కుళ్ళుకు అలజడి కనబర్చవచ్చు, విప్లవాత్మకమైన మార్పుల కోసం అర్రులు చాచవచ్చు, కాని సంఘాన్నిగూర్చి నీ కాంక్షలతో, అలజడితో, ఆందోళనతో—దానికి నిమిత్తంలేదు. మహాప్రవాహంమధ్యలో గడ్డిపోచ తలఎత్తిపేమటుకు ప్రవాహం ఆగిపోతుందా, గడ్డిపోచ నడుం విరగడంతప్ప. ఈ కాలంలో సంఘక్షేమంకోసం, సంఘంలోని మంచి మార్పులకోసం జీవితాన్ని వెచ్చించే త్యాగమూర్తులకు జరుగుతూన్న పరిశిష్టమదే! ఈ ప్రాథమిక సత్యాల్నికూడా తెల్సికోకుండా నువ్వు లోకంమరమ్మత్తుకు పూనుకున్నావంటే, నీభవిష్యత్తునుగూర్చి నాకు భయంగావుంది కుమారస్వామీ! ఈనాటి సంఘజీవి ప్రధానంగా ఎంచుకొనేది : తన సుఖం, తన కుటుంబపుసుఖం,

తన స్థాయి, తన భద్రత, తన క్షేమం, తన విలువలు. ఆపిమ్మట లోకకల్యాణం, దేశసౌభాగ్యం. అట్లాంటివారికే ఈనాడు గౌరవమర్యాదలు, కీర్తిప్రతిష్ఠలు, అభివృద్ధిమార్గాలు, శాంతి సౌఖ్యాలు. సంఘపు తీరును సినిమా చూస్తోన్న ప్రేక్షకునిలా వీక్షించాలేగానీ— 'అట్లా జరగటానికి వీల్లేదు, ఇట్లాజరగాలి' అంటూ అడ్డుపడితే, కొండను ఢీకొన్నట్టు తల బొప్పి కడుతుంది. తల బొప్పికట్టాక సవరించుకొని లాభమేముంది ? కాబట్టి తల బొప్పికట్టకముందే నువ్వు జీవితపథాన్నిమార్చుకో. సంఘాన్ని విమర్శించడమే జీవితంగా పెట్టుకోక, ఆ సంఘంలో ఎత్తుగా జీవించడం నేర్చుకో. సంఘమే నిన్ను గుర్తిస్తుంది. నీకు నువ్వు మారలేకపోవచ్చు. నీలో మార్పుకు ఒక కొత్త వాతావరణం కావాలి. ఓ నూతనవ్యక్తి నీజీవితప్రాంగణంలో ప్రవేశించాలి. ఆ వ్యక్తివల్లనైతేనేం, ఆ వాతావరణంవల్లనైతేనేం — నీలో తప్పక మార్పురాగలదు. అందుచేత, కుమారస్వామీ నామాటవిని వెంటనే పెళ్ళిచేసికో. సంబంధం కూడా దగ్గరలో, సిద్ధంగావుంది."

హేళనా పూర్వకమైన నిట్టూర్పు విడుస్తూ—

"ఈ ఉపన్యాసమంతా నా పెళ్ళిని గురించి అన్నమాట" అన్నాడు కుమారస్వామి.

"అవును. నువ్వు తప్పకుండా పెళ్లి చేసికోవాల్సిందే. మా అందరి అభిలాషా అదే."

"కావచ్చు. కాని నేను పెళ్లి చేసికోను."

"చాల సులభంగా అంటున్నావు. కాని నీ మొండి పట్టుదలవల్ల ఓ లేతహృదయం ఆక్రోశించవల్సివస్తుంది. నీ మీద పెట్టుకున్న ఆశలు అడిశయాలుకాగా ఎర్రగులాబీలాంటి ఓ కన్నె మనస్సు నలిగి పోవాల్సివస్తుంది. నిన్ను గాఢంగా ప్రేమించి, వివాహం ద్వారా జీవితాన్ని మధురతరం చేసి కుందామని తీయనికలలు కంటూన్న ఓ అందాలరాణి హఠాత్తుగా గుండెఆగి చనిపోవాల్సివస్తుంది. నువ్వు పెళ్లికి తిరస్కరించటం, పాపం ఆ యువతికి అన్యాయం చేయడం కాదూ!"

"నన్ను గాఢంగా ఓ యువతి ప్రేమించిందా? పెళ్ళి చేసికోవటానికి ఆరాటపడుతున్నద ? ఎవరామె?" నిర్లక్ష్యంగా నవ్వుతూ అన్నాడు కుమారస్వామి.

"మున్సబుగారి అమ్మాయి శైలారాణి. మధ్యాహ్నం మున్సబుగారు మన ఇంటికి వొచ్చివెళ్ళారు. మీ అన్నగారితోనూ, అమ్మగారితోనూ ముచ్చటించి వెళ్లారు. తప్పకుండా పెళ్లి జరిపిస్తానని మీ అమ్మగారు వాగ్దానంకూడా చేసింది. ఈ సంబంధంపట్ల మీఅన్నగారుకూడా మాంచి ఇష్టంగాఉన్నారు. నాఅభిప్రాయంకూడానువ్వుశైలారాణినేపెళ్ళిచేసికో. మున్సబుగారికి ఒక్కతేకూతురు. బోలెడంత ఆస్తివుంది. ఊళ్లో సంబంధం. మంచిచెడ్డల్ని గురించి ఆలోచించ నక్కర్లేదు. పైపెచ్చు మున్సబుగారితో బంధుత్వం కుదుర్చుకుంటే ఊళ్లో మంచి అండ ఏర్పడుతుంది. ఆ అమ్మాయికూడా నిన్ను తప్ప జీవితంలో పెళ్లి చేసికోనని భీష్మించుకు కూర్చుందట. మున్సబుగారు మరీమరీ చెప్పి వెళ్లారు త్వరలో పెళ్లి కుదర్చమని. పరిస్థితులు

ఇంత అనుకూలంగా వుంటే-నువ్వు పెళ్లి వొద్దనటానికి వీల్లేదు. నా మాటలపై గౌరవాన్నుంచి పెళ్లికి ఒప్పుకోవాల్సిందే" అన్నది శశిరేఖ తన పట్టుదలని కనబరుస్తోన్న గంభీరతతో.

"నన్ను ఇబ్బందిపెట్టకు వొదినా! పరిస్థితు లెంతకుట్ర పన్నిపైబడ్డా, ఆత్మనిర్దేశించిన మార్గానికి భిన్నంగా నడవను. నన్ను మన్నించి పెళ్ళిచేసికోమని వొత్తిడి పెట్టకు. భార్యా, పిల్లలూ, సంసారమూ, ఒడిదుడుకులూ, నిస్సారమైన అనుభూతులూ-ఈ రకమైన జీవితమంటే నాకు ద్వేషం. "ఇట్లా బ్రతుకు, ఇందులో సుఖశాంతులున్నాయి; జీవితాన్ని సార్థకపర్చే మార్గాలున్నాయి." అని మీరు చెప్పటం నాకుహాస్యాస్పదంగా వుంటుంది. నాబ్రతుకు నేబ్రతగ్గలను. నా జీవితాన్ని గురించి మీరు ఆదుర్దా పడక్కర్లేదు. భ్రమపడక్కర్లేదు. విచారపడక్కర్లేదు. సానుభూతి చూపనక్కర్లేదు. నన్ను గురించి మీరు ఆలోచించటం మానండి."

"అయితే జీవితంలో పెళ్ళే చేసికోవన్నమాట!" కోపోద్రేకంగా అన్నది శశిరేఖ.

"చేసుకోను. పెళ్లే చేసికుంటే - నా పతనానికి నేనే మెట్లు కట్టుకుంటా నన్నమాట."

ఏమీ చేయలేని అశక్తతతో, తన మాటను కూడా మరిది లక్ష్యపెట్టలేదన్న ఆగ్రహావేశంతో - కొన్ని క్షణాల పాటు శశిరేఖ విహ్వలత చెందిన హృదయంతో అతనికేసి సూటిగా, పదునుగా చూసింది.

"ఆఖరిసారిగా చెబుతున్నాను. నువ్వు పెళ్లి చేసికోని తీరాల్సిందే. ఇంట్లో వాళ్లందర్నీ ఎదిరించీ, ఇంట్లో వాళ్ళ మాట వినకుండా — నువ్వు బావుకొనే దేముంది? ముడి పదార్థంగానే మిగిలి పోతావా! నిన్ను ప్రేమించిన అమ్మాయి బ్రతుకును బూడిద చేస్తావా! నీకు నువ్వు ఉపయోగం పడకపోయినప్పటికీ, నీ ఉపయోగాన్ని గుర్తించిన ఇతర్లకు కూడా ఆశాభంగం కలిగించి – జీవితంలో నువ్వు సాధించే దేమిటి? నా మాట విని పెళ్లికి ఒప్పుకో. నీ జీవితం క్రొత్తదారిని తొక్కుతుంది. నీకు మంచి భవిష్యత్తు వుంటుంది."

ఆ మాటలు మొగిలిపువ్వు రేకుల్లా గుచ్చుకున్నాయి కుమారస్వామి హృదయానికి.

"నా ఆదర్శాలూ, నా ఆశయాలూ, నా దృక్పథాలూ, వాటిని ఆచరణలో పెట్టాలనే నా పట్టుదలా, తహతహా మీకు కష్టంగాతోస్తే; నావల్ల మీ పరువుప్రతిష్ఠలకు భంగంకలిగితే, మీ మాటలకు విలువలు జారిపోతే, క్రొత్త ఇబ్బందుల్ని కలిగించే పరిస్థితులు ప్రారంభమైతే, ఈ ఇంట్లోంచి నేను వెళ్లి పోతాను." అన్నాడు కుమారస్వామి రోషంతో జేవురించిన ముఖాన్ని పైకెత్తకుండా.

శశిరేఖ సిలువునా నిర్ఘాన్ను రాలైంది.



# ౯

ఆ ఊరి పంచాయితీ బోర్డుకు స్థిరమైన ఆఫీసు బిల్డింగు లేదు. ఓ డాబాని అద్దెకు తీసికొని అందులో ఆఫీసు పెట్టారు. ఇంత కాలం నుంచీ అందులోనే కాలం జరుగుతోంది. కాని పర్మినెంటుగా ఓ భవనం ఉండాలని మెంబర్లందరికీ, ప్రజలకీ ఉంది. గత సంవత్సరం ముప్పై వేల రూపాయలు స్వంత భవన నిర్మాణానికి కేటాయించబడి, బోర్డులో ఆమోదింపబడినది. కాని అపట్నుంచీ స్థల నిర్ణయం జరగలేదు. దానికోసం మెంబర్లలో రకరకాలైన అభిప్రాయాలు మొలకెత్తి ప్రచారం చేయబడ్డాయి. 'బోర్డు బిల్డింగు ఊరికి మధ్యగా ఉండాలి. అందరికీ అందుబాటులో వుంటే మంచిది.' అన్నారు కొంత మంది. ముఖ్యంగా ప్రతిపక్ష సభ్యులు. 'ఆఫీసు ఊరికి మధ్యనే ఉండాలనే రూలు ఎక్కడా లేదు. ఊరికి పెడగా కూడా వుండొచ్చు. ఎన్ని ఊళ్ళల్లో కొత్తగా కట్టిన ఆఫీసులు ఊరికి చివరా, కొంచెం దూరంగానూ లేవు.' అన్నారు అధికార సభ్యుల్లో ఎక్కువమంది. 'బోర్డు ఆఫీసు ఊరి మధ్యలో ఉండొచ్చు; ఊరి బయట కూడా ఉండొచ్చు. ఎక్కడున్నా అవసరమున్న వాళ్ళు ఎల్లాగూ వెళ్ళక తప్పదు.' అన్నారు తటస్థ వైఖరిని అనుకరించదల్చుకున్న సభ్యులు. ఇక ప్రజల్లో ఉన్న అభిప్రాయాల్ని సేకరించటానికి చూస్తే–'ఊరికి నడి బొడ్డునే ఉండాలి భవనం.' 'ఎందుకని? ఊరి బయటవుంటే ఏం ప్రమాదం?' 'మా బజారులో ఆఫీసు కడితే అన్ని సౌకర్యాలు లభిస్తాయి. మా బజారులో తియ్యటి మంచినీళ్లు దొరుకుతాయి.' 'మా

వీధిలో ఆఫీసు పెడితే – పోస్టాఫీసు దగ్గర.' 'మా గల్లీలోనే ఆఫీసు నిర్మించాలి.' మా గల్లీలో ఇద్దరు బోర్డు మెంబర్లు ఉన్నారు.' పై అభిప్రాయాల్ని వడబోస్తే ముఖ్యంగా గణించ వల్సినవి రెండు అభిప్రాయాలు: ఒకటి ఆఫీసు బిల్డింగు ఊరి మధ్యన కట్టడం. రెండోది ఊరి బయట నిర్మించటం.

ఊరికి మధ్య, నాలుగు రోడ్లు కలిసేచోట, జోగయ్యకు రెండు వేల గజాల ఖాళీస్థల మున్నది. అది పంచాయతీ బోర్డు ఆఫీసు భవనానికి బాగా పనికివస్తుంది. ఆ స్థలం కొని, బిల్డింగు కడితే – ప్రజలందరికీ వసరుగా వుంటుంది. న్యాయమార్గం అవలంబించినట్లుంటుంది. అదీ ప్రతిపక్ష సభ్యుల వాదన. ముఖ్యంగా బసవనాగయ్యది. ఎందుకంటె జోగయ్య ఆయన ముఠాలోని మనిషి. ఊరి మొగదలో సోమయ్యకు మూడు కుంటల మెరక భూమి ఉంది. అందులో వొచ్చే పంట ఏమీ లేదు గానీ, ఆ ప్రక్కవాళ్ళకు బహిర్ భూమిగా ఉపయోగ పడుతున్నది. ఆ స్థలంకొని అక్కడ బోర్డు ఆఫీసు బిల్డింగు ఎందుకు నిర్మించరాదు? – ఆ ప్రదేశం రైల్వే స్టేషనుకూ, బస్సుస్టాండుకూ దగ్గర. అదీ అధికార సభ్యుల వాదన. సోమయ్య ప్రెసిడెంటు సుదర్శనం పార్టీలోని వ్యక్తి. పైగా పంచాయితీ బోర్డు మెంబరు. మాంచి పలుబడీ, వ్యవహార జ్ఞానం, పది మందిని ఆకొట్టుకొనే శక్తి సామర్ధ్యాలుగలవాడు. ప్రెసిడెంటు తట్టు మెంబర్లంతా ఓ రోజు సుదర్శనం దగ్గర కొచ్చి – "ఈ వ్యవహారం ఎన్నాళ్ళు నానుడులో పెడతావు. ఇంత ఊరికి స్వంత పంచాయితీ భవనం లేదంటే ఊళ్ళో అందరికీ నామూషీగా వుంది. ఒక్క ఊళ్ళు కూడా స్వంత

భవనాల్ని ఏర్పరచుకుంటున్నాయి. వొచ్చే మీటింగులో స్థల నిర్ణయం జరగాల్సిందే. ఎజెండాలో పెట్టించు. సోమయ్య స్థలానికి తీర్మానం ప్యాసు చేయిద్దాము." నొక్కి చెప్పారు. "అట్లాగే" అన్నట్టు సుదర్శనం తల ఆడించాడు.

మరునాడు ఊరంతా పొగవలె అల్లుకుపోయింది. ఒచ్చే మీటింగులో సోమయ్య స్థలానికి ఆమోదకరమైన తీర్మానం లభించగలదని.

"ఆ సోమయ్య స్థలానికి బోర్డు మీటింగులో ఎట్లా తీర్మానం నెగ్గుతుందో చూస్తాను. ఈ దెబ్బతో బలాబలాలు ఒడ్డున పడాలి. ఎంత మెజారిటీవుంటే మటుకు ఇంత పచ్చికలా! ఇంత అపసవ్యమా!" అన్నాడు బసవనాగయ్య కిల్లీ బడ్డీ ప్రక్కబల్లమీద కూర్చున్నవాడల్లా దిగ్గున లేచి పైపంచ నిర్లక్ష్యంగా విదిలిస్తూ.

"ఏం చేస్తాం? అధికారం వాళ్లది. అన్యాయం మనది." అన్నాడు జోగయ్య చుట్టపిక్క నుసిరాల్పుతూ.

"అధికారంలో వుండి, ఎన్ని అన్యాయాలు చేసినా చెల్లుబాటు అవుతుంది" అన్నాడు జోగయ్య మేనల్లుడు కారాలు మిరియాలు నూరుతూ.

"పిల్ల ఆటలూ, పాటలూ ఎంతకాలం సాగుతాయో చూస్తానుగా. ఆ సోమయ్య స్థలానికే రిజల్యూషన్‌ను ప్యాస్ చేయించనీ, ప్రెసిడెంటు ఎంతకాలం పరిపాలన సాగిస్తాడో చూస్తాను." అన్నాడు బసవనాగయ్య కరకరలాడే కోపం కళ్లల్లో కొరకొర కదులాడుతూండగా.

"నువ్వు చూసే దేముందయ్యా! సమితి ప్రెసిడెంటు వాళ్ల వాడు. ఈ నియోజక వర్గపు ఎం. ఎల్. ఏ. వాళ్ల గురువు; ఆ ఎం. ఎల్. ఏ. మంత్రిగారి ఆత్మబంధుకోటిలోనివాడు. నువ్వు న్యాయంకోసం దరఖాస్తు పెట్టుకోంటేమాత్రం - ఈ ఇనుప తెరల్ని ఛేదించుకొని నీ దరఖాస్తు ఎంతదూరం ప్రయాణం చేయగలదు! అథవా ప్రయాణంచేసినా-ఫలితం బండిసున్నా కాకే ముంటుంది?" అన్నాడు కిళ్లీబడ్డీ యజమాని పదునైన వ్యంగ్యాత్మక పద్ధతిలో.

"ఇంతకీ సోమయ్యకు మంచిరోజు లొస్తున్నాయన్న మాట. ఆ యానాది వెంకటాం వలలోబడి అప్పుల వూబిలో గొంతుమేరకు దిగబడి వున్నాడు. ఆ పాడు నేలకు గజం ఏ అయిదో, ఆరో ధర తీర్మానంచేస్తే, ఒడ్డునపడి మీసాలకు సంపంగెనూనె రాసుకొని, కొమ్ము విరుచుకుంటూ తిరుగు తాడు." అన్నాడు కాయగూరల కమీషన్ వ్యాపారి కోటి చంద్రం.

"అయిదూ, ఆరూ ఏం ఖర్మ! పది రూపాయలకు ప్యాసుచేస్తారు. కేటాయించిన డబ్బు చాలకపోతే, కట్టుబడికి మళ్ళ రిజల్యూషన్ పెట్టి మరికొన్ని వేలు కేటాయిస్తారు. వాళ్ళ స్వతం పోయేదేముంది? ప్రజల సొమ్మేగా! ప్రభుత్వాన్ని గురించి భయంలేదు" అన్నాడు. జోగయ్య పొగరానిచుట్టను బజారులోకి విసరివేస్తూ.

ఆ సమయంలో లైబ్రరీనుంచి ఇంటికి వెళుతూన్న కుమారస్వామిని జోగయ్య మేనల్లుడు పిల్చాడు. కుమార స్వామి కిళ్ళీదుకాణం దగ్గరకు వచ్చాడు.

"ఏం కుమారస్వామీ! విశేషాలేమిటి? వొచ్చే మీటింగులో బోర్డుబిల్డింగుక్రింద సోమయ్యా స్థలాన్ని తీర్మానం క్రింద తెస్తారటగా."

"సోమయ్యా స్థలాన్నా! ఊరిబయట ఆఫీసుబిల్డింగు దేనికి? ఊళ్లోనే కట్టవచ్చుగా. అందరికీ అందుబాటులో వుంటుంది. ఊళ్లో కాళీస్థలాలుగూడా ఉన్నట్టున్నాయి." అన్నాడు కుమారస్వామి ఆశ్చర్యాన్ని సహజంగా ప్రకటిస్తూ.

"ఉంటేయేం? ఒకపని న్యాయంగా చేశారా పంచాయితీ బోర్డువారు! ఈ పని చేయకపోవడానికి! స్వార్థంకోసమే పరిపాలన అని మరోసారి నిరూపించుకోబోతున్నారు. అధికమైన ధరను నిర్ణయించి స్థలంకొంటే, సోమయ్యా ఆర్థికఇబ్బందులు తొలగిపోవచ్చు. చేసే ప్రతిపనితోటీ ఎవరో ఒకళ్ళు, ఏదో ఒకరకంకా బాగుపడాల్సిందేగా" అన్నాడు బసవనాగయ్యా అక్కస్సును ఎద్దేవధోరణిలో తీర్చుకుంటూ.

"జోగయ్యగారిస్థలం ఊరికి నడిబొడ్డు. అక్కడ ఆఫీసు బిల్డింగు కడితే—పదిమందికీ దగ్గరగావుంటుంది. ఊరికికూడా అందం." అన్నాడు కిళ్ళీకొట్టు యజమాని సలహాయిస్తూన్న ఉద్రేకంతో.

"కుమారస్వామీ! నీ ఆదర్శాలు హిమగిరి శిఖరాల్లాంటివి. కాని రాణింపు చేసికోలేకపోతున్నావు. ఆదర్శాల్లో వేడేగానీ — ఆచరణలలో వాడిలేదు. నీతీ, నిజాయితీలతో, స్వార్థరహితంగా, సర్వమానవ సామరస్య సౌభ్రాతృత్వపక్కీలో విశ్వజనీతను రూపొందించుకుంటూ — సంఘువ్యవస్థలో నవ

చైతన్యం రావాలంటావు. గ్రామీణవ్యవస్థ శాంతియుత విప్లవాత్మక భావాలలో పునర్నిర్మాణం జరగాలంటావు. అందు కోసం జీవితాన్ని అంకితంచేస్తూ కృషిచేయాలంటావు. ఊళ్లో జరుగుతూన్న ఈ అన్యాయాలను, అధర్మాన్నీ, బాధ్యతగల వ్యక్తుల్లో పరిమితంలేని స్వార్ధదృష్టినీ, పాక్షిక ప్రవర్తననూ; అధికారదాహంతో, కీర్తివ్యామోహంతో అవలంబించే అష్ట వక్రములైన చేష్టల్నీ అరికట్టలేవా? మైనారిటీవర్గపు హక్కుల రక్షణకోసం పాటుబడలేవా? స్వలాభంతో అహంకారాన్నీ, అలక్ష్యాన్నీ, అధికారరాన్నీ అభివృద్ధిచేసికుంటూ, ప్రజలకీ, ప్రభుత్వానికీ ద్రోహంచేసే శక్తుల్ని అణచివేసేందుకు ప్రయ త్నించలేవా?" అన్నాడు జోగయ్య మేనల్లుడు ఉడుకురక్తం పురకలెత్తగా.

ముఖంపై అదాటుగా వేడినీళ్ళు చల్లినట్లయింది కుమారస్వామికి.

"వాడుమటుకేంచేస్తాడు! అంతా ఒకచెట్టు సరుకేగా!" అన్నాడు జోగయ్య.

"కాదు. వాళ్ళ అన్నయ్యకూ, కుమారస్వామికీ సామ్య మేమిటి? తాను నమ్ముకున్న ఆశయాల సాధనకై కుమార స్వామి ఎంతటి త్యాగానికైనా తలపడతాడు." అన్నాడు జోగయ్య మేనల్లుడు.

"అయితే సోమయ్య స్థలానికి తీర్మానం కాకుండా ఆపుచేయించమను. అది అన్యాయాన్ని ఎదుర్కొని, ఊరికి మేలుచేయటమేగా!" అన్నాడు కిళ్ళీకొట్టు యజమాని.

"అన్యాయం జరుగుతూంటే ఓర్చుకోలేక ఆవేశ పడతాడు గానీ, కుమారస్వామివల్ల ఏమవుతుంది?" అన్నాడు బసవనాగయ్య.

ఆ మాటలన్నీ కుమారస్వామి అగ్నివంటి గుండెకు ఆజ్యం పోశాయి. ఒక్కక్షణం అక్కడ నిలబడలేకపోయాడు. దెబ్బతిన్న సింహం పరవళ్ళు తొక్కినట్టు, రెపరెపలాడే కోపోద్రేకంతో, ముఖం యింతలావు చేసుకొని గబగబా ఇంటికి వచ్చాడు.

పెంకుటి చావట్లోంచి ఇంట్లోకి వస్తూన్న సుదర్శనాన్ని నిలవేశాడు.

"అంతా గూడుపుఠాణీకట్టి, స్వప్రయోజనాల నిమిత్తం, ఊరిప్రజలకే అసౌకర్యాన్ని కలుగజేయ దల్చుకున్నారన్న మాట."

"ఏమిటది?"

"రేపు బోర్డుమీటింగులో సోమయ్యస్థలానికి తీర్మానం ఆమోదిస్తారటగా?"

"ఆమోదిస్తే! మెజారిటీ ప్రకారం తీర్మానం చేయబడుతుంది."

"మెజారిటీ వుందిగనకే అన్యాయాన్ని ఆలోచించకుండా తలపడుతున్నారు."

"ఇందులో అన్యాయమేముంది?"

"అంతా అన్యాయమే. బోర్డుబిల్డింగు ఊరిమధ్యన వుండాలిగానీ, మీ ఇష్టమొచ్చినచోట, ఒక మెంబరుస్థలములో ఎక్కువడబ్బుపెట్టి కొని-నిర్మించుతారా? మీరు భవనం కట్టదల్చుకుంటే ఊరిమధ్యన ఖాళీస్థలాలు లేవా? వాటిని అమ్మనని ఎవరైనా అన్నారా?"

"ప్రతివిషయంలోనూ నువ్వు జోక్యం కలిగించుకోకు. గ్రామరాజకీయాల్లో వేలుపెట్టే అనుభవం నీకు లేదని ఎన్నోమార్లు చెప్పాను."

"అన్యాయం ఏ విషయంలోవుంటే, అందులో నా జోక్యం తప్పకుండా వుంటుంది."

"ఇట్లాంటి విషయాల్లో న్యాయాన్యాయాలు మెజారిటీ వర్గమే నిర్ణయిస్తుంది. దాని తీర్పే మాకు ప్రధానం. ఆ తీర్మానమే అమలుపర్చబడుతుంది. దానికి తిరుగులేదు."

"అయితే అన్యాయాన్ని మైనారిటీవర్గం అనుభవిస్తూ కూర్చోవాలన్నమాట. అట్లా జరగటానికి వీల్లేదు. ఏమైనా రేపు సోమయ్యస్థలాన్ని పంచాయితీ భవన నిర్మాణానికి తీర్మానించరాదు. ఆ తీర్మానాన్ని మెజారిటీప్రకారం ఆమోదింపజేస్తే, స్వలాభపరుల వ్యామోహానికి దాసోహమన్నట్లే. ప్రజాసేవకే 'పరిపాలన' అన్న బురఖాతో ప్రజల్ని ఖచ్చితంగా వంచిస్తున్నట్లే. ఇట్లాంటి అన్యాయాల్ని ప్రజలు ఎంతకాలం సహిస్తారు?"

"ఒక్క విషయం మర్చిపోయి మాట్లాడుతున్నావు. 'సోమయ్యస్థలంలోనే పంచాయితీభవనం కట్టాలి' అంటూన్న

ప్రజలు ఊళ్ళో సగానికిపైనే ఉన్నారు. అటువంటప్పుడు జోగయ్యస్థలంలో బిల్డింగుకట్టితే మెజారిటీ ప్రజాభిప్రాయాన్ని త్రోసివేసినట్టుకాదూ! అది ప్రజాస్వామిక పద్ధతా?”

“అది అసలైన ప్రజాభిప్రాయం కాదు. మీ మెంబర్లంతా సోమయ్యస్థలానికి ఎక్కువ డబ్బు వెచ్చించి తీర్మానం జరిపిద్దామని, అందువల్ల మీ పార్టీలోని ఓ ముఖ్యమైన వ్యక్తి డబ్బు చేసికుంటాడనీ, మెంబర్లంతా పన్నాగం పన్ని - మీ ముఠాలోని మనుష్యులచేత అట్లా అనిపిస్తున్నారు. ఈ ఊళ్లో మీ ముఠాదే మెజారిటీ. ముఠారాజకీయాలదృష్ట్యా అన్యాయమైనా, అధర్మమైనా - నాయకుడు తల ఆడించమంటే, సహచరులు అల్లా ఆడిస్తారు. మీరు న్యాయంగా భావించి, ఊరి మధ్యనే ఆఫీసువుంటే బావుంటుందనుకొని ఓ స్థలాన్ని నిర్ణయిస్తే, మీమనుష్యులు మటుకు కాదంటారా? సోమయ్యకు దడిచి మీరట్లా చేయటం లేదు. సోమయ్య అసంతృప్తి పడితే రాజకీయాలు కొత్త బాటను నడుస్తాయని మీకు భయం.”

తమ్ముడికేసి సుదర్శనం ఎన్నడూ చూడని తీవ్రదృష్టితో చూశాడు. అన్నయ్య ప్రకోపితుడైనాడని కుమారస్వామి గ్రహించాడు. అయినా అతనిలోనూ కోపావేశాలు అంత కంటె తక్కువ మోతాదులో లేవు.

“బసవనాగయ్య వాళ్లు ‘కీ’ ఎక్కిస్తే, నా దగ్గర నోటి కొచ్చిందల్లా వాగుతున్నావు. కాని రేపు మీటింగులో సోమయ్య స్థలానికి తీర్మానం నెగ్గి తీరుతుంది. నువ్వూగానీ,

వాళ్ళుగానీ ఆ తీర్మానాన్ని ఏమీ చేయలేరు" సుదర్శనం గొంతులో కఠినత్వాన్ని బోలిన కోపం ప్రతిధ్వనించింది.

కుమారస్వామి ఏమీ చేయలేని అశక్తతతో, ఆవేశంతో కొన్ని క్షణాలపాటు తనలో తాను పరిభ్రమించాడు.

"అదే నీ పట్టుదలైతే, అన్యాయానికీ, అధర్మానికీ మనస్సు అలవాటుపడితే - ఈ ఇంట్లో నేనొక్క క్షణం వుండలేను. నీలో జాగ్రుతికోసం ఇంతకాలమూ వేచిఉన్నాను. నీలో జాగృతికలిగితేనేగానీ, ఊళ్ళో కొత్త చైతన్యం రాదు. ఇప్పుడు తెల్సుకున్నాను.నువ్వు పూర్తిగా పార్టీమనిషివి. రాజకీయాల్ని అరచేతిలో ఉసిరికాయలాగా మార్చుకోవడమూ, పదవీవ్యామోహంతో, అధికార బలంతో ఎల్లకాలమూ బ్రతకాలనేదే నీ ఆదర్శం. ఆ ఆదర్శంకోసం మనుష్యుల్ని నీ గుప్పెటిలో ఇరికించుకుంటున్నావు. వాళ్ళను గొర్రెలమందగా తయారు చేస్తున్నావు. ఎదురుతిరుగుతారనుకొనేవాళ్ళకు ఎరనువేసి, నీవెంట తిప్పుకుంటున్నావు. నా ఆశయాలకు, ఆచరణలకు ఇది పూర్తిగా విరుద్ధం. ఇంతకాలమూ నిన్ను మార్చగలననీ, తద్వారా గ్రామంలో ప్రగతి శీలమైన అభివృద్ధినీ, మనుష్యుల్లో నీతీ నిజాయితీలతో అలరారే నవజీవనాన్నీ, ఆదర్శవంతమైన వ్యవస్థనూ చూడవచ్చుననీ - గాఢ విశ్వాసంతో వున్నాను. కాని నా ఆశయాలకు ఆచరణలకు ఎప్పటికప్పుడు అడ్డుగోడలు కడుతున్నావు. ఆ అడ్డుగోడల్ని పడగొట్టాలంటే - నేను ఈ కొంపలోవుంటే కుదరదు." అంటూ అన్నయ్య ముఖంకేసి చూడకుండానే కుమారస్వామి విసవిసా బయటికి నడిచాడు.

సుదర్శనం గంభీరమైన, నిశ్చేష్టతతో తమ్ముడు వెళ్ళే త్రోవకేసి చూస్తూ నిలబడిపోయాడు.

# ౧౦

భర్తా, మరిదీ మెరాబాలో కొబ్బరి చెట్ల క్రింద వాదోపవాదాలు చేసికోవడం, ముఖాలు గంభీరతగా మార్చుకోవటం, కుమారస్వామి వడిగా, అలిగినట్టు బయటకు నడిచి పోవటం – కిటికీలోంచి కళ్ళారా చూసింది శశిరేఖ. ఆమె ఇంట్లోంచి బయటకు వచ్చేప్పటికే కుమారస్వామి వీధివాకిలి దాటాడు.

"ఏమండీ! ఏం జరిగింది? కుమారస్వామి అట్లా విసురుగా ఎక్కడికి వెళ్ళాడు?" అన్నది శశిరేఖ ఆదుర్దాగా.

"ఇంట్లోంచి వెళ్ళాడు. అన్యాయానికి ఆటపట్టయిన ఈ కొంపలో వుండలేడట ... సెంటిమెంట్స్ పెంచుకున్న వాళ్ళతో ఇదే ఇబ్బంది ..." అన్నాడు సుదర్శనం తన వల్ల నేరం ఏమీ లేదన్నట్టు.

"ఆఁ! ఇంట్లోంచే వెళ్ళాడా! వాదోపవాదాలు ఎంత ముదిరితే మటుకు ఆ అబ్బాయి ఎట్లా వెళ్ళాడు? మీ రెట్లా వెళ్ళనిచ్చారు. నలుగురూ వింటే ఏమనుకుంటారు?–అయినా ఎక్కడికి వెళతాడు? మాటల్లో భేదం వొస్తేమటుకు ఇల్లు వొదిలి వెళతాననటం ఏమిటి?... ఏమో ఆయన పరిస్థితి మరీ

అంతుపట్టకుండా వుంటూన్నది.” శశిరేఖ ఆందోళనను వ్యక్త పర్చింది.

బాడవలో పొలంగట్లపై నుంచి పిల్లమిసర కోసుకొచ్చి పశువుల కొఠంలో వేసి, పెరట్లోకి వెళ్ళబోతూన్న కోటినాగులు అయ్యగార్నీ అమ్మగార్నీ చూసి– “చినబాబుగారు! మా వురవడిగా ఆసత్రపు తట్టుకు పోతుండా రెందుకు బాబూ!” అన్నాడు తలగుడ్డ మెడమీదకు జార్చుతూ.

“ఈ రాత్రికి సత్రంలో జేరతాడేమో బైరాగులతో పాటు” అన్నాడు సుదర్శనం.

“ఆయన అసలే పట్టుదలగలమనిషి...మీ అమ్మగారు వింటే గుండె బాదుకుంటుంది. ఎట్లాగైనా నచ్చజెప్పి ఇంటికి తీసుకురండి” అన్నది శశిరేఖ.

“నేనా! నేను పిలిస్తేరాడు. నువ్వే వెళ్ళి పిలువు. ఎల్లాగో బోధించి, ఇంటికి తీసుకురా. ఈ విషయం ఊరంతా పొక్కకముందే వాడు ఇంటికివస్తే బాగుండు.”

ఇంట్లోకి వెళ్ళాడు సుదర్శనం.

పంపువద్ద చేతులూ, ముఖమూ కడుక్కుంటోన్న పెద్ద పాలేరును పిలిచింది శశిరేఖ. కోటినాగులు పైపంచతో ముఖం తుడుచుకుంటూ వొచ్చాడు.

“ఏంటమ్మగోరూ!”

“చినబాబుగారు ఎక్కడున్నా వెతికి, నేను రమ్మన్నానని అర్జంటుగా తీసుకురా.”

వాడు తల ఆడించుకుంటూ వెళ్లాడు.

కుమారస్వామి సత్రంలో లేడు. లైబ్రరీలో కూడా లేడు. కాఫీ హోటళ్ళు, కిళ్ళీదుకాణాలూ, బజార్లూ వెతి కాడు కోటినాగులు. వాకబు చేయగా డొంకలోకి వెళ్ళాడనీ, పొలానికిగానీ, చెరువుకట్టమీద రావిచెట్టు క్రిందకుగానీ వెళ్లి వుంటాడనీ తెలిసింది. కోటినాగులు ఆ చెరువు కట్టకేసి వెళ్ళాడు.

ప్రొద్దు గ్రుంకేవరకూ శశిరేఖ మరిది రాకకోసం ఎదురు చూచింది. సుదర్శనం కూడా ఒకటి రెండుసార్లు అడిగాడు - 'వాడొచ్చాడా' అని. అతను కూడా ఆందోళన పడుతూన్నట్టు స్పష్టంగా తెలుస్తూన్నది.

కోటినాగులు పెదవి విరుచుకుంటూ వొచ్చాడు.

"చినబాబుగారు రానని చెప్పారండీ. నేనెంత బ్రతిమి లాడినా - ససేమిరా అన్నారండి."

"ఎక్కడున్నాడురా ?" అన్నది శశిరేఖ.

"ఊళ్ళో కొచ్చారండి. ఆ జోగయ్యగారి మేనల్లుడూ ఆయనా కల్సి సత్రం తట్టుకు వెళ్ళారండి. ఈ రేతిరికి ఆడనే మకాం లాగుంది."

"నువ్వెళ్లి పనిచూసుకో. దాలిగుంటలో వులవలు కుండ తీసి, బుట్టల్లో ఎడ్లకు దానాపెట్టు. మచ్చుమీద గడ్డికట్ట లున్నాయో లేదో చూడు. లేకపోతే వామిలోంచి మేత దూసి, కట్టలు కట్టి, పైన పెట్టించు. వర్షం వచ్చేట్టుంది. ఎడ్లను చావట్లో గాటికి కట్టివేసి, గమిడి గేదెను ఎడంగా మక రానికి కట్టివేయి. దూడకు పలుపు వూడకుండా జాగ్రత్తగా

చూడు. వామిలోకి వెళితే నాలుగు జనపకట్టెలుకూడా లాగి మచ్చుపై పెట్టు. పచ్చిగడ్డిమోపు బండి జల్లలో వుంచు."

కోటినాగులు తల ఆడిస్తూ చావట్లోకి వెళ్ళాడు.

సుదర్శనం బజారుకెళ్ళి, ఇంకా ఇంటికి రాలేదు.

చీకటి ముదిరింది.

వంట పూర్తిచేసి, పాలకుండ పొయ్యిమీద ఎక్కించి, వంటగది ముందు గచ్చుపైన కుక్కిమంచం వేసికొని మేను వాల్చింది మంగమ్మ. కోడల్ని చూసి –"ఏమే! మధ్యాహ్నం నుంచీ కుమారస్వామి కనబడటంలేదు. వాడు కాఫీకిరాలేదూ" అన్నది.

"వొచ్చినట్టు లేదు." కనుబొమలు ముడిచి అన్నది శశిరేఖ.

"ఎక్కడికి కెళ్ళాడు? బస్తీకేమైనా వెళ్లాడా?"

"ఏమో! తెలియదు." అన్నది శశిరేఖ.

అన్నదమ్ములు ఘర్షనపడి, తమ్ముడు 'ఈ కొంపలో నేను వుండలేను' అంటూ వెళ్లాడని తెలిస్తే - అత్తయ్య గుండెలు బాదుకుంటూ హడావిడిచేస్తుందనీ, ఇరుగు పొరుగు వాళ్ళకుచెప్పి నానారభసా చేస్తుందనీ ఆమెభయం. ఆవిడకు తెలియకముందే కుమారస్వామికి నచ్చజెప్పి, ఎల్లాగైనా తీసికొని రావాలని శశిరేఖ ఆలోచన.

రాత్రి ఎనిమిదిగంటలైంది. సుదర్శనం ఇంటికిరాలేదు. రేపు మీటింగు వ్యవహారాలు మాట్లాడుతున్నాడేమో, ఏ రాత్రికి ఇంటికి వస్తాడో అనుకుంది శశిరేఖ.

"పెద్దవాడుకూడా ఇంటికి రాలేదుటే?" అన్నది మంగమ్మ కుక్కిమంచంలోవుండే.

"రాలేదు అత్తయ్యా. రేపు బోర్డుమీటింగు వుందను కుంటాను. ఆ విషయాలు మాట్లాడుకుంటూ ఎప్పుడు ఇంటికి వస్తారో! నువ్వు ముందు భోంచేయి అత్తయ్యా!"

"మరి చిన్నవాడికి ఏంమీటింగులున్నాయి? వాడెందుకు రాలేదు? ఊళ్ళో లేడేమో...వేళకు భోజనాలు చేయకుండా వీళ్ల వ్యవహారాలేమిటో..." గొణుక్కుంది మంగమ్మ. ముందుగా భోజనం చేయాలనివున్నా, బద్ధకంతోటి ఆవిడ మంచంమీదే పడుకున్నది.

భర్త ఎంత సేపటికీ రాకపోయేప్పటికి, శశిరేఖ ఆ ఊరి సత్రానికి తనే బయలు దేరింది. ఆ సత్రం ప్రక్కనే ఆమెకు సరళ అనే స్నేహితురాలి ఇల్లు ఉన్నది. ఎదురైన అమ్మలక్కలకు 'సరళ ఇంటికి-' అని సమాధానం చెప్పిందామె. అన్నదమ్ముల అభిప్రాయ భేదాలతో మాటలు పెరిగి పట్టుదలలు ముదిరి, మరిది ఆవేశపరుడై, అలిగి, ఇల్లు వొదిలిపెట్టి వెళ్ళితే - ఆ రాత్రివేళ, ఒక్కతే, ఇంటి పరువుప్రతిష్ఠల్ని కాపాడాలని, అన్నదమ్ముల మధ్య తలెత్తిన పొరపొచ్చాలను అందరి నోళ్ళల్లో పడకుండా చేయాలని, మరిదిని బ్రతిమాలి

ఇంటికి తీసుకురావాలని శశిరేఖ బయలుదేరింది. ఆమె నేరుగా సత్రానికి వెళ్ళింది.

గోడకు అమర్చిన కోడిగుడ్డు లాంతరు కాంతిలో వేప చెట్టు దగ్గర వరండాలో గుంజకు చేరగిలబడి కూర్చుని ఆలోచిస్తున్నాడు కుమారస్వామి. దూరంగా చేదబావి గట్టుపైన ఇద్దరు వయస్సు మళ్ళినవాళ్ళు కూర్చుని చెప్పుకుంటున్నారు. వరండాలో ఓమూల ఇద్దరు సాధువులు ఎంగిలి బీడీల్లోని మజాని గురించి చర్చించుకుంటున్నారు. వేపచెట్టు క్రింద ఓ ముసలావిడ ఇటుకరాళ్ళ పొయ్యిపెట్టి అన్నం వండుకుంటోంది. సత్రం గుమాస్తా బస్తీకి వెళ్ళి ఆఖరి బస్సుకుకూడ రాలేదు. ఆయనభార్య ఇంట్లో పిల్లలకు భోజనం పెడుతున్నది.

వందగజాల దూరంలో వున్న వీధి విద్యుద్దీపం ఆసత్రం ముందు ఖాళీస్థలందాకా తన ప్రభావాన్ని చూపెట్ట లేక పోతూన్నది. సత్రం ముందుకూడ విద్యుద్దీపపు స్తంభం వుందిగాని, మూడుమాసాల క్రితం చెడిపోయిన దానిబల్బు మళ్ళీ మార్చ బడలేదు. వెలుగు కంటె చీకటి తనకు ఉపయోగం అన్న ధోరణిలో సత్రం గుమస్తా దాన్ని గురించి పట్టించుకోలేదు.

ఏకాంతంగా కూర్చుని దీర్ఘంగా ఆలోచిస్తున్న కుమార స్వామిని మెల్లగా పిలిచింది దాపుకువచ్చి శశిరేఖ. ఉలిక్కి పడ్డాడు కుమారస్వామి.

"నువ్వా వదినా! ఇంతరాత్రి..."

"కబురంపాను గదా ఇంటికి రమ్మని – నీవు రాకపోతే నాకు రాకతప్పలేదు."

"నా మాటకు విలువా, గౌరవం లేనప్పుడు; నా భావాలకు విరుద్ధంగా అన్నయ్య అన్యాయాన్ని స్వేచ్ఛగా సాగిస్తున్నప్పుడు; మనస్సులో బాధపడుతూ ఇంట్లోవుండటం దేనికి ?"

"ఆ ఇల్లు మీ అన్నయ్య ఒక్కడిదేనా ? నీది కాదూ ? నీ స్వంత ఇల్లు కాదూ! నీ ఇంటిమీద నువ్వే అలిగిపోవడమా! ఎంత మూఢంగా ప్రవర్తిస్తున్నావు ? ఎంత అవివేకంగా అలిగి వొచ్చావు ? మనస్సులు భేదిస్తే, గుట్టుచక్కగా-మళ్ళీ, కలుపుకొనే ప్రయత్నం చేయాలిగానీ, అన్నదమ్ముల మనస్పర్ధల్ని ఊరంతా చాటింపు వేసికోవాలా? ఇంటి గౌరవమర్యాదలకు, వంశప్రతిష్ఠకు, సాంప్రదాయానికి ఎంతన్యూనత ? పరుల దృష్టిలో ఎంత తేలిక? ఈ ఊళ్ళో మీ అన్నయ్య స్థానం, హోదా, పలుకుబడీ విలువైనవి. తద్వారా మన కుటుంబానికి ఓ ప్రత్యేకమైన అంతస్థుఉంది. దాన్ని సమూలం నాశనం చేయటానికి జీవితంలో ఒక ఆశయంగా నువ్వు పెట్టుకొన్నట్టు కనబడుతూన్నది. నీ చేష్టలన్నీ ఆ భావాన్నే గట్టిపరుస్తున్నాయి. అంతకంతకూ నీ దృక్పథాల్లో రాటు దేలుతున్నావు. కొరకరాని కొయ్యవు అనిపించుకుంటున్నావు. సృష్ట్యాదినుండీ సకలచరాచర రాసుల్లోనూ మార్పు సహజమై పరిణామాన్ని పొందుతూ వొస్తూన్నది. మనుషులు మారుతున్నారు. దేశాలు మారుతున్నాయి. వ్యవస్థలు మారుతున్నాయి. శాస్త్రాలు మారుతున్నాయి. ప్రకృతిలోనే మార్పు కనబడుతూన్నది. కాని నీలో మార్పు రావటంలేదు. పరిస్థితుల్ని అవగాహన చేసికొని, పరిణామాల్ని అర్థం చేసికొని, ప్రయోజనాల్ని దృష్టిలో పెట్టుకొని - వర్తమాన జీవనక్రమాన్ని మార్చు

కోవాలిగానీ, తను పట్టుకున్న కుందేలుకు మూడేకాళ్లు అన్న లెక్కలో మొండిగా ఆశయాల్ని ఏర్పరుచుకొని, అంతకంటె మొండిగా వాటిని ఆచరణలో పెట్టాలని పట్టుదల వహిస్తే, నువ్వు ముందుకు పోయేదెప్పుడు? ఎట్లా? నీ ఆదర్శాలు మంచివని, ఆశయాలు ఉదాత్తమైనవని, నువ్వు నడిచేమార్గం ఉత్తమోత్తమమైనదని - నువ్వు గర్వ పడొచ్చు; ఇతర్లు మెచ్చుకోవచ్చు. కాని జరుగుతూన్న చరిత్రతో నిన్నూ, నీ భావాల్ని సమన్వయ పర్చుకోవడానికి విముఖత్వం చూపిస్తావెందుకు? ఊళ్లో ఏ అన్యాయం జరిగినా, ఏ ఘోరం తలపెట్టి చేయబడినా, ఏ అధర్మం ముందుకొచ్చినా దానికిఅన్నయ్యే కారణభూతుడనీ, ఒక్క అన్నయ్య మీదే ఈ గ్రామ భవిష్యత్తంతా ఆధారపడివున్నదనీ, అన్నయ్యలో పరివర్తన రావాలనీ - నువ్వు తప్పుడు అంచనా ఎట్లా వేస్తున్నావో నాకు అర్థంవకాటంలేదు. అన్నయ్య ఒక్కడు నీతిగావుంటే, ధర్మపాలనసాగిస్తే, నిజాయితీకి నిలబడితే - ఊరంతా ఆ నీతిని మెచ్చుకుంటుందా? ఆ పాలనను సమర్థిస్తుందా? ఆ నిజాయితీకి కట్టుబడివుంటుందా? చెప్పు. ఆ మేరకు నువ్వు గ్యారంటీ యివ్వగలవా? మా అన్నయ్య ఆ దేస్థానంలో వుండగలడా? ఇప్పటి పలుకుబడీ, హోదా, అంతస్తూ చెక్కుచెదరకుండా వుంటాయా? ఉండవు. నాకు తెలుసు. కాల గమనాన్ని పరిశీలించే ప్రతివారికీ తెలుసు. మా అన్నయ్య తన అధికారాన్ని వొదులుకుంటే గ్రామంలో రాజకీయాలు మరీ అధ్వాన్నస్థితిలోకి దిగజారతాయి. మనుష్యుల్లో స్వార్థం,పదవీవ్యామోహం, కుళ్లు, మోసం,అధర్మం మరీప్రేగి

పోతాయి. నువ్వు అర్థం చేసికోవటంలేదు. ఊరిపరిస్థితిని అర్థం చేసికొనేందుకు ప్రయత్నం కూడా చేయటం లేదు. మీ అన్నయ్యపట్ల గౌరవం నీకు లేదని నేను అననుగానీ-ఆయనకు ఊళ్లోవున్న గౌరవాన్ని ఇల్లాంటి చేష్టలద్వారా చెడగొట్ట వద్దని ప్రాధేయపడుతున్నాను. ఇంటికి వెళదాం రా! మీ అమ్మగారికి కూడా తెలీదు - నువ్విట్లా అలిగివొచ్చినట్టు. ఆవిడకు తెలిస్తే నానాగందరగోళం చేస్తుంది. చాటింపు కంటె హీనంగా పరువును బజారు కెక్కిస్తుంది. ఆవిడకు తెలీకముందే నువ్వు ఇంటికి రావాలి. మీ అన్నయ్య కూడా చాల బాధపడుతున్నాడు. నిన్ను గురించి రెండు మూడు మార్లు అడిగాడు 'వొచ్చాడా' అని. నిన్ను గురించి ఆయనకు గల విలువల్నీ, శ్రద్ధనూ, సద్భావాన్నీ నువ్వు లక్ష్యపెటటం లేదు. నీ శ్రేయస్సూ, నీ అభివృద్ధీ, నీ జీవితపు వెలుగు - ఆయన జీవితలక్ష్యాలలో ఒకటి. అది నువ్వు గ్రహిస్తే - నీ ప్రవర్తన యింత బాధ్యతారహితంగా వుండదు! ఇంటికి వెళదాం రా. కుటుంబగౌరవాన్ని రచ్చకెక్కించకు. ఈ రాత్రికి మీ అన్నయ్యతో మాట్లాడి, నీకు నచ్చే విధానాన్నే అనుసరించమని చెబుతాను. వెళదాం రా. ఈ రాత్రికి నువ్వు ఇంటికి రాకపోతే - తెల్లవారాక మీ అన్నయ్య బజారు ముఖం చూడలేడు. నేను మంచం దిగలేను" అంతసేపూ శశిరేఖ నిలబడే మాట్లాడింది. మరిది కళ్ళల్లోకి 'బయలుదేరు' అన్నట్టు తీక్షణంగా చూసి, అక్కణ్నుంచి బయలుదేరింది.

శక్తిహీనుడైనట్టు, మంత్రముగ్ధుడైనట్టు, మనస్సంతా తిమ్మిరెక్కి మొద్దుబారినట్టు – సత్రపు వరండాలోంచి కదిలి, ఇంటికొచ్చాడు కుమారస్వామి.

ఆ రాత్రి పదిన్నరగంటలకు ఇంటికి వచ్చిన సుదర్శనం భార్య కుమారస్వామికి భోజనం పెడుతూ వుండడాన్ని చూసి సంతృప్తి పడ్డాడు.



ఊహకు అందని మార్పులూ, సంఘటనలూ, విచిత్రాలూ జరగటం లోకవిదితం. ఒక్కొక్కప్పుడు రాజకీయాలు కూడ అంచనాలను, ఆదర్శాలను,ఆవేశాలనుమించిన మలుపులు తిరుగుతాయి. ప్రపంచ చరిత్రలో రాజకీయాల పాత్రను అవలోకిస్తే అట్లాంటి మలుపుల్ను సువ్యక్తం కాగలవు. అధికారం కోసం రాజకీయాల్ని ఆరాధించే వ్యక్తులు, జీవితాదర్శాలుగా మార్చుకున్న మనుష్యులు, త్యాగాలకు సిద్ధపడే మహనీయులు – జయాలను పొందవచ్చు; అపజయాల పాలుగావచ్చు; కోరిన అధికారాన్ని చేపట్టవచ్చు; అధఃపతనం కావచ్చు; ప్రజాసేవకు పాటుబడవచ్చు; ప్రజాకంటకులుగా మారిపోవచ్చు; త్యాగాలు చేయవచ్చు; భోగాలు అనుభవించవచ్చు. ఏం చేసినా రాజకీయ రంగంలో తనను తాను కాపాడుకోవటం ముఖ్యం. ఆ నేర్పూ, చతురతా, తెలివితేటలూ, సామర్థ్యమూ ఉన్నవాళ్ళే రాజకీయాల్లో సురక్షితంగా జీవించగలుగుతారు.

ఆ రోజు ఆ గ్రామ ప్రజలంతా ఆశ్చర్యచకితులైనారు- ఆ విషయానికి. బోర్డు మీటింగులో జోగయ్య స్థలం పంచాయితీ భవనానికి తీర్మానించ బడింది. అందుకు ప్రెసిడెంటు సుదర్శనం ముఖ్యకారకుడు. క్రితంరోజు రాత్రి కొంతమంది మెంబర్లకు నచ్చజెప్పి, బలవంతాన ఒప్పించాడు. సోమయ్యా, మరి ఇద్దరు మెంబర్లు'ససేమిరా! ఆరునూరైనా, నూరుఆరైనా అట్లాజరగటానికిప్పీల్లేదు'అని రాయిగుద్ది చెప్పారు. కాని లాభం లేకపోయింది. చివరకు సోమయ్య మీటింగుకే రావటానికి చిన్నతనం వేసి రాలేదు. జోగయ్య స్థలం ఆమోదించబడింది. ఊళ్ళో కలకలం బయలుదేరింది. ప్రతి వీధిలోనూ పదిమంది గుమిగూడి ఆ గుబ్బుగా చెప్పుకున్నారు. రష్యన్లూ, అమెరికన్లూ చంద్రమండలంలోకి రాకెట్లను పంపించినా అంత ఇదిగా చెప్పుకోలేదు. బసవనాగయ్య ముఠావాళ్లు అంతా తమ ప్రయోజకత్వమనీ, తమ వర్గానికి దడిచి అధికార వర్గం ఓ మెట్టు దిగి వచ్చిందనీ, న్యాయానిదే గెలుపనీ - సవాళ్ళు వేశారు. అధికార పక్షంవాళ్ళు ముఖాలు కాశీ చెంబుల్లా మార్చుకొని, చెవుల్లో అగ్గిపుల్లలు పెట్టుకొని తిప్పుకుంటూ ఆలోచించారు. బసవనాగయ్య ముఠావాళ్ళు చేసే తుప్పు కత్తుల్లాంటి వ్యాఖ్యానాలకు ఆత్మాభిమానం అడ్డువొచ్చినా 'కంయ్ కుంయ్' మన లేదు.

కుమారస్వామి సంతృప్తికరంగా నవ్వుకున్నాడు. అన్నయ్యలో మార్పుకు మొదట్లో అందరికి మల్లే ఆశ్చర్యపడినా తర్వాత, మనస్సులో అన్నయ్య మెడలో దండ వేశాడు. అన్నయ్య జీవితంలోని నవజాగృతికి తొలి వేకువగా భావించాడు.

అన్నయ్య మీద ఆవేళ వాస్తవమైన గౌరవాభిమానాలు ఉదయించాయి.

సోమయ్యస్థలం పంచాయితీ భవననిర్మాణానికి తీర్మానం తీసికొని రాకపోయేప్పటికి - అధికారవర్గంలో పెద్ద చీలిక ఏర్పడింది. సోమయ్య కక్షతో పార్టీకట్టాడు. వైస్‌ప్రెసిడెంటునూ, కొంతమంది మెంబర్లనూ, తన ప్రక్కకు త్రిప్పుకున్నాడు; సుదర్శనంమీద భారీఎత్తున దుష్ప్రచారం గావించాడు. కంచే చేనుమేస్తే ఊళ్ళో రాజకీయాలు అదుపులో వుంటాయా? ఆ జోగయ్య దగ్గర రెండువేలు చాటుగా తీసికొని, ప్రెసిడెంటు యీ పనిచేశాడు? అతన్ని నమ్ముకొని, ఇంతకాలమూ అతని నీడను అంటిపెట్టుకొని తిరిగినందుకు తగినశాస్తి చేశాడు? ఎదిరి వర్గంతో చేతులు కలిపాడు. తన ముఠాను మోసంచేశాడు? తన వాళ్ళను నట్టేట ముంచాడు. ఆ మాటల్ని సుదర్శనం ముఠావాళ్ళు కొంతమంది వెంటనే నమ్మారు; మరికొంతమంది కొంచెం ఆలస్యంగా నమ్మారు; ఇంకొంతమంది తన స్థలానికి అనుకూలంగా తీర్మానం జరక్కపోయేప్పటికి ఉక్రోషంతో అట్లా ఒడ్డునబడ్డ చేపకుమల్లే గిలగిల కొట్టుకొంటున్నాడు' అనుకున్నారు. ఏమైనా సోమయ్య గాలి పోగుచేస్తూ గోలచేయసాగాడు.

అందుకు తగినట్లు ప్రెసిడెంటు సుదర్శనంతన వైఖరిలో నిష్పాక్షికమైన మార్పును ప్రవేశపెట్టాడు. విశాలదృక్పథాన్ని అనుసరించ మొదలెట్టాడు. ప్రజలక్షేమమే తన క్షేమమనీ, అందరికీసౌకర్యాలుకల్పించటం తనధర్మమనీ,వర్గరాహిత్యమైన ప్రజాస్వామ్యంలో, విశ్వమానవ సౌభ్రాతృత్వంలో అనిర్వచ

నీయమైన ఆనందానుభూతులున్నాయనీ, నీతీనిజాయితీలతో విద్యుక్తధర్మాన్ని మేళవించి కృషిచేయటంవల్ల జీవితానికి సార్థకత ఏర్పడుతుందనీ — గ్రహించి, మునుపటి తన భావాలను మార్చుకున్నాడు. అవినీతి, అన్యాయం, ధార్మికసమస్యల పట్ల నిర్లక్ష్యం, స్వార్థం, ముఠాతత్వం, పాక్షికదృష్టి, అక్రమ వర్తనమూ - అట్లా ప్రతివ్యక్తీ తనకుతాను చిన్నసైజులో గట్టిపర్చుకొని, జీవితాన్ని మురికిదార్లుపట్టిస్తే, అన్నిదారులూ ఏకమై మురికినీరంతా నదులుగా ప్రవహించి, సముద్రాన్నే కలుషితంచేసే ప్రమాదముంది. ప్రతిమనిషీ తనకుతాను నిర్మలంగా, నిజాయితీగా, నీతిగా, ధార్మికగుణాన్ని కలిగివుండి, జీవితానికీ, సంఘానికీ ప్రయోజనకారిగా నిలిస్తే - సంఘవ్యవస్థ ఎంతచక్కగా వుండగలదు!

జోగయ్య స్థలం బోర్డు తీర్మానంలో నెగ్గటానికి ప్రయత్నించిన ప్రెసిడెంటు సుదర్శనం మరికొన్ని పనులు తనముఠాకు ఆశ్చర్యాన్నీ, కోపాన్నీ కలిగించేవి చేశాడు. ఇంతవరకూ అధ్వాన్నస్థితిలో వున్న రోడ్లను వెంటనే బాగుచేయించాడు. బసవనాగయ్య పార్టీ వాళ్ళు వుండే వీధులకు విద్యుద్దీపాలు పెట్టించాడు. కొత్తగా లెట్రైన్సు కట్టించాడు.

హఠాత్తుగా ప్రెసిడెంటు సుదర్శనం ఇట్లా ఎందుకు మారాడు? పలురకాలుగా ఊహించి, వ్యాఖ్యానాలు చేశారు ఇరువర్గాలవారు. 'అన్నయ్యలో మంచికోసమే మార్పు వొచ్చింది.' అనుకున్నాడు కుమారస్వామి.

"ఇదంతా నటన. పొలిటికల్ స్టంటు. అందర్నీ మంచి చేసికోవడానికి ప్రయత్నించడంలో ఏదో అంతరార్థం వుంది. రాబోయే ఎలక్షనల్లో ఎం. ఎల్. ఏగా నిలబడదల్చు కున్నాడేమో!"

"బసవనాగయ్యకు దడిచి - తన దృక్పథం మార్చు కున్నాడేమో!"

"తన వాళ్లను నమ్మలేక అధికారాన్ని ఎల్లకాలమూ కొనసాగించేందుకు ఎదురు పార్టీ వాళ్లతో చేతులు కలుపు తున్నాడేమో!"

'సుదర్శనం పిరికివాడు. భయస్థుడు. మోసగాడు. తనకు అండగా వున్నవాళ్ళను లెక్కచేయకుండా బద్ధశత్రువులతో మంచికోసం ప్రాకులాడుతున్నాడు.'

"ఈ వర్గ రాజకీయాలకు అతీతంగా వుండదలిచాడేమో! తమ్ముడిలాగ జీవించదల్చుకున్నాడేమో!"

...అనుకున్నారు ఊళ్లోవాళ్లు.

ఈ అదనుచూసుకొని సోమయ్య ఓ నాయకుడయ్యేం దుకు ప్రయత్నించాడు. వేరేముఠాని కట్టాడు. సుదర్శనంలో కలిగిన మార్పువల్ల అతని పార్టీలో అతనిపై ద్వేషాన్నీ, అసహనాన్నీ పెంచుకున్న, వ్యక్తుల నందర్నీ ఓ చోట రహ స్యంగా సమావేశపర్చి, ఇంతకాలమూ ప్రెసిడెంటు తట్టున వుండటంవల్ల ఏమీ ప్రయోజనాలు లేకపోగా, అవమానాల పాలు గావాల్సి వొచ్చిందని, అతని నీడలో వ్యక్తిత్వాన్నే

గోల్ప్వాల్సి వొచ్చిందనీ, ఇంకా అతని పార్టీలో వుండటం కేవలం అవివేకమనీ - సోమయ్య దృఢపర్చాడు. అందరూ 'అట్లాగే' నని తలలు ఆడించారు. వాళ్ళల్లో వెనుకబడిన జాతుల తరుపున మెంబరు వరదరాజులు కూడా చేరాడు. అతని తండ్రి కాలువకట్టపైన తుమ్మచెట్టు నాగటిదుంపకోసం నరికినందుకు మైలుజవాను పట్టుకొని కేసుపెట్టాడు. ఆ కేసును తప్పించవల్సిందని వరదరాజులు ప్రెసిడెంటును కోరగా - "మీనాన్న చేసింది తప్పు. చట్టవిరుద్ధం. కేసుపెట్టటం వాళ్ళ విద్యుక్తధర్మం. శిక్షపడటం న్యాయాన్ని గౌరవించినట్లవు తుంది. మరి సర్కారువారి సొమ్మును దొంగిలించడం నేరం కాదూ! ఇట్లాంటి విషయాల్లో నా సహాయం లభించదు" నిర్మోహమాటంగా అన్నాడు. ముఖం దబరాగిన్నెంత చేసి కొని వరదరాజులు సోమయ్య దగ్గరకు వెళ్ళాడు.

అట్లాగే స్కూలుమాష్టర్ని తొలగించమని వొచ్చిన సూర్యనారాయణకూ, తనఅబ్బాయికి బిల్లుకలెక్టరు ఉద్యోగం యిప్పించమని వొచ్చిన తాతయ్యకూ, కాపుసారా కాస్తూ న్నందుకు పోలీసులు పట్టుకోగా తనకొడుకును విడిపించమని వొచ్చిన ఖాయదాదారుడు వెంటరత్నానికీ, తనచేనుప్రక్కన మురుగుకాలువ ఓవర్సీరుతో చెప్పి, తప్పించే ఏర్పాటుచేయ మని అర్థించిన సూరయ్యకూ - జంకులేకుండా చివాట్లువేసి పంపించాడు ప్రెసిడెంటు సుదర్శనం. వాళ్ళంతో రోషంతో రొమ్ములు విరుచుకొని - సోమయ్యముఠాలో చేరారు.

కొద్దికాలానికే సోమయ్య ఊళ్ళో మోతాదునాయకుని స్థానం ఆక్రమించాడు. ప్రెసిడెంటు సుదర్శనాన్ని దింపి తను పంచాయితీ అధ్యక్షునిస్థానం పొందేందుకు సన్నాహాలు చేయసాగాడు.

౧౨

"అమ్మాయీ! నీ పిచ్చి నీదిగాని, 'నాకు పెళ్లొద్దు బాబూ!' అంటూ పెడముఖం పెట్టుకు తిరిగేవాడ్ని, ఎక్కడ పట్టుకొని పెళ్లి పీటలమీదకు తీసికొస్తాము? కుమారస్వామి అదో తరహా మనిషి. నలుగురిలో కల్సి తిరిగే బాపతు కాదు. తనలోక మేమిటో, తన ఆలోచన లేమిటో - ఎప్పుడూ బ్రతుకుమీద విసుగెత్తి బైరాగుల్లో కలవటానికి సిద్ధంగా వున్నట్టు వుంటాడు. పైగా ఆవేశపరుడు. అహర్నిశమూ కోపం కళ్ళల్లో కాపురముంటూ వుంటుంది. అట్లాంటి వాడితో నీకు పెళ్లి ఏమిటి? నువ్వు జీవితంలో సుఖపడటానికేనా? అతని జీవితమే అమావాస్యనాటి అరణ్యం. ఆ అరణ్యంలో, చీకట్లో నువ్వు - ప్రవేసిస్తే-నీకు వెలుగు దొరుకుతుందా? నువ్వూ చీకట్లో కొట్టుమిట్టుకు లాడవల్సిందే! భవిష్యత్తు బూడిద పాలవుతుంది. అసలు పెళ్ళికి ముందే ఒకళ్ళ కొకళ్ళు అర్థంచేసికొని గాఢంగా ప్రేమించుకొని, వివాహంచేసికుంటేనే తర్వాత దాంపత్యజీవితంలో భేదాభిప్రాయాలు కలుగుతూ అవస్థలు పడుతూన్న భార్యాభర్తల్ని అడపాదడపా చూస్తున్నాము. అటువంటిది నువ్వు ప్రేమించి, అతను ద్వేషిస్తూంటే,

మీా ఇదువురికీ పెళ్ళిజరిగితే — నీ బ్రతుకు దుఃఖభాజనంకాక ఏమౌతుంది? ఆ సంగతి ఆలోచించుకోనే ఈ మంకుపట్టు పడుతున్నావా? నువ్వు చదువుకున్నా, అనుభవంలో పసిదానివి. వయస్సుతోపాటు, అనుభవంతో తల నెరిసినవాడ్ని నేను. నీ శ్రేయస్సునూ, సుఖాన్నీ, బాగునూ జీవితంలో ప్రధానలక్ష్యాలుగా పెట్టుకొని కృషిచేస్తూన్నవాడ్ని, నామాట విను. '—లంక'లో ఫస్టుక్లాసైన ఓ సంబంధం కుదిర్చాను. వరుడు అందగాడు. సివిల్ ఇంజనీరింగు ప్రథమశ్రేణిలో ప్యాసై నాగర్జునసాగర్ ప్రాజెక్టులో జూనియర్ ఇంజనీర్‌గా ఉద్యోగం చేస్తున్నాడు. పదెకరాల కొంద్రఉంది. తండ్రికి ఒక్కడే కొడుకు. తండ్రివద్ద నలభై, యాభై వేలదాకా డబ్బు మూలుగుతూందని ఊళ్ళో పిల్లాది మొదలు తెలుసు. కుటుంబసాంప్రదాయంకూడా మంచిది. వంశపు పరువుప్రతిష్టలు మొదట్నించీ చెక్కుచెదరకుండా వొస్తున్నాయట. ఊళ్ళో వాకబుచేశాను. మనకు అన్నివిధాలా కుదురైన సంబంధం. మాట ఇచ్చాను. నువ్వు తప్పకుండా పెళ్ళికి ఒప్పుకోవాల్సిందే. ఈ మాసంలో మంచి ముహుర్తాలున్నాయి. ఈ నెలలోనే నీ పెళ్ళి జరగాలి. జరుగుతుంది. ఆ కుమారస్వామిని గురించి మర్చిపో. మన కోర్కెలప్రకారం పరిస్థితుల్ని కల్పించుకొనేందుకు ప్రయత్నం చేసేకంటె, పరిస్థితులు కల్పివొచ్చే మార్గాన్ని అనుసరించటం మేలు. ఇప్పుడింకా నువ్వు 'ఆ కుమారస్వామినితప్ప పెళ్లి చేసికోనని మొండిపట్టు పడితే—పెద్దవాళ్లముందు నా మాటా, మర్యాదా, గౌరవమూ, విలువలూ అద్దంమీాద నీటిచుక్కల్లా జారిపోతాయి. నా పరువుమర్యాదల్ని, నీ జీవితంలో సుఖ

శాంతుల్ని కాపాడుకోవటానికి — ఈ పెళ్ళికి నువ్వు అంగీకరించి తీరాలి. నీకు నువ్వుగా ఆలోచించుకోనే అగత్యమేమీ లేదు."
ఆ విధంగా కూతురుతో గట్టిగా చెప్పి, మున్సబు హరినారాయణ బజారుకెళ్ళాడు.

షావుకారుగారి ధాన్యపు కొట్ల వరండాలో నలుగురు పెద్ద మనుష్యులు కూర్చుని గాలికబుర్లు మాట్లాడుకుంటూ వుండగా, మున్సబు వాళ్ల దగ్గర చేరాడు. స్తంభానికి ఆనుకొని, నాపరాయి మీద చతికెలబడి, పుగాకు చుట్ట వెలిగించాడు.

"ఏం మున్సబూ! నీ కూతురి పెళ్ళి భోజనాలు ఎప్పుడు పెడతావ్ ?" అన్నాడు గోపాలంగారి గోవిందయ్య మోకాళ్ళకూ నడుంకూ బిగించుకొన్న పై పంచను వొదులుచేస్తూ.

"త్వరలోనే పెట్టేట్టున్నాడు. ఊళ్ళో అందరికీ ఓ పూట పసందైన భోజనాలు." అన్నాడు చిన్న అంకయ్య నాలుక పైన నీరు కదులాడగా.

" —— లంక సంబంధం స్థిరపడ్డట్టేనా? పెళ్ళి పెద్ద ఎత్తున చేయాలి. ఆ లంక జనం ఆశ్చర్యపోవాలి. మన ఊరి దెబ్బ చూపెట్టాలి" అన్నాడు అచ్చెమ్మగారి నారాయణయ్య గొంతులో జీరకలిగేంత పెద్దగా. తనకి ఏ కుపుట్ల చెముడు అన్న సంగతి పెద్దగా మాట్లాడటం ద్వారానే వ్యక్తపర్చుకునే అలవాటు ఆయనకు మొదట్నుంచీ వుంది.

మున్సబు మనస్సులోని సంతోషాన్ని ముసిముసి నవ్వుల ద్వారా బయటపెట్టాడు.

"కట్నం ఏ మాత్రం ఇస్తున్నావు?" అన్నాడు గోవిందయ్య.

"ఇంత అని ఏముంది? అంతా పిల్లకేగా!" అన్నాడు చిన అంకయ్య.

"ఇల్లరికపు టల్లుడేనా?" అన్నాడు నారాయణయ్య.

"అంత పెద్ద చదువు చదివినోడు-ఇల్లరికపు టల్లుడుగా యీ ఊళ్ళో వుంటాడా? ఉద్యోగం చేయవద్దూ. మున్సబుకు పేరు తేవద్దూ!" అన్నాడు గోవిందయ్య.

"నాకు తెల్వ కడుగుతాగానీ, మున్సబూ! అంత చదువు మన వూళ్ళో ఎవడైనా చదివాడా?" అన్నాడు నారాయణయ్య.

అదే సమయంలో మున్సబుగారి పాలేరు రొప్పుతూ పరుగెత్తుకొంటూ వొచ్చాడు. వాడ్ని అల్లంత దూరాన చూసిన మున్సబు చివ్వున లేచి నిలబడ్డాడు.

"అమ్మాయిగారు ... బావిలో పడ్డారండి."

"ఆఁ!... నిజమా!" మున్సబు లావుపాటికాయాన్ని లెక్కచేయకుండా గుండె దడదడతో పరుగెత్తాడు.

గోవిందయ్యా, చినఅంకయ్యా, నారాయణయ్యా ఒకళ్ల ముఖా లొకళ్ళు కొన్ని క్షణాలు చూసికొని, వాళ్లూ మున్సబు ఇంటికేసి వెళ్లారు.

మున్సబు ఇంటికి వెళ్ళేటప్పటికే శైలారాణి బావి లోంచి బయటకు తీయబడింది. ఇరుగూ, పొరుగూ వాళ్ళు ఇరవై మంది వరకూ గుమికూడారు. ప్రక్క ఇంటి పర్వత వర్ధనమ్మ పెరటిగోడమీదున్న జామకొమ్మనుంచి జామ కాయలు కోయబోతూ, శైలారాణి ఆత్మహత్య చేసి కునేందుకు బావిలో ఎగిరి దూకడాన్ని స్వయంగా కళ్లారా చూసింది. ఆవిడ గుండెలు అవిసినంత పనై, ఊపిరి తిరక్క, గొంతు పెగలక, కళ్లు చెదిరి, వొళ్ళు బెదిరి – కొన్ని క్షణాల పిమ్మట, ఇంటిముందు మెల్లాలో పాతర త్రవ్వుతూన్న పెద్ద పాలేర్ని కేక వేసి చెప్పింది. వాడు అమాంతంగా బావిలో దూకి నీళ్ళు మ్రింగుతూ, అడుగును చూడబోతూన్న శైలా రాణిని జుట్టుపట్టుకొని పైకి ఎత్తాడు. అంతలో పర్వతవర్ధ నమ్మ పదిమందినీ ప్రోగుచేసి, బావిలోకి లావుపాటి చేంతాడు వేయించింది. ఆ చేంతాడు సహాయంతో ఇద్దరూ పైకి వచ్చారు. ఈ లోపల మున్సబుగారికి కబురందింది.

పెరటి దొడ్డివైపు వరండాలో పడుకోబెట్టబడిన కూతుర్ని చూసి మున్సబు గుండె కూచిపూడి చెఱువైంది. పైపంచ ముఖానికి అడ్డంగా పెట్టుకొని బావురు మన్నాడు.

"నీళ్లు త్రాగిందేమో, కక్కించండి."

"డాక్టరుకు కబురు పెట్టారా?"

"కాలు జారిపడిందా బావిలో?"

"చుట్టూ అర్ధగజం ఎత్తున గోడవుందిగా. నీళ్ళు తోడబోయిందా! పాలేరు ఏమైనాడు?"

"ఆశ్చర్యంగా వుంది."

—చుట్టూ చేరినజనం తలోరకంగా మాట్లాడసాగారు. ఆడవాళ్ళలో గుసగుసలు బుసలుపెట్టాయి. పర్వతవర్ధనమ్మనోరు విప్పినవోరు విప్పినట్టుగానేవుంది. ఆవిడను అడిగే అమ్మలక్కలకు సమాధానాలు చెప్పలేక సతమత మవుతూన్నది.

ఎల్. ఎఫ్. డిస్పెన్సరీ డాక్టరు వచ్చాడు. బాగా స్పృహలోకిరాని శైలారాణిని పరీక్షించాడు. ఎక్కువనీళ్ళు త్రాగలేదన్నాడు. పొట్ట వత్తాడు. గొంతు దగ్గర సవరించాడు. ముక్కుగోళ్ళు నలిపాడు. కళ్ళు తెరిపించి చూచాడు. నాడి పరిశీలించాడు. ప్రమాదం లేదన్నాడు. పదినిముషాల్లో స్పృహలోకి వస్తుందన్నాడు. ఇంజక్షను ఇచ్చాడు. అల్లాగే పది నిముషాల్లో శైలారాణికి స్పృహ వొచ్చింది. వేడి కాఫీ త్రాగించారు.

నిముషాలమీద ఊరంతా తెల్సింది – మున్సబుగారి అమ్మాయి శైలారాణి బావిలో పడిందని. కొంతమంది 'కాలు జారిపడిం'దన్నారు. మరికొంతమంది 'పడాల్సే పడిం'దన్నారు. ఇంకొంతమంది 'ఏమో! ఎట్లా పడిందో!' అన్నారు. కాని మున్సబుకు తెలుసు తనకూతురు అఘాయిత్యం తలపెట్టిందని.

ఆరోజు సాయంకాలం వరకూ ఊళ్ళో రైతులూ, పనీపాట వాళ్ళూ, స్త్రీలూ మున్సబుగా రింటికి వస్తూనే ఉన్నారు, పోతూనే ఉన్నారు.

ఆరోజురాత్రి ఏడున్నరగంటలకు కుమారస్వామి షికారు నుంచి తిరిగిరాగానే శశిరేఖ అన్నది—

"ఏంజరిగిందో విన్నావా?"

"ఏం జరిగింది?"

"శైలారాణి బావిలో పడింది."

"ఎవరూ? మున్సబుకూతురా! — బావిలో ఎందుకు పడింది? కాలుజారి పడిందా? పైకి తీశారా?"

"పడాల్సే పడింది. పైకితీశారు."

"నిజమా? అంతఖర్మ ఏంకాలింది?"

"తను గాఢంగా ప్రేమించిన యువకుడు పెళ్ళికి తిరస్కరిస్తే, మనస్సును వృథాగా పోగొట్టుకున్న యువతి అంతకంటె ఏంచేస్తుంది? ఆమె దురదృష్టమన్నా కావాలి, ఆ ప్రేమించబడ్డ వాని దురదృష్టమన్నా కావాలి."

"ఈ ప్రేమ విషయంలో ఆడవాళ్ళు ఎంత తొందర పాటు చూపెటుతున్నారు! ఎన్ని పొరపాట్లు చేస్తున్నారు? ఒక్కొక్కప్పుడు తమకు తామే పరిస్థితుల్ని విషమం చేసి కుంటున్నారు. శైలారాణి నన్ను ప్రేమించడ మేమిటి? అందులో గాఢంగానా? నేను వివాహానికి తిరస్కరిస్తే ఆత్మ హత్యకు పాల్పడిందంటె, ఆ వ్యామోహానికి అట్లా ఎందుకు బానిస కావాల్సివొచ్చిందో, బలహీన పడాల్సివొచ్చిందో, వ్యక్తిత్వాన్ని చంపుకోవాల్సివొచ్చిందో నాకు అర్థంగావడం లేదు. నేనామె అందానికి మూర్ఛపోలేదు. ఆమె ప్రేమను పొందేందుకు ప్రయత్నించలేదు. ఆమెలో వలపులు రేకెత్తించే చేష్టలు నేనేమీ చేయలేదు. ఆమె నా ఆరాధ్యదేవత కాదు.

ఈ ప్రేమ వ్యవహారం నాకు కొత్త. అభిలాష లేదు. పైపెచ్చు ద్వేషం. విశ్వాసం లేదు. సంసారసాగరంలో దిగి, అందరికి మల్లే జీవితాన్ని వ్యర్థం చేయటం నా ఆశయం కాదు. పాపం, ఆమెను చూస్తే నాకు జాలివేస్తూంది."

"ఊరికే జాలిపడి ఏం ప్రయోజనం? ఆమె బ్రతుకూ, భవిష్యత్తూ నీ చేతిలో ఉన్నాయి. ఆమె జీవితం అన్యాయం కాకుండా చూడాల్సిన బాధ్యత అజ్ఞాతంగా నీపై ఉన్నది. కొన్ని బాధ్యతలు మనకు తెలీకుండానే, హెచ్చరిక లేకుండానే చుట్టుకుంటాయి. వాటిని స్వీకరించి, ధర్మాన్ని మన్నించాల్సిన అగత్యం విజ్ఞులపై ఉంది. నువ్వు ఆమెను ప్రేమించక పోవచ్చు, ఆరాధించక పోవచ్చు, ఆమెకోసం ఆరాట పడక పోవచ్చు. కాని ఆమె నిన్ను ప్రేమించింది. ఆరాధించింది. నీకోసం ఆరాటపడుతూన్నది. చివరకు ఆత్మహత్యకు కూడా తలపడింది. నీ హృదయంలో ఆర్ద్రితకూ, కరుణాభావానికీ, జాలికీ మానవసహజమైన దయకూ, ధర్మానికీ స్థానంవుంటే; ప్రేమించిన స్త్రీ మనస్సును నువ్వు గుర్తించితే తప్పకుండా ఆమెను పెళ్లి చేసికోవాలి, పరిస్థితులకు అదే శుభప్రదమైన పరిణామం."

"మళ్ళీ మొదటికొస్తున్నావు వొదినా! పెళ్ళిచేసికోవడం నా జీవిత లక్ష్యం కాదని తెల్సియుండికూడా - అదే మార్గాన్ని సూచిస్తావా? చేయని నేరానికి శిక్ష అనుభవించేదా? నేను పెళ్ళి చేసికోకుండా, ఆమె జీవితం బాగుపడే పద్ధతేమి లేదా?"

"ఉన్నది —"

"ఏమిటది?"

"ఆత్మహత్య —"

"ఆఁ!"

"అవును. రాయిలాంటి హృదయం గల మనిషిని ప్రేమించి, మనస్సును పోగొట్టుకొని-బ్రతికే కంటె ఆత్మహత్య మెరుగు కాదూ! కుమారస్వామీ! నా మనోభిప్రాయాన్ని ఒక్క వాక్యంలో చెబుతున్నాను. శైలారాణిని పెళ్ళిచేసికోవడం నీ తక్షణ కర్తవ్యం; ఆ కర్తవ్యాన్ని గుర్తించి కూడా తప్పించుకోవటానికి మొండిగా ప్రవర్తించావంటే ఆమె బ్రతుక్కు తీరని అన్యాయం చేసిన పాపాత్ముడౌతావు."

"వొదినా" అంటూ కుమారస్వామి అరిచేతుల్లో ముఖాన్ని పెట్టుకొని కర్తవ్య విమూఢుడైనాడు.

శశిరేఖ వంటగదిలోకి వెళ్ళింది.

కుమారస్వామి మున్సబుగారి ఇంటికి వెళ్ళాడు. గదిలో కుర్చీలో కూర్చుని మునివ్రేళ్ళతో నుదురు నలుపుకొంటూ ఆలోచిస్తోన్న మున్సబు హరినారాయణ, అతని రాకకు అచ్చెరువొందాడు.

శైలారాణి మంచంమీదే పడుకొని ఉంది. ప్రమిద లోని చమురంతా ఇంకిపోయినట్టు పేలవంగా ఉంది. కళ్ళు లోతుల్లోకిపోయి, నిరాశను వ్యక్తంచేస్తున్నాయి. ముఖంలోని కళాకాంతుల్ని, మనోజ్ఞతను నీరసం ఆక్రమించుకుంది. తడిలేని

పెదాలు పాశలత్వాన్ని పోగొట్టుకొని, కరుగ్గా తయారై నాయి. నూనె ముఖం చూచి మూడు రోజులైన వొంకుల జుత్తు రెల్లు గడ్డిలా చెదిరిన మనస్సును చాటుతోంది. ఆ స్థితిలో వున్న శైలారాణి అతన్ని చూసి కారు చీకట్లో వెలుగు రేఖ పొడుచుకొచ్చినట్టు, పెదాలపై సంతోషపు మాడ్కు చిరునవ్వును దొర్లించింది.

ఆమె అందాన్ని గురించి స్పష్టమైన సదభిప్రాయాన్ని గలిగియున్న కుమారస్వామి ఆమెను చూడగానే 'శైలా రాణియేనా ?' అన్న సందిగ్ధావస్థలో పడ్డాడు.

"కూర్చో అబ్బాయి" కుర్చీ చూపెట్టాడు మున్సబు. కుర్చీలో కూర్చున్నాడు కుమారస్వామి. కొన్ని నిముషాల పాటు నిశ్శబ్దం జరిగిపోయింది.

"మీ అమ్మాయి ఆత్మహత్యకు ప్రయత్నం చేసిందట. ఎంత దారుణం ? అట్లాంటి బలహీనతకు ఎందుకు దిగజారాలి?" అన్నాడు కుమారస్వామి మున్సబుతో.

"అంతా ఖర్మ బాబూ! ఈ అభిమానాలూ, ప్రేమలూ, మమకారాలూ, సంఘటనలూ, పరిస్థితులూ – కర్మానుసారం గాక ఏముంది ? ఈ జన్మలో దీనికి సుఖపడే యోగం లేదు. ఆ యోగమే వుంటే ఈ ప్రేమలేమిటి, పట్టుదలలేమిటి, అఘా యిత్యాలేమిటి ? జీవితంలో సుఖశాంతుల్ని పొందదల్చుకున్న వాళ్ళ చేష్టలేనా ?"

తబ్బిబ్బుపడ్డాడు కుమారస్వామి. సమాధానంకోసం వెతుక్కున్నాడు.

"రాగద్వేషాల కతీతమైన దృఢమైన మనఃప్రవృత్తిని ఏర్పర్చుకోవాలి, అది కుదుర్చుకున్నతర్వాత మనిషి ఇట్లాంటి బలహీనతలకూ, అఘాయిత్యాలకూ పాల్పడడు. మానసికాంతర్జగత్తును నిర్మలంగా వుంచుకుంటే — ఇట్లాంటి ప్రమాదాలు రావు. తమ కోర్కెలకు రాస్తామూయబడ్డప్పుడు, తమ ఆలోచనలు బోగ్గాపడ్డప్పుడు, తమ నమ్మకాలు ఎదురుతిరిగినప్పుడు, పరిస్థితుల వొత్తిడివల్ల, మనుషులు — ముఖ్యంగా స్త్రీలు జీవితంపై కినుకవహించి, ప్రపంచంపై అలిగి, పరిణామాలకు భయపడి ఆత్మహత్యల్లాంటి దారుణక్రియలకు పూనుకుంటారు. ఈ అస్వస్థతను తొలగించుకుంటేనేగానీ స్త్రీలు జీవితంలో స్థిరత్వాన్ని సాధించలేరు."

"నువ్వుచెప్పేది బాగానేవుంది. అట్లా తొలగించుకోలేనివారి గతేమిటి?"

"చూస్తూనే ఉన్నాముగా! శైలారాణి నన్ను మనసారా ప్రేమించి, పొందలేక—ఈ దుస్థితికి దిగజారిందంటే శోచనీయంగావుంది. నా అభిప్రాయాన్ని నిర్మొహమాటంగా తెలియజేయటానికే వొచ్చాను. పెళ్లీ, పిల్లలూ, సంసారబంధనాలూ—ఇలాంటి జీవితంపట్ల నేను పూర్తిగా విముఖుడ్ని. నా ఆదర్శాల్ని అంచనావేయటంలో, నా మనస్తత్వాన్ని వూహించటంలో శైలారాణి పొరబడి వుండొచ్చు. ఆ పొరబాటు సరిదిద్దుకోవటానికి వీల్లేనటువంటిదికాదని నా అభిప్రాయం. పొరబాట్లనూ, తప్పులనూ సరిదిద్దుకోవటానికి ప్రతివ్యక్తీ జీవితంలో కొంతకాలాన్ని తప్పనిసరిగా వినియోగించాల్సి వుంటుంది. పురుషుని ప్రేమకు స్త్రీగానీ, స్త్రీప్రేమకు పురుషుడు

గానీ అంగీకారం తెలియబర్చనప్పుడు—ప్రేమించినవారు ఆశా భంగంతో ఆత్మహత్యచేసికోనవసరంలేదు. ఆత్మహత్యంటే పిరికిగా జీవితానికిభయపడి సుఖంగాచద్దామనే భ్రమ. తమతప్పి దాన్ని తెల్సికొని, సరిదిద్దుకొని, గుండెనిబ్బరంతో,భవిష్యత్తుపై విశ్వాసపూరితమైన చూపుతో, బ్రతుకుపై మమకారంతో – సుఖాన్నీ, శాంతినీ, స్థిరత్వాన్నీ పొందే అవకాశాలున్నాయి. ఈనాటి ప్రేమల్లో 'మోహం' పాళ్ళు జాస్తి. సహం ఆ సత్యాన్ని గ్రహించలేని ప్రేమజీవులు – తమ ప్రేమ నిజమైం దనీ, నిర్మలమైందనీ, పవిత్రమైందనీ గొప్పలు చెప్పుకుంటూ, తమని తాము వంచనచేసికొంటూ ఇతర్లను వంచన చేస్తూ వుంటారు. నా దృష్టిలో యువతీ యువకులమధ్య ప్రేమఅంటే అందమూ, ఆకర్షణా. అవి ఇరువురిలోనూ సమపాళ్ళల్లో వుండి, వర్ణభేదాలనూ, అంతస్థుల్నీ పాటించకుండా పెళ్ళిచేసి కుంటే – అది ఆదర్శప్రేమ. దాంపత్య జీవితంలో ఆ ఆదర్శ ప్రేమ ఎంతకాలం గట్టిగా నిలుస్తుందో గ్యారంటీ చెప్పలేము. యువతీ యువకులు గాఢంగా ప్రేమించుకొని, పరిస్థితుల ప్రతి బంధకాలవల్లనైతేనేమి, సంఘపు కట్టుబాట్లవల్లనైతేనేమి, అంతస్థుల్లోగల తేడాలవల్లనైతేనేమి – వివాహం జరక్క పోతే అది విషాదంతో కూడుకున్నప్రేమ. యువతీ యువకుల్లో ఎవ్వరో ఒక్కరే ప్రేమించటం జరిగితే – అది సహంప్రేమ. సహంప్రేమ బాపతంతా తమ పొరపాట్లను గుర్తించి, జీవి తాన్ని గాడిలోకి కదనొక్కటానికి పెద్దగా కష్టపడనక్కర్లేదు. శైలారాణి ప్రేమ 'సహంప్రేమ' జాతికి చెందినది గనుక – ఆమె తన పొరబాటును తెల్సికొని. ఎవరినైనా పెళ్ళిచేసి

కొని, జీవితంలో ఆనందాన్ని పొందేందుకు ప్రయత్నించవచ్చు."

మనస్సులోని ఆవేదనలతో చిక్కిపోయి, నిరాశ, నిస్పృహ, నీరసం, నిట్టూర్పులద్వారా వెలికిరాగా, మంచంలో ఉన్న శైలారాణి - "నేను మిమ్మల్ని తప్ప జీవితంలో పెళ్ళి చేసుకోను. మీరు పెళ్ళిచేసికోనంటే, పెళ్ళిలేకుండానే ఉండిపోతాను" అన్నది హీనస్వరంతో.

మున్సబు తలెత్తి కుమారస్వామికేసి చూశాడు.

"నన్ను గురించి అనవసరమైన భ్రాంతి పడుతున్నావు శైలారాణీ! నా మనస్తత్వపు లోతుల్నీ, ప్రేమను గురించీ, పరిణయాన్ని గురించీ, దాంపత్య జీవితాన్ని గురించీ నాకుగల వింత భావాల్నీ; బ్రతుకును నేను పరిశీలించే దృక్పథాల్నీ; నా ఆదర్శాల్నీ, ఆశయాల్నీ - తెల్సుకుంటే, నువ్వేకాదు ఏ స్త్రీ నన్ను ప్రేమించటానికి సాహసించదు. నువ్వు నన్ను ప్రేమించావంటే అది కేవలం యాదృచ్ఛికం; నన్ను అర్థం చేసికోజాలని తొట్రుపాటు; అపోహతో కూడుకున్న అతి విశ్వాసం. అల్లాంటి పరిణతి చెందని ప్రేమతో నన్ను గురించి కలలు గంటో, నా మనస్తత్వంపై అందమైన మేడను కట్టుకుంటో, భవిష్యత్తును చులకనగా అంచనాలకు తెచ్చుకుంటో, మూర్ఖ్యంగా ప్రవర్తించటం మంచిదికాదు. నిన్ను గురించీ, నీ బ్రతుకు సౌఖ్యాన్ని గురించీ మీ నాన్నగారు ఎన్నో ఆశల్ని పెట్టుకున్నారు. మిడిమిడి జ్ఞానంతో, ఆధారంలేని ఊహాలతో, ఆలోచనలతో - నిన్ను నువ్వు బాధపెట్టుకుంటూ పాపం

ఆయన్నుకూడా బాధ పెట్టటందేనికి? కడుపు కోతకు గురి చేయడ మెందుకు? ఇంకా నామీద మనస్సు పెట్టుకోక, ఎవరినైనా పెళ్లి చేసికొని-సుఖంగా జీవించు" అంటూ కుమారస్వామి కుర్చీలోంచి లేచి బయటి కొచ్చాడు.

అతను బయటికి వస్తూంటే శైలారాణి ఏడ్పు సన్నగా వినబడింది. అయినా కుమారస్వామి వెనక్కు తిరిగి చూడలేదు.

## ౧౩

ఆరోజు భోజనం చేశాక ప్రెసిడెంటు సుదర్శనం సమితి అధ్యక్షుడు జీప్ పంపించగా అందులో సమితి ఆఫీసుకు మీటింగుకు వెళ్ళాడు. సాయంత్రం వరకూ అక్కడే ఉన్నాడు. కను చీకటి పడుతూండగా మళ్ళీ ఆ జీప్‌లోనే ఇంటికి బయలు దేరాడు సుదర్శనం, స్టాండింగ్ కమిటీ మెంబరు నరసింహారావుతో పాటు. ఇరుపురూ కులాసాగా కబుర్లు చెప్పు కుంటున్నారు.

మెటల్ రోడ్డుదాటి సిమ్మెంటురోడ్డు అందుకొనేప్పుడు ఓ మలుపు వుంది. ఆ మలుపు ముందు మురుగు కాలువ వంతెన వుంది. ఆ వంతెన ప్రక్క చెట్లు ఉన్నాయి. ఎదురుగ్గా ఇనుప గర్డర్సు వేసికొని ఓ లారీ వొస్తూన్నది. ఆ లారీ ప్రక్కన బియ్యపుమూటల గేజీతో ఓ సైకిలు. ఏస్ డ్రైవర్‌గా పేరుపొందిన ఆ జీప్ డ్రైవరు నలభై మైళ్ళ స్పీడులో వస్తూ, టర్నింగులో తికమకబడి, సడెన్ బ్రేక్ వేయబోయి, క్లచ్

మీదకు త్వరగా కాలుపోక, యాక్సిలేటరుమీద కాలు గజగజ లాడగా, స్టీరింగుమీద చేతులకు చలిజ్వరం పోకగా, వేగాన్ని కంట్రోలు చేసికోలేక, టర్నింగ్ తిప్పుకోలేక జీపును ఆ చెట్టుకు దారుణంగా గుద్దాకు. అంతా క్షణాలపైన జరిగింది. ఘోర మైన యాక్సిడెంటు.

అద్దాలు పగిలి, ఇనుపరాడ్ కొట్టుకొని, ఫ్రంట్ సీటులో కూర్చున్న ప్రెసిడెంటు సుదర్శనం ఎడంకాలుకూ, ముఖానికీ బలమైన దెబ్బలు తగలగా నెత్తురుమడుగులో వాలిపోయాడు. డ్రైవరకూ మంచి గాయాలు తగిలాయి. వాళ్ళిద్దరిలో నర సింహారావుకు తక్కువ దెబ్బలు తగిలాయి. భుజంమీద గీచుకు పోగా, పైపంచతో నెత్తురు తుడుచుకుంటూ వెంటనే లేచి నిలబడ్డాడు.

కనుచీకటి ముదరగా ఎవ్వారి కెక్కడ దెబ్బలు తగిలి నాయో కనుక్కోవటం కొంచెం కష్టమైంది.

లారీడ్రైవరూ, క్లీనరూ, సైకిలుమీద పోతున్నవ్యక్తీ, దగ్గర పొలాల్లోవున్న రైతులూ ప్రమాదంజరిగిన దగ్గరకు పరుగెత్తుకుంటూ వచ్చారు. ఆ లారీలోనే సుదర్శనాన్నీ, డ్రైవరనూ బస్తీకి గవర్నమెంటు హాస్పటల్ కు తీసికెళ్ళారు.

ఆ విషయం వెంటనే ఊళ్ళో తెలియగా, కుమార స్వామీ, శశిరేఖా, మరికొంతమందీ బస్తీకి వెళ్ళారు.

"ప్రాణానికేమీ ప్రమాదంలేదు. కాని ఎడమతొంటికి బాగా దెబ్బతగిలింది. ఎముక విరిగింది, ఆ కాలు తొలగించ

వల్సిందే. ఉన్నందువల్ల ఉపయోగం లేకపోగా, ముున్ముందు శరీరానికి అపకారమే జరుగుతుంది." అన్నాడు డాక్టరు సుదర్శనాన్ని గురించి. ఆక్సిజన్ పెట్టాక అర్ధరాత్రికిగానీ స్పృహ లోకి రాలేదు.

డాక్టరుమాటలు విన్నమీదట మూర్ఛబోయింది శశిరేఖ.

దుఃఖోద్వేగంతో తల గట్టిగా పట్టుకున్నాడు కుమార స్వామి.

'విధి ఎంతపగబూనింది! పరిస్థితులు ఎట్లా విషమించాయి! అన్నయ్య - అన్నయ్య జీవితం ఎట్లాంటి ఇరుకు మలుపులోకి మళ్ళింది? భగవంతుడు కరుణామయుడు కాదు. 'శిష్టరక్షణ దుష్టశిక్షణ' అన్న వాక్యానికి అర్థంలేదు. మంచివాళ్ళను కష్టాల కాగానాలోకి నెట్టి, నల్లగా మాడ్చటం భగవంతునికి సరదా. ఆయన లీలలన్నీ మంచివాళ్ళకు బాధాపూరితాలే! అన్నయ్య మంచివాడుగా మారాడు. మునుపటి తన స్వార్థ పూరిత భావాల్నీ, కల్మషాత్మకపు ఆశయాల్ని, చెడును ప్రోత్స హించే ఆదర్శాల్నీ, అధర్మపు దృక్పథాల్నీ పూర్తిగా మార్చు కొన్నాడు. ప్రజాక్షేమం, ప్రజాశ్రేయస్సు, నీతీ, నిజాయితీలపట్ల అభిలాష, సమతా భావం, నిష్పాక్షికదృష్టి, ధార్మికతత్వం — తనలో యిముడ్చుకొని, మంచికోసం తీవ్రంగా కృషి చేస్తు న్నాడు. గ్రామాన్ని సౌభాగ్యవంతం చేయడానికి, పరిపాలనకూ ప్రజలకూ సన్నిహితం పెంపొందించడానికి, ప్రజలు తమ తమ కుటుంబ వ్యవస్థల్ని బాగుపర్చుకూంటూ గ్రామీణ వ్యవస్థను

పుష్టికరం చేసేందుకు తోడ్పడేట్టు తయారు చేయడానికి నిర్విరామంగా శ్రమజేస్తూన్న యీ సమయంలో భగవంతుడు అన్నయ్యపై ఆగ్రహం వహించాలా?' అనుకున్నాడు కుమారస్వామి.

పదిహేను రోజులకు డ్రైవరు ఆస్పత్రినుంచి బయటి కొచ్చాడు - ఒక చేయి అవుడుతో.

నెలాపదిహేను రోజుల తర్వాత ప్రెసిడెంటు సుదర్శనం ఇంటి కొచ్చాడు కొయ్యకాలు సాయంతో.

"ఊళ్ళో కొచ్చిన మరునాడే సుదర్శనం పంచాయితీ అధ్యక్ష పదవికి రాజీనామా ఇచ్చాడు.

మరుసటి నెలలోనే సోమయ్య బోర్డు అధ్యక్షుడైనాడు. సుదర్శనం ఊళ్లో రాజకీయాలకు పూర్తిగా స్వస్తి చెప్పాడు. ఎవరైనా సలహాలకు వొచ్చినా, తనకేమీ తెలీదంటు న్నాడు. మనిషిలో ఆధ్యాత్మిక విద్యపై మోజు, వేదాంత గ్రంథాలు చదవాలనే ఆసక్తి, తత్త్వవిచారణ పెరిగింది. గాంధీ దర్శనము, శ్రీభగవద్గీత, బ్రహ్మానంద బోధనలు, వివేకానంద జీవితచరిత్ర, సందేశ తరంగిణి, జ్ఞాన, రాజ, భక్తి యోగాలు, ప్రబోధరత్నాకరము, యోగవాసిష్ఠము, వివేక చూడామణి, భారతీయ తత్త్వశాస్త్రము మొదలైన గ్రంథాలు చదువసాగాడు. అప్పుడప్పుడూ శాస్త్రుర్లుగార్ని పిలిపించు కుంటూ వేదాంత చర్చలు చేయసాగాడు.

అన్నయ్యలోని మార్పుకు కుమారస్వామి దిగ్భ్రమ చెందలేదు. ఇంకా అన్నయ్య మారే దశలేదు. ఆధ్యాత్మిక జ్ఞానతత్త్వాన్ని వంటబట్టించుకొని, సాధనద్వారా శేషించిన జీవితంలో శాంతిని పొందడమే ఆయనకు మిగిలివుంది. అదే ఆయనబ్రతుక్కి చరమదశ. ఆ జీప్ యాక్సిడెంటు జరిగియుండక పోతే అన్నయ్యజీవితం ఎల్లావుండేదో! ... తను ఊహించ లేడు. ఈ సృష్టికి, ప్రకృతికి, కాలానికి, నిత్యవ్యవస్థకూ – అతీత మైన అజ్ఞాతశక్తి ఏదో ఉన్నది. ఆ శక్తి కల్పించే పరిస్థితులూ, పరిణామాలూ అనూహ్యాలు. ఆధునిక శాస్త్రవిజ్ఞానం ఎంత అభివృద్ధిచెందినా, మానవుడు గ్రహాంతరయాత్రలలో విజ యాన్ని సాధిస్తూన్నా, కొన్ని నిముషాలలో ప్రపంచాన్ని నాశనం చేయగల మారణాయుధాల్ని కనిపెట్టినా—హెచ్చరిక లేని సంఘటనాబలంతో జీవితపద్ధతుల్ని తారుమారుచేసే అతీతమైన అజ్ఞాతశక్తిని గుర్తించి, అదుపు ఆజ్ఞల్లో పెట్టలేక పోవడం జరుగుతూన్నది. ఆ శక్తిపై ఆధిక్యత సంపాదించిన నాడు—భగవంతునికీ, మానవునికీ తారతమ్యమేముంటుంది? అనుకున్నాడు కుమారస్వామి ఆరోజు అరటితోటలో గుడిసె ముందు మంచంపై కూర్చుని.

ఇంటివ్యవహారాలూ, పొలంఅజమాయిషీ చేయటమూ కుమారస్వామిమీద పడ్డాయి – సుదర్శనానికి యాక్సిడెంటు జరిగిన దగ్గర్నుంచీ.



135

# ౧౪

మున్నసబుగారు కబురుచేయగా ఒకరోజు సాయం కాలం కుమారస్వామి వెళ్ళాడు.

"మా అమ్మాయికి ప్రాణభిక్ష పెట్టు బాబూ!" దీనాతి దీనంగా అన్నాడు మున్నసబు.

విచలితుడైనాడు కుమారస్వామి.

"నిన్ను ప్రేమించిన నేరానికి ఆమెకీ శిక్ష విధిస్తావా? ఈ అన్యాయం లోకంలో ఎక్కడేనా వుందా? చూడూ, ఆమె తన చావును తనే తెచ్చిపెట్టుకోంటూన్నది. తన మనస్సును తనే నలిపివేసికొంటూన్నది. తన హృదయాన్ని తనే గాయ పర్చుకుంటూన్నది. ఇదంతా ఎందుకు? నిన్ను ప్రేమించటం వల్ల. నువ్వు నిర్దయగా తిరస్కరించడంవల్ల. ఒక స్త్రీ జీవితాన్ని నాశనంచేసిన అపకీర్తి, ఒక స్త్రీ బ్రతుకును బలిచేసిన పాపం – నిన్ను చుట్టుకొని, నీ జీవితంలో శాంతి సౌఖ్యాలు లేకుండా చేస్తాయి. అది గ్రహించి, ఇప్పటికైనా మా శైలా రాణిని పెళ్ళిచేసికోవటానికి అంగీకరించు అబ్బాయీ! మా ఇంటి దీపాన్ని నిలబెట్టినవాడివి అవుతావు! మా కంటిరెప్పని కాపాడిన వాడవుతావు!" మున్నసబుగారి ఆవేదనా పూరితమైన కంఠానికి స్తబ్ధుడైనాడు.

తలంతా దిమ్మెక్కినట్లయింది. గదిలో కెళ్ళి శైలా రాణిని చూశాడు. మనోచైతన్యరహితుడై కొన్ని నిముషాల పాటు తదేకదృష్టితో చూశాడు కుమారస్వామి.

...శరీరమంతా చిక్కి, సగానికి సగమై, అస్పష్టపు వెన్నెల మాదిరిగా ముఖమంతా పాలిపోయి, కళ్ళు అగాధాల్లోకి, తెలియని లోతుల్లోకి పోయి, పటపటలాడే లావణ్యమంతా జారిపోయి, నల్లగా నిగనిగలాడే జుత్తంతా, రాగి వర్ణానికొచ్చి, దిండుకు ఘోరంగా అంటుకు పోయి, జుగుప్సాకరంగా. చావుబ్రతుకుల సంధ్యానీడల్లో తారట్లాడుతున్నట్టు... వుంది శైలారాణి.

—తనకోసం; తనని మనసారా ప్రేమించి, తనతోడి జీవితాన్ని గురించి మధురంగా కలలుగని, తనని పొందలేని నిరాశా నిస్పృహలతో, మనోవేదనతో మంచంపట్టి, ఈ స్థితికి వొచ్చిందన్నమాట శైలారాణి. ఆమెకు బ్రతుకుపై ఆశలేదు. తన ప్రేమ పనికి రాకుండా పోయిందన్న దిగులూ, తన దృఢ విశ్వాసాలే తనని మోసం చేశాయన్న బాధా, తను పరాజయం ఎందుకు పొందాల్సి వొచ్చిందన్న ఉక్రోషమూ - ఆమెకు జీవితంపై మమకారాల్ని తొలగించి వేసినయి. మరణానికి దరఖాస్తు పెట్టుకొని, ఆమోదముద్రకోసం ఎదురు చూస్తోంది. శైలారాణికి మరణమే శరణ్యమా! వేరే గతి లేదా? జీవితంలో వెలుగుకోసం, తీయని అనుభూతులకోసం, సుఖంకోసం, స్థిరత్వంకోసం - ఒక నిర్ణయాన్ని చేసికొని, ఆ నిర్ణయానికి తను అంకితమై, కాలాన్ని ఆరాధనలో, అనురాగం కొఱకు వేటలో వృధాచేసికొన్న శైలారాణికి భగవంతుడు అప్పుడే చావును రాసి పెట్టాడా? అట్లా జరగటానికి వీల్లేదు. అట్లా జరిగితే నిజంగా ఆ పాపం, అపకీర్తి తనకే చుట్టుకుంటాయేమో!...... ఆమె జీవించటానికి,

మామూలు మనిషి కావటానికి, పూర్వపు సౌందర్యవతిగా రూపొందటానికి తను సహాయ పడాలి. జీవితంపై మమ కారాన్ని ఆమెకు కలిగించాల్సిన బాధ్యత తనపై ఉంది.

"శైలారాణీ!" నెమ్మదిగా పిలిచాడు కుమారస్వామి.

ఆమె తలత్రిప్పి చూసింది. లోతుకుపోయిన కళ్ళల్లో నీటితడి. పాలిపోయిన ముఖంలో అజ్ఞాతపు ఆనంద రేఖలు.

"నిన్ను నువ్వు ఎంత హీనస్థితిలోకి తెచ్చుకున్నావు? నిజంగా నేను ఊహించనిది పట్టుదలముందు ప్రాణాన్ని లెక్క చేయవని ఇప్పుడు గ్రహించాను. తాము నమ్ముకున్న విలువల్ని సాధించేందుకు స్త్రీలు ఎంతటి త్యాగానికైనా సిద్ధపడతారని తెల్సుకున్నాను. నిన్ను పెళ్ళిచేసికుంటాను. కాని కొంతకాలం పోవాలి. నన్ను నువ్వు బాగా అర్థంచేసికోవాలి. నా మనస్తత్వమూ, సంఘంపట్ల, లోకం పోకడపట్ల నాకుగల భావాలూ, జీవితంలో నేను ఏర్పర్చుకున్న ఆశయాలూ, వాటి సాధనకు నా ఆచరణ మార్గాలూ – నువ్వు పూర్తిగా తెల్సికోవాలి. అందుకు కొంతకాలము పడుతుంది. ఈలోపల నన్ను పరిశీలిస్తూ వుండు. అప్పటికి నేను నచ్చితే – వివాహం చేసికుంటాను."

శైలారాణి అంగీకార సూచకంగా, సంతృప్తిగా చిరునవ్వు నవ్వింది. ఆమె నేత్రాలు ఆనందోజ్జ్వలాలైనాయి.

మున్సబు హరినారాయణ గుండెమీద చేయిపెట్టుకొని నిట్టూర్పు విడిచాడు.

కుమారస్వామి "వస్తా" నంటూ బయటి కొచ్చాడు.

ఆ తర్వాత నెలరోజులకే శైలారాణి మామూలు మనిషైంది. మునుపటి అందమూ, లావణ్యమూ, సోయగమూ ఆమెలో పుంజుకున్నాయి. మున్సబు మంచి ముహూర్తం కోసం సిద్ధాంతికి కబురు పెట్టాడు.

౧౫

తను మారుతున్నాడు! అన్నయ్య మారాడు. పదవిని వొదిలేశాడు. రాజకీయాలకు స్వస్తి చెప్పాడు. దైవజిజ్ఞాసతో మానసిక తేజస్సును పొందేందుకు అవిరళంగా సాధన చేస్తున్నాడు. శైలారాణిలో కూడ మార్పువొచ్చింది. తన వాగ్దానంతో ఆమె మనోవ్యధలు పటాపంచలై, బ్రతుకుపై మమతల్ని పెంచుకుంటోంది. ఆమెకు తను పునర్జన్మను కలిగించాడు. ఆమె పరంగా తనలోనూ మార్పు దారి చేసికుంటోంది. తనలో మార్పు అవసరమా ?

తనెందుకు మారాలి ?

శైలారాణిని ప్రాణాపాయంనుంచి రక్షించేందుకు తను వాగ్దానం చేయాల్సి వొచ్చింది. తనని ప్రేమించి పొందలేని నిస్సహాయతతో, మరోమార్గంలేక, ఇంకొకర్ని వివాహం చేసికొని, 'జీవితాన్ని పొడిగించలేక, మరణానికి సిద్ధపడ్డ ఆమెకు జీవితంపై ఆశల్ని కలిగించాల్సిన పరిస్థితుల్లో తను, జీవితంలో పెళ్ళి చేసికోరాదు' అన్న ఆశయాన్నుంచి దిగిరావాల్సి వొచ్చింది. తను శైలారాణిని ప్రేమిస్తున్నాడా? ఏమో!

'ప్రేమ' అన్న పదానికి జీవితంలో విలువనిచ్చి, ఆలోచించాల్సిన అగత్యం వొస్తుందని తను ఎప్పుడూ అనుకోలేదు. ఆమెపై తనకి జాలివుంది; సానుభూతి వుంది. కాపాడాలన్న అభిలాషవుంది; ఆమె జీవితాన్ని బాగుపర్చాలన్న ఉత్సాహం వుంది. ఆ జాలీ, సానుభూతీ, అభిలాషా, ఉత్సాహమూ–ఆమెను వివాహమాడేందుకు ప్రోత్సహించడంలో తను కటువుగా ఆత్మ విమర్శ చేసికోవాల్సిన పనిలేదు.

...తనూ అందరిలాగా ఎందుకుజీవించరాదు ? తన ఆశయాల్లో, ఆదర్శాల్లో, దృక్పథాల్లో–చలనంలేకుండా మార్పులకు అవకాశాలులేకుండా, కొండరాయిలాగా ఎందుకుండాలి? లోకంలో అవినీతీ, అధర్మం, అన్యాయం, అక్రమం, స్వార్థం, మోసం, – ఉంటే తనెందుకు బాధ పడాలి? వాటిని నిర్మూలించటానికి తనెందుకు కంకణం కట్టుకోవాలి ? అందరి దృష్టిలో వేరుగా, ఆశయాల పురుగుగా, సంఘవిరోధిగా ఎందుకు చూడబడాలి ? ఇంతకాలంనుంచీ, ఈ ఊళ్ళో తను చేసిందేమిటి? తన ఆశయాల్లో కృతకృత్యుడైనాడా ? ఆచరణల్లో సఫలీకృతుడైనాడా ? గ్రామప్రజల్లో ప్రగతిశీలమైన చైతన్యాన్ని తీసికొని రాగలిగాడా ! అవినీతిని తుదముట్టించగలిగాడా ? గ్రామంలో జరిగే అక్రమాల్ని అరికట్టగలిగాడా? అన్యాయాల్ని జరక్కుండా ఆపగలిగాడా ? మనుషుల్లో స్వార్థం, మోసం, కక్షలూ, కార్పణ్యాలూ, దోపిడీతత్వం, వర్గ ద్వేషాలూ– తొలగించగలిగాడా ? లేదు. లేదు. షావుకారూ, ఆయన కొడుకూ, యానాది లక్ష్మి, చాకలి సుబ్బులూ మొదలైన వాళ్ళంతా యథేచ్ఛగా అవినీతిని కొనసాగిస్తున్నారు.

జోగయ్యస్థలం పంచాయితీభవన నిర్మాణానికి అందుబాటులో వుంటుందని, తను అన్నయ్యను పట్టుబట్టి, అలిగి, ఎట్టకేలకు మీటింగులో తీర్మానం ఆమోదింపజేస్తే, ఇపుడు సోమయ్యా వాళ్ళు అధికారంలోకి వొచ్చి, ఆ తీర్మానాన్ని అమలుజరుప కుండా చూస్తున్నారు. న్యాయాన్ని ఆచరణలో పెట్టేందుకు నిరాకరిస్తున్నారు. బసవనాగయ్యా ముఠావాళ్లు 'ఇది అన్యాయం, పాక్షిక ప్రవర్తన. అధికార తత్వం' అంటూ కేకలు వేస్తూ, ద్వేషాలను రగుల్చుకుంటున్నారు. తను సల్పిన కృషికి ఫలితమేమిటి? రథశాలలో పేకాట యథాతథంగా రేబవళ్ళూ జరుగుతూన్నది. కష్టించి, పనిచేసి, గ్రామాభ్యుదయానికి చేయూతనివ్వాల్సిన కొంతమంది యువకులు ఆ దుర్వ్యసనంలో చిక్కుకొని ఆర్థికంగా చితికిపోతున్నారు. ఆ పేకాట పిశాచాన్ని పారద్రోలటానికి తను పోలీసువారితో పోట్లాడి, పట్టించినందుకు అందరూ తనని విరోధిగాతలచారు. అన్నయ్యా ఆసరాతో ఆరాత్రే విడుదల చేయించుకున్నారు. మళ్లీ పేకాట ఊళ్లో మామూలుగా జరుగుతోంది. ఆ విషయంలో తనుచేసింది తనకి అవమానాన్ని తెచ్చిపెట్టిందిగానీ, ప్రయోజనమేమైనా కలిగిందా? ఊళ్లో కాపుసారాల బట్టీలు రోజూ ఎన్ని వెలుగుతున్నాయి? త్రాగుడు, వ్యసనంక్రింద ఎన్నిసంసారాలు నాశనమౌతున్నాయి? అరికట్టడం జరిగిందా? పంతుళ్ల ట్రాన్సఫర్లు, పంతులమ్మలతో ప్రణయాలు, డిస్పెన్సరీలో కుంభకోణాలూ, పన్ను వసూళ్లలో తప్పిళ్ళూ, శిస్తు చెల్లింపుల్లో తేడాలూ, ఖాళీస్థలాల దురాక్రమణా, ఎరువులు, పంచదార పంపిణీలలో పాక్షిక ప్రవర్తనా, దేవాలయాల

ఆదాయంలో భాగాలుకువరక జుట్లుజుట్లు పట్టుకుంటోన్న ట్రస్టీలూ — గ్రామంలో అలజడికి కారణాలైన అవన్నీ నిరాటంకంగా కొనసాగడంలేదూ! ఎవరు అడ్డుపడుతున్నారు. అడ్డుపడ్డా ప్రవాహపు వేగంలో తలెత్తిన గడ్డిపోచ చందమే గదా? అన్నయ్య అన్నట్టు ఈనాటి సంఘంలోని కుళ్ళూ, అవినీతీ, అధర్మమమూ, స్వలాభాపేక్షా కరుడుగట్టి పర్వత రూపాన్ని దాల్చాయి. ఆ పర్వతాన్ని కదిలించడానికి తన లాంటి వాళ్ళవల్ల ఏమౌతుంది!......ఈ సత్యాన్ని తెల్సికో లేకనే తనుయింతకాలమూ ఆశయాలంటూ, ఆదర్శాలంటూ, దృక్పథాలంటూ అమూల్యమైన కాలాన్ని వ్యర్థపుచ్చి, గడ్డి పోచలాగా గాలిలో ఎగిరాడు!

అంతేనా?

తన కృషి నిష్ఫలమేనా? - కాకేముంది?

నిష్ఫలంకాకూడదు! అపజయాన్ని పొందిన ఉద్వేగంతో, బలహీనతతో తను అట్లా అనుకుంటున్నాడు. నీతికీ, న్యాయానికీ, ధర్మవర్తనానికీ-ఎప్పటికైనా విజయం లభించి తీరుతుంది. లోకానికీ,తనకీ ముడిపెట్టుకొని-నలుగురూనడిచే ముళ్ళ బాటలో 'నారాయణా!' అనుకుంటూ, ఆత్మవంచనతో, నైతిక ధర్మాలను విడనాడి నడవడంలో జీవితానికి అర్థమేముంటుంది? పిరికివాళ్ళ పద్ధతి అది. తన ఆశయాలకు, ఆదర్శాలకు, దృక్పథాలకు-ఆచరణలో తాత్కాలికంగా సత్ఫలితాలు కనిపించక పోయినప్పటికీ, ఎప్పటికైనా తను తనమార్గంలో గమ్యస్థానం చేరుకోగలడు! ఆ దీక్షతో, సంకల్పంతో, మనోదారు

ధ్యంతో కృషిచేయాలి. ఫలితాల్ని సమీక్షించుకుంటూ కూర్చుంటే, ముందుకేం నడువగలడు ? కళ్ళారా కనబడే అన్యాయాలను, అక్రమాలను, అధర్మాలను చూస్తూ-మెదల్ల కండా పూరుకోవడమెట్లా ? తను ఆశయాల్ని వీడరాదు. ఆదర్శాల్ని సడలించరాదు. దృక్పథాలనుంచి వెనుక చూపు కూడదు ... ఆలోచించుకుంటూ కుమారస్వామి ఆ సాయం త్రం చీకటి చిక్కబడ్డాక చెరువుకట్ట రావిచెట్టు చెంతనుంచి ఇంటికివస్తూ అనుకున్నాడు.

స్నానంచేసి, వొదినె భోజనం వడ్డించగా తిని, ఎనిమిది న్నరకు తన గదిలోకివెళ్ళి పడుకున్నాడు కుమారస్వామి.

ఓ గంటన్నరసేపు థామస్ హార్డీ నవల చదివాడు. ఓ అరగంటసేపు రేడియోలో సంగీతం విన్నాడు.

నిద్రరాలేదు.

బయట ఇంటిచుట్టూ నీలి తెరలు దించిన విధంగా చీకటి. ఊరు మాటుమణిగిన నిశ్శబ్దం. ఆ నిశ్చల వాతావర ణంలో, గదిలో లైటు ఆర్పివేసి ఓ గంటసేపు ఆలోచించాడు. చివరలేని ఆలోచనలు మనస్సును చీకాకు పెట్టసాగాయి. బలవంతాన నిద్రబోయేందుకు ప్రయత్నం చేస్తూండగా - పెంకుటి చావడివైపు తలుపు తెరుచుకున్న చప్పుడు నెమ్మ దిగా వినవొచ్చింది.

'ఈ వేళప్పుడు ఆ తలుపు ఎవరు తెరిచారబ్బా!' అనుకుంటూ కుమారస్వామి ముఖంమీదనుంచి దుప్పటి తొల

గించి, లేచాడు. గదిలో లైటు వేయకుండానే, బెడ్ లైటు సన్నటికాంతిలో పెరటి దొడ్డివైపు తలుపు తెరిచాడు. పెరటి దొడ్లోంచి పెంకుటి చావట్లోకి ఓ చిన్న సందు వుంది.

ఆ సందులోంచి కుమారస్వామి మెల్లగా పెంకుటి చావటిమెరాబాలోకి వొచ్చాడు.

సంభ్రమాశ్చర్య, చకితుడైనాడు.

ఆ అర్ధరాత్రివేళ, వదిన, ఒక్కతే, గబగబా పెంకుటి చావట్లోకి వెళ్ళుతూన్నది...

కుమారస్వామి ఆమెను అనుసరించాడు.

శశిరేఖ చావట్లోకి వెళ్ళి, వెనక్కు దిరిగి చూసింది. ఆ సమయానికి కుమారస్వామి కొబ్బరిచెట్టు చాటున దాక్కున్నాడు.

చీకటి మిసమిస లాడుతున్నది.

దూలానికి వ్రేలాడ గట్టబడిన బండి క్రింద చెత్తమీద పెద్దపాలేరు కోటినాగులు పడుకున్నాడు. శశిరేఖ వాడి సరసన కూర్చుని, గాజులు చీకట్లో గల్లు మనగా కుడిచేత్తో తట్టి లేపింది. వాడు ఉలిక్కిపడి లేచి, పై పంచతో ముఖం తుడుచుకొని – "ఎధవది. అప్పుడే నిద్రట్టిందే!" అంటూ శశిరేఖను బలమైన చేతులతో దగ్గరకు లాక్కొని, చోక్కా లేని ఎదుర్రొమ్ములకు గట్టిగా హత్తుకున్నాడు.

దృఢమైన బాహుబంధనంలో శశిరేఖ సిల్కుగుడ్డలా నలిగిపోయింది.

రాత్రి వెచ్చబడింది. చీకటి వెచ్చబడింది. ఆ బండి క్రింద వరిగడ్డి వెచ్చబడింది. మోహావేశపు హృదయాలు వెచ్చబడ్డాయి. శరీరాలు వెచ్చబడ్డాయి.

ఆనందమే వెచ్చబడింది.

కాలం స్తంభించింది!

'ఎన్నాళ్ళనుంచి జరుగుతున్న దీ అవినీతి భాగోతం! వదినె ఎంత నీతిమాలినది! ఆమె విషయంలో తను పొర బడ్డాడు. ఆమె చదువుకున్నదని, సంస్కారవంతురాలని, సభ్యతగలదని, శీలవతని, నిష్కలంక చరితని, సద్వర్తనురా లని, లోకజ్ఞానం తెల్సిన ఇల్లాలని, నీతీ నిజాయితీలకూ జీవి తంలో ప్రాముఖ్యతనిచ్చి నిర్మలంగా నడచుకొనే ఆదర్శ సతీయని – తను ఇంతకాలమూ నమ్ముతూవొచ్చాడు. ఇప్పుడు అసలురంగు బయటపడింది. అన్నయ్యకు తెలిస్తే–అన్నయ్యకు తెలిసేవుంటుంది. ఏమీ చేయలేక వూరుకొని వుంటాడు. ఊళ్ళో తెలిస్తే... తెలిస్తే ఏముంది? ఈ ఇంటి పరువు ప్రతి ష్ఠలు, గౌరవమర్యాదలు, విలువలు, సాంప్రదాయాలు – వీధి దుమ్ములో కల్సిపోతాయి. పరువుమర్యాదలు పోయాక బ్రతికి మాత్రం ఏం ప్రయోజనం! అది బ్రతుకు కాదు; నరకం. ధర్మమూర్తియైన అన్నయ్యకు వొదినె ఎంత ద్రోహం చేస్తూ న్నది. సహించరాదు. క్షమించరాదు.' క్రోధావేశంతో శరీరం క్రిందూమీదూ అవుతూండగా, మెదడు మొద్దు బారగా, హృదయం పాషాణసమంకాగా కుమారస్వామి చీకట్లో చావట్లోకి వెళ్ళాడు.

చూరులోని బొడ్డుకత్తిలాగి, బండిచక్రాలదగ్గర నిలబడి, ప్రళయకాలభీకరుడై "వదినా!"అని గర్జించాడు కుమారస్వామి.

శశిరేఖను చెత్తమీద వొదిలి కోటినాగులు గాటిప్రక్కగా చీకట్లో పారిపోయాడు.

శశిరేఖ గజగజ వణుకుతూ, లేచి నిలబడింది స్తంభం చాటున.

"వదినా! నీ అవినీతి ప్రవర్తనకు తగిన శిక్ష" అంటూ కుమారస్వామి మీద కొచ్చాడు.

అతని చేతిలోని బొడ్డుకత్తిని ఆమె చూడలేదు.

క్షణంలో సగంసేపు.

కెవ్వున కేకవేసి, చీకట్లో నేల కొరిగింది శశిరేఖ. ఆమె పొట్టలోంచి చివ్వున రక్తం బయటకు చిందింది.

గాటికి కట్టివేసివున్న ఎడ్లు మెడ పట్టెళ్ళల్లోని గంటల్ని గలగల లాడించాయి.

కట్టుగొయ్యకు కట్టివేసి వున్న ఆవు 'అంబా' అని అరిచింది.

చీకటి సానుభూతిగా నిట్టూర్పు విడిచింది.

నెత్తురు తడి ఆరని బొడ్డుకత్తిని కుడిచేత్తో పట్టుకొని, నెత్తురు చిందిన మరకలు గల దుస్తులతో - ఇంట్లోకి వెళ్ళాడు కుమారస్వామి అన్నయ్య దగ్గరకు.

సుదర్శనం కిటికీలోంచి బయటకు చూస్తున్నాడు.

"అన్నయ్యా! పెంకుటి చావట్లో, కోటినాగులు ప్రక్కన వదిన - యీవేళప్పుడు...! ఈ కత్తితో పొడిచి చంపాను. తప్పుచేస్తే క్షమించు అన్నయ్యా!" అన్నాడు కుమారస్వామి గంభీరమైన స్వరంతో.

ఆ బొడ్డుకత్తినీ, నెత్తురు మరకలుగల దుస్తుల్నీ చూసి సుదర్శనం నివ్వెర పోయాడు.

"నేను చేయలేని పనిని నువ్వు చేశావు. భార్య అవినీతి ఎరిగియుండికూడా సహించాను; నువ్వు ఆవేశపరుడువిగనుక వొదినె అవినీతిని సహించలేక హత్యచేశావు ... జరిగిందేదో జరిగింది. కర్తవ్యం ఆలోచించు. ఇంట్లో అయిదు వేలరూపాయల డబ్బువుంది. ఆ డబ్బు తీసికొని, నువ్వు పారిపో. కేసు అదే మాసిపోతుంది. ఎన్నివేలైనాఖర్చుపెడతాను."అన్నాడు సుదర్శనం ఆదుర్దాని ప్రకటిస్తో.

నిశ్చేష్టుడై నిలబడ్డాడు కుమారస్వామి.

"ఊఁ! తీసికో డబ్బు ఆ ఇనప్పెట్టె తెరిచి, త్వరగా. ఆలస్యమైతే, ఊరంతా తెలుస్తుంది. నువ్వు పట్టుబడతావు." త్వర పెట్టాడు సుదర్శనం.

ఇనప్పెట్టె తెరచి, యాభైవందల రూపాయలనోట్లు తీసుకున్నాడు కుమారస్వామి. ఆ బొడ్డుకత్తి తీసికొని చీకట్లోకి వెళ్లాడు చావటిముందు మెరాబాలోకి.

... 'తను పారిపోవాలి! సాధ్యమైనంత త్వరగా. ఈ ఊరు వొదలి, బస్తీకి దూరంగా, ఇతర రాష్ట్రాల్లోకి ... పారి



## మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA124B188 |
| పుస్తకం పేరు | సంఘవిరోధి |
| తారీఖు | 29/10/24 |
| ముందు అట్ట | సరి |
| వెనుక అట్ట | సరి |
| మొత్తం పేజీలు | 152 |
| పెద్ద సైజు పేజీలు | సరి |
| ఖాళీ పేజీలు | సరి |
| లేని పేజీలు | సరి |
| తయారు చేసినది | Kasimbi |
| పేజీలు విడదీసినది | Kasimbi |
| స్కాన్ చేసినది | Ch.Ramya |
| పరీక్ష చేసినది | DAVEED |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | Good |